# స్వాతంత్ర్య దినోత్సవం

ఆగస్టు 15వ తేదీ భారతదేశానికి పండుగ దినం. దేశంలో మూల మూలలా ఆనాడు స్వాతంత్ర్య దినోత్సవం వైభవోపేతంగా అనంత భవిష్యత్తులో జరుగుతూనే వుంటుంది. ఆనాడు జరిగిన విప్లవాత్మక మార్పును తరతరాల వారు ఆనందంతో స్మరించుకుంటూనె వుంటారు. ఈ కాలంలో జీవిస్తూ, ఆ సంఘటనను కళ్ళారచూచి, ఆనందించిన మనం ప్రతిఏటా ఆరోజున పండగ చేసుకోవటంలో ఆశ్చర్యం ఏమీలేదు. 1948 ఆగస్టు 15 వ తేదీన భారతదేశమంతా ఆనందంతో నిండిపోయింది. ఆనాడు ఉత్సవం జరగని గ్రామం ఈ దేశంలో లేనేలేదు.

స్వాతంత్ర్యదినోత్సవం ఉత్సాహంతో జరుపుకున్నామే గాని గత సంవత్సరం మనం ఎదుర్కొన్న కఠినసమస్యలు, ఈ సంవత్సరం మనం గడవవలసిన విపత్తులు మన మనస్సులను ఒకవంక కలచి వేస్తూనేవున్నవి. రాజకీయంగా దేశం గత సంవత్సరారంభంలోకంటె అంతంలోనే ఎక్కువ ప్రమాదకర పరిస్థితులలో వున్నది. హైదరాబాద్ సమస్య ఐక్యరాజ్య సమితికి వెళ్ళింది; విదేశాలలో మనపైన దుష్ప్రచారం విరివిగా సాగుతున్నది. మన నాయకులు సకాలంలో దానిని అణచివేయ లేక చివరకు మరింత కష్టపడవలసివచ్చింది. ఏదో ఒక కఠినచర్య తీసుకుంటేనేతప్ప నిజాం త్రోవకు రాడని తేలిపోయింది. హైదరాబాద్ పై సైనికచర్యలు ప్రారంభిస్తే భారతముస్లింలు సహించి వూరుకుంటారా? కల్లోలం ప్రారంభించి దేశమంతా అరాచకం వ్యాపింపజేస్తారా? పాకిస్థాన్ హైదరాబాద్ ప్రభుత్వానికి ప్రత్యక్షంగా ఏమైనా సహాయం చేస్తుందా? ప్రపంచం మన చర్యను హర్షిస్తుందా? ఇటువంటి ప్రశ్నలు మనప్రభుత్వాన్ని, ప్రజలను కలవరపెడుతున్నవి. హైదరాబాద్ విషయంలో మనం ఒక విపత్తును ఎదుర్కొనవలసి వుంటుందని అందరూ గుర్తించారు.

కాశ్మీర్ వ్యవహారాలుకూడా మనకు వ్యతిరేకంగానే పరిణమిస్తున్నాయి. తన సేనలు కాశ్మీర్ యుద్ధంలో పాల్గొంటున్నాయని పాకిస్తాన్ ప్రభుత్వం అంగీకరిస్తున్నా, మనం ఎంతో ఆశలు, విశ్వాసము పెట్టుకున్న భద్రతామండలి, ఏమీ చేయలేక వూరుకుంటున్నది. కాశ్మీర్ సమస్యను పెంచి, ఇండియా-పాకిస్తాన్ల వివాద పరిష్కార సంఘమని ఒక సంఘాన్ని పంపించినది. ఈ సంఘం మనకు అపకారమేగాని ఉపకారం చేయలేదన్నవిషయం అప్పుడే తేలిపోతున్నది. పాకిస్తాన్ తన సేనలను బాహాటంగా కాశ్మీర్లో నింపుతున్నది. ఐక్యరాజ్యసమితి సంఘాన్ని పాకిస్తాన్ ప్రభుత్వం లెక్క చేయుటమే లేదు. కాశ్మీర్లో మనం పెద్దపెట్టున యుద్ధం ప్రారంభించటానికికూడా వీలులేకుండా వున్నది, ఈ కమిషన్ నియామకం వలన.

దేశంలో కమ్యూనిస్టుల అలజడి అనాటికానాడు పెరిగిపోతున్నది. విధ్వంసకచర్యలు జరపటానికి, దౌర్జన్యంచేయుటానికి వీరు వెనుదీయుటం లేదు. వీరిని పట్టుకొనటానికి మన పోలీసులు అవలంబిస్తున్న అవివేక విధానంవల్ల ప్రజలలో ప్రభుత్వంపట్ల అసంతృప్తి ప్రబలుతున్నది. కాంగ్రెస్వాదులలో అనైక్యత, కాంగ్రెస్ ప్రభుత్వాలు—కాంగ్రెస్ సంఘాలమధ్య వివాదాలు ఆందోళన జనకంగా వున్నాయి. పదవీ వ్యామోహం కాంగ్రెస్ సంస్థను నాశనం చేస్తున్నది. కాంగ్రెస్పార్టీ క్రమశిక్షణ సడలిపోతున్నది. కాంగ్రెస్వాదుల, ప్రభుత్వోద్యోగుల నైతికపతనము కాంగ్రెస్సంస్థకు, భారతప్రభుత్వానికి మాలిన్యాన్ని ఆపాదిస్తున్నది. దేశంలో ప్రజాస్వామ్యపద్ధతుల స్థాపనకు బదులు ఏకపక్ష ప్రభుత్వస్థాపన జరుగుతున్నది. మతదురహంకారము, మతవిద్వేషాలు ఏమాత్రము తగ్గలేదు. హిందూమహాసభ, ముస్లింలీగ్లు రాజకీయరంగం నుంచి నిష్క్రమించటానికి నిర్ణయించినా, అది తాత్కాలిక నిర్ణయమేనని, అదైనా హృదయపూర్వకనిర్ణయంగాక పైకి నటనమాత్రమే నని బయటపడుతున్నది. ఇటు ఈ మతవిద్వేషాలను, అటు ఏకపక్షనియం

తృత్వవిధానాలను అటు దౌర్జన్యవిధానాలను ఎదుర్కొని దేశంలో ప్రజాస్వామ్యానికి పునాదివేయటం కష్టంమీదనైనా సాధించటానికి వీలైన పనిగా కనపడటంలేదు.

కాందిశీకుల పునరావాసపు ఏర్పాట్లు ఒక తెన్నుకు రాలేదు; మన తప్పుల ఫలితం మనకట్టెదుట సాక్షాత్కరించి, వారిపట్ల జాలికలుగుతున్నదిగాని అవసరమైనంతసహాయం వారికి మనం వెంటనే చేయలేక వారిని బాధపెడుతున్నాము.

ఆర్థికంగా దేశం ఒక విపత్తును ఎదుర్కొనవలసివస్తున్నది. దేశంలో ఆహారధాన్యాలు కరువుగా వున్నాయి; విదేశాలలో ఎక్కువ ధరయిచ్చిఅయినా కొనటానికి విదేశనాణాల నిలువలు మనకులేవు. ఆహారధాన్యాల దిగుమతులు ఈవిధంగా మూడునాలుగేండ్లుజరిగితే, మన దేశ ఆర్థికసౌష్టవం దెబ్బతింటుందని పెద్దలు హెచ్చరిస్తున్నారు. దేశంలో అన్నివస్తువులు కరువుగా వుండి, ధరలు, జీవనవ్యయము పెరిగిపోతూ, కొత్తసమస్యలు తెచ్చిపెడుతున్నవి. వస్తువుల ఉత్పత్తికూడా గత సంవత్సరంకన్న కొంచెం పెరిగినా మామూలు స్థాయికి రావటంలేదు. యజమాని-కార్మికులసంబంధాలు, ప్రభుత్వము—పెట్టుబడిదారుల సంబంధాలు ఏమాత్రము సంతృప్తికరంగా లేవు. పెట్టుబడిదారులు, ప్రభుత్వం తమకు ఎన్నిసహాయాలుచేస్తున్నా, ఎన్నిసౌకర్యాలు చేస్తున్నా వాస్తవానికి సమ్మెచేస్తున్నారు. ప్రభుత్వాన్ని ఇరకాటంలో, ఇబ్బందిలోపెట్టి తమ స్వలాభాన్ని కాపాడుకోవాలని వీరు ప్రయత్నిస్తున్నారు.

దేశంలో ఇన్‌ఫ్లేషన్ ఆనాటికానాడు పెరుగుతూ ఒక పెద్దసమస్యగా పరిణమిస్తున్నది. కాందిశీకులకు సహాయాలకు, ఆహారధాన్యాలకు సబ్సిడీలకు, కాశ్మీర్ యుద్ధానికి ఎక్కువసొమ్ము ఖర్చవుతుండటంవల్ల ఇన్‌ఫ్లేషన్ ఇదివరకటికన్నా పెరుగుతున్నది. దీనిని త్వరగా ఎదుర్కొని పరిష్కరించకపోతే, గత యుద్ధానంతరం జర్మనీస్థితి మనకుకూడా దాపరిస్తుందేమోనని భయపడవలసివస్తున్నది.

అంతర్జాతీయంగా అగ్రరాజ్యాల విభేదాలు ఆనాటికానాడు వృద్ధిఅవుతూ, ప్రపంచం ఎటు నడుస్తున్నదో తెలుసుకోవటం కష్టంగా వున్నది. అగ్రరాజ్యాల వివాదాలవల్ల మన వైదేశికవిధానం దెబ్బ తింటున్నది. రాయబారత్వాలకు కొత్తయైన మన రాయబారులు దీనిని సరిచేయలేకపోతున్నారు. ఇండియా-బ్రిటన్‌ల భవిష్యత్ సంబంధాలు ఇంకా అనిశ్చితంగానే వుండి, ఎక్కువ అపోహలకు, విమర్శకు తావి స్తున్నవి. ఈసంబంధాల భవిష్యత్‌స్వరూపంవల్ల బ్రిటన్‌కుగాని, ఇండి యాకుగాని లాభనష్టాలు ఏమీ లేకపోయినా గతచరిత్రవల్ల ఈ సమస్య ఇంత ప్రముఖమౌతున్నది. ఈ సంబంధాలస్వరూపం త్వరలో తేల్చి, నూతనరాజ్యాంగచట్టంలో వెంటనే చేర్చవలసివుండటంవల్ల ఇదికూడా ఒక ముఖ్యసమస్యగా ఇప్పుడే వచ్చిపడుతున్నది.

జాతీయంగాను, అంతర్జాతీయంగాను, రాజకీయంగాను, ఆర్థికం గాను దేశం విపత్కరపరిస్థితులను వెంటనే ఎదుర్కొనవలసివస్తున్నదన్న విషయం ప్రతివారికి విచారాన్ని కలిగిస్తున్నది. దేశంలో ఎటుచూసినా ఆకలి, అసంతృప్తి, అవినీతి, ఆందోళన వ్యాపించిపోతున్నవి. స్వాతం త్ర్యంలో మొదటిసంవత్సరం చేసినంత కృషిఅయినా ఈ సంవత్సరం చేయలేకపోవచ్చుననే అధైర్యము, నిస్పృహ మనలను కృంగదీస్తున్నవి. మన భవిష్యత్తు అస్పష్టంగా, భయావహంగా కనపడుతున్నది. స్వాతం త్ర్యంలభించి, స్వపరిపాలనలో వున్నామనేవిషయం తప్ప సంతోషించ వలసింది ఏమీ కనపడటంలేదు. ఇటువంటి విపత్కర పరిస్థితులలో మనం స్వాతంత్ర్యోత్సవం ఉత్సాహంతో జరుపుకున్నాము. ఆ ఉత్సాహం తోనే, విజయాన్ని సాధించి తీరుదామనే పట్టుదలతోనే నూతనసంవత్సర కార్యరంగంలో ప్రవేశిస్తున్నాము.

# కాందిశీకులు

స్వాతంత్ర భారత ప్రజాప్రభుత్వం ఏర్పడీ ఏర్పడకముందే, ఎదు ర్కొనవలసివచ్చిన ముఖ్యసమస్య కాందిశీకులసమస్య. దేశవిభజనకు అంగీకరించేటప్పుడు మన నాయకులు చేసిన పొరపాట్లవల్లనే జనాభా మార్పిడి అవుసరమైంది. ముస్లింలీగ్ నాయకులు జనాభామార్పిడిపట్ల మొదటినుంచీ తమవైఖరి స్పష్టపరుస్తూనేవున్నారు. కాంగ్రెస్ నాయ కులు మాత్రమే తమ కృత్రిమ జాతీయ భావాలకు అంటిపెట్టుకునివుండి, ఎక్కడివారక్కడ వుండిపోవాలని, అల్పసంఖ్యాకులకు సంపూర్ణ రక్ష ణలు, హక్కులు హామీయివ్వాలని కబుర్లు చెపుతుండేవారు. దేశవిభజన స్థిరమై, స్వాతంత్ర్యం లభించిన తర్వాత ముస్లింలీగ్ నాయకులు తమ పంధాను ఆచరణలో పెట్టటం ప్రారంభించారు. పాకిస్థాన్‌కు ఆయువు పట్టయిన పశ్చిమ పాకిస్థాన్‌నుంచి, ముస్లిమేతరులనందరిని తరిమివేసి, తమ దేశశాంతిని, భద్రతను కాపాడుకోవటమే వారిపంధా. ఈ పంధా అనుసరణలో వారికి జనరల్ రీస్ అధ్వర్యాన ఏర్పడిన 'సరిహద్దు సైన్యం' ఏవిధంగా తోడ్పడిందో, గతసంచికలో గమనించాము. జనాభా మార్పిడి తప్పనిసరి యైపోయిందని గ్రహించినప్పుడు అందుకు అవుసర మైన జాగ్రత్తలను తీసుకోటానికి భారతప్రభుత్వం సిద్ధపడింది. పశ్చిమ పంజాబ్‌లో ముస్లిమేతరులకు జరుగవలసిన హాని అంతా అప్పటికే జరిగి పోయింది. భారతప్రభుత్వం పూనుకున్నా, పూనకోకపోయినా వారు తూర్పుపంజాబ్ వచ్చి చేరివుండేవారే. ప్రభుత్వం పూనుకోవటంవలన ఈపని కొంచెం తేలికయింది. అంతే.

కాందిశీకులను సురక్షితంగా జేరవేసి, తాత్కాలికసౌకర్యాలు, సదుపాయాలు ఏర్పరచి వారిభయాన్ని పోగొట్టటం ఒకవంతు; వారికి తగువృత్తులు, ఉద్యోగాలు చూపించి, ఇతర అన్నివిధాల సహాయపడి

శాశ్వతంగా వారికి ఏర్పాట్లు చేయటం ఇంకొకవంతు. వీటిలో ఈ రెండవ పనియే చాల కష్టమైనది. 55 లక్షలమంది కాందిశీకులకు ఒక్కసారిగా ఎక్కడ శాశ్వతపు ఏర్పాట్లు చేయగలము? పశ్చిమ పాకిస్థాన్ నుంచి 55 లక్షలమందిని చేరవేయటానికి దాదాపు నెలరోజులు కూడా పట్టలేదు. వస్తున్నవారికి ఏజిల్లాకు ఆజిల్లాలో కాందిశీక శిబిరాలు ఏర్పాటుచేసి, దేశంలో బొంతలు, కంబళ్లు, చొక్కాలు, గుడ్డలు ప్రోగుచేసి ఇవ్వటము, ప్రభుత్వ గిడ్డంగులనుంచి ఆహారధాన్యాలు తెచ్చియివ్వటము, సొమ్ము ఎంత ఖర్చయినా, తేలికగానే జరిగినది; వాస్తవానికి అది తేలికైన విషయమే. కాని 55 లక్షలమందిని ఎంతకాలమని కాందిశీక శిబిరాలలో పోషించగలము? కాందిశీకులందరిని సురక్షితంగా చేరవేసిన తర్వాత ఈవిషయం తీవ్రంగా ఆలోచనలోకి వచ్చింది. కాందిశీకుల పునరావాసానికి ఏర్పాట్లు చేయటానికి 'పునరావాసశాఖను' ఏర్పరచటము దానికి మంత్రిగా మొదట కె. సి. నియోగి, తరువాత మోహన్‌లాల్ సక్సేనా గారలు నియమింపబడటము జరిగింది.

1948 ఆగస్టు 15-వ తేదీనాటికి కాందిశీకుల పునరావాసపు ఏర్పాట్లు ఏమాత్రము సంతృప్తికరంగా జరగలేదు. పశ్చిమపంజాబ్‌నుంచి వచ్చిన గ్రామీణ కాందిశీకులను మాత్రం తూర్పుపంజాబ్ గ్రామాలలో నివసించమన్నారు. తూర్పుపంజాబ్‌నుంచి వెళ్ళిపోయిన ముస్లింలు వదలి వెళ్ళిన భూమిని వీరికి యివ్వటానికి, అనేక తర్జన భర్జనలు జరిగినమీదట నిర్ణయం జరిగింది. ఈనిర్ణయం అమలుజరగటానికి చాలకాలం గడచిపోవటమేగాక చాల అవకతవకలు కూడా జరిగాయి. ఇదివరకు తూర్పు పంజాబ్‌లోవున్న ముస్లిమేతరులు, ముస్లింలు వెళ్ళిపోగానే ఆ ఆస్తిపాస్తులు ఆక్రమించుకోవటము, క్రొత్తగావచ్చిన వారికి ఇక్కడ ఏమీ లేవని చెప్పటము, రికార్డులు మాయంచేయటము జరిగింది. కొన్నిచోట్ల ఒకే కాందిశీకుడు రెండుమూడు గ్రామాలలో పొలం తనపేర స్వాధీనపరచుకోవటము, ఒకేకుటుంబంలో వారు విభక్తులైపోయినట్లు నటించి ఎక్కువ

భూమిసంపాదించటమూ, బస్తీలలో వుండేవారు వ్యవసాయదారులమని చెప్పి భూమి సంపాదించటమూ జరిగింది. కొంతకాలానికిమాత్రే, చాల భూమి అన్యాక్రమితంగావుండి, బీడుగావుండి, ఎంతో పంట నష్టమై పోయింది. స్థానిక కాంగ్రెస్‌వారుల స్వార్థపరత్వము. ఉద్యోగుల అవినీతి మొదలైన ఇతరమార్గాలు ఆటంకాలు ఎప్పుడూ వుండనేవున్నవి. క్రమేణా, పునరావాస కార్యంలో ఉద్యోగులు, ఇతరులు కూడా అనుభవం సంపాదించి. ఈలోటుపాట్లు వీలైనంతవరకు సర్దుపాటుచేసుకుంటూ, తప్పులు దిద్దుకుంటూ గ్రామీణ ప్రజలకుమాత్రం తిరిగి కొంత భూవసతి చూపించగలిగారు. పశ్చిమ పాకిస్థాన్‌నుంచి వచ్చిన గ్రామీణ కాందిశీకుల సంఖ్య 35 లక్షల వరకు వుంటుంది; వీరిలో 30 లక్షల మంది పశ్చిమ పంజాబ్‌నుంచి వచ్చిన వారే. వీరిలో 20 లక్షల మందికి తూర్పుపంజాబ్‌లో భూములిచ్చారు. ఇతరులకు మత్స్యయూనియన్, బికనీర్, అజ్మీర్, ఢిల్లీ ప్రాంతాలలో భూములిచ్చారు. తక్కినవారు కాందిశీక శిబిరాలలోను, తమ బంధువుల ఇండ్లలోను మొదలైన ఇతర ప్రాంతాలలోను వుంటున్నారు. 1949 మార్చినెలాఖరుకు కూడా కాందిశీక శిబిరాలలో 8 లక్షల మంది కాందిశీకులు వున్నారు; వీరి సౌకర్యాలకు భారతప్రభుత్వం రోజుకు కనీసం రూ. 8 లక్షలు ఖర్చుచేస్తున్నది. ఇంతవరకు ఈపద్దుక్రింద ఖర్చు మొత్తం రూ. 16 కోట్లకు మించిపోయింది.

తూర్పుపంజాబ్ గ్రామాలలో స్థిరనివాసా లేర్పరచుకున్న 20 లక్షలమందిగాక, తక్కిన 36 లక్షలమంది కాందిశీకులకు వివిధరాష్ట్రాలలో శాశ్వత ఏర్పాట్లుచేసే విషయం ఆలోచించటానికి 1948 జూలై నెలలో రాష్ట్ర, సంస్థానాల ప్రధానుల సమావేశం ఢిల్లీలో జరిగింది. వీరి నిర్ణయాలను గమనించి. వాటిప్రకారం రాష్ట్రాలకు, సంస్థానాలకు కాందిశీకుల 'కోటాలను' నిర్ణయించి, ఆయాప్రభుత్వాలు, తమకోటా కాందిశీకులకు పునరావాసపు ఏర్పాట్లు చేయవలసిందని భారతప్రభుత్వం 1948 అక్టోబరు నెలలో ఆదేశించింది. ఆకోటాలప్రకారం తూర్పుపంజాబ్

(సంస్థానాలతోసహా) 13 లక్షల కాందిశీకులకు; బొంబాయి రాష్ట్రం 5 లక్షల కాందిశీకులకు; యు. పి. 4 లక్షల కాందిశీకులకు; సి. పి. 3 లక్షల కాందిశీకులకు; ఢిల్లీ 2½ లక్షల కాందిశీకులకు; మధ్యభారత్ 2 లక్షల కాందిశీకులకు; మత్స్యయూనియన్ 1 లక్ష కాందిశీకులకు; జయపూర్ 1 లక్ష కాందిశీకులకు; ఉదయపూర్ 1 లక్ష కాందిశీకులకు; సౌరాష్ట్ర 1 లక్ష కాందిశీకులకు; అజ్మీర్, బికనీర్, జోద్‌పూర్, వింధ్య ప్రదేశ్‌లు ఒక్కొక్కటి 50 వేల కాందిశీకులకు పునరావాసపు ఏర్పాట్లు చేయవలసి వుంటుంది.

వ్యవసాయదారులగు కాందిశీకులకు భూములు యివ్వటంతో వారి సమస్య చాలవరకు పరిష్కారమవుతుంది. ముస్లింలు వదలిపోయిన ఇండ్లు వారికిఇవ్వవచ్చును; లేదా కొద్ది ధనసహాయంచేస్తే వారే ఏదో ఒక రకపు ఇల్లుకట్టుకుంటారు. కొత్తగా వ్యవసాయపుపనిముట్లు, పశువులు వగైరా కొనుక్కోనేటందుకు ధనసహాయంకూడా చెయ్యాలి. ఈ సహాయం అంతా కలిసి కుటుంబానికి వెయ్యిరూపాయలు మించదు. ఈ కార్యభారం తూర్పుపంజాబ్ రాష్ట్రప్రభుత్వము, సంస్థానాల ప్రభుత్వాలు తమపై వేసుకున్నవి. ఆపని ఇప్పటికి దాదాపు పూర్తిగా, సక్రమంగా జరిగిందని చెప్పవచ్చును.

పట్నవాసులగు కాందిశీకులకు శాశ్వత ఏర్పాట్లు చేయడం ఇంత తేలికైన పనికాదు. గ్రామాలలోకన్న పట్నాలలో కల్లోలసమయంలో, ఆస్తులు ఎక్కువగా ధ్వంసమైపోయాయి. పశ్చిమ పాకిస్థాన్‌నుంచి వచ్చిన కాందిశీకులకు ఇప్పుడు కొత్తగా ఇండ్లు కట్టి యివ్వవలసివస్తున్నది; ఈ ఇండ్లు ఎక్కువఖరీదు అవుతవి; వీటికి కావలసిన సామగ్రి దొరకటం కూడ కష్టమే. ఈబాధ్యత కాందిశీకులపైన వదలితే వారు ఎంతైనా బాధపడతారు. కాందిశీకులకు ఇండ్లు కట్టి యివ్వటంతో వారి సమస్య పరిష్కారంకాదు. వీరు తిరిగి తమతమ వృత్తులు, ఉద్యోగాలు మొదలైన వ్యాపకాలలో ప్రవేశించటానికి సౌకర్యాలు ఏర్పరచాలి. విద్యార్థులు

తమ చదువు సాగించటానికి సరియైన తోడ్పాటు చేయాలి. ఇది అసలు కష్టమైన కార్యక్రమం.

కాందిశీక విద్యార్థుల విషయం ప్రభుత్వం శ్రద్ధగాపరిశీలించి సరియైన ఏర్పాట్లు చేసింది. ఢిల్లీలోను, కాందిశీకులు ఎక్కువగా గుమికూడిన ఇతరప్రాంతాలలోను స్కూల్స్, కాలేజీలు రెండు షిఫ్టులుగా పనిచేసేటట్లు ఏర్పాటుచేసి, ఎక్కువమంది విద్యార్థులు చదువుకోటానికి ఏర్పాటు చేశారు. కొత్తగా కాలేజీలు, స్కూళ్ళు అనేకం స్థాపించారు. తూర్పు పంజాబ్ విశ్వవిద్యాలయంకూడా స్థాపించారు. విద్యార్థులకు, ఈ కొత్త పాఠశాలలకు అయ్యేఖర్చు కేంద్రప్రభుత్వం భరిస్తున్నది. మొత్తంమీద 10 వేల మంది విద్యార్థులు ఈవిధంగా చదువుకుంటున్నారు. వీరికొరకు ఈ సంవత్సరం రూ. 5,23,870 లు భారత ప్రభుత్వం ఖర్చుచేసింది.

కాందిశీక ఉద్యోగులను 'ఎంప్లాయ్ మెంట్ ఎక్స్ఛేంజి'లలో నమోదు చేసి, వారివారికి తగిన ఉద్యోగాలు వెతుకుతున్నారు. ఈపని చాల నెమ్మదిగా జరుగుతుంది. మనదేశంలో ఈ 'ఎంప్లాయ్ మెంట్ ఎక్స్ఛేంజి' లు స్థాపించి ఎంతోకాలం కాలేదు; వాటి ఉద్యోగులకు ఉన్నఅనుభవం తక్కువ; వీటి ఉపయోగము, సౌకర్యము అటు యజమానులుగాని ఇటు ఉద్యోగులుగాని ఇంగా పూర్తిగా గ్రహింపలేదు. అయినప్పటికీ, కాందిశీకఉద్యోగులకు ఇవి చేతనైనంత సహాయంచేసినవి. ఇప్పటికి దాదాపు ఒకలక్ష కాందిశీక ఉద్యోగులకు వీటిద్వారా ఉద్యోగాలు లభించాయి - అంటే దాదాపు 5 లక్షల కాందిశీకులకు ఇవి సహాయం చేశాయన్నమాట.

వ్యాపారము, చేతివృత్తులు మొదలైన ఇతరవృత్తులలో కాందిశీకులకు స్థిరనివాసం ఏర్పాటుచేయటం ఇంతకన్న వ్యయకరమైన పని. ఒక్కొక్క వ్యవసాయదారునకు వెయ్యిరూపాయలు ధనసహాయం చెయ్యవలసివస్తే, వ్యాపారం చేసుకునేవారికి ఒక్కొక్కరికి 5, 6 వేల రూపాయలు, చేతివృత్తులలో వున్నవారికి 2, 3 వేలరూపాయలు అప్పుయిచ్చి సహాయం చేయవలసివుంటుంది. రూ 2000 కు లోబడిన అప్పులు

రాష్ట్రప్రభుత్వాలు యివ్వాలని కేంద్రప్రభుత్వం సూచించింది. అంతకు మించిన—దాదాపు రూ 10 వేలకు మించినవి—అప్పులు యివ్వటానికి గాను (RFA) కాందిశీకుల ఋణసహాయసంస్థ గత సంవత్సరం ఏర్పరచి దానికి మూలధనంగా 10 కోట్ల రూపాయలు ప్రభుత్వం పెట్టుబడిపెట్టింది. ఆసంస్థ ఇంతవరకు ఒకకోటి తొమ్మిదిలక్షల రూపాయలు అప్పులు మంజూరుచేసింది. లక్షరూపాయలకు మించి ఏ దరఖాస్తుదారునకూ అప్పుయివ్వరు; 10 వేల రూపాయలకు తక్కువ అప్పుకూడా వుండదు. ఈ విధంగా మొత్తం 742 దరఖాస్తుదారులకు అప్పులు యిచ్చారు; ఒక్కొక్కఅప్పు సగటు మొత్తం రూ 14 వేలు. దరఖాస్తుదారు ఒక వ్యక్తిగాని, కంపెనీగాని అయివుండవచ్చును. దరఖాస్తుదారు సూచించిన పరిశ్రమ లాభదాయకమని పునరావాస అభివృద్ధిసంస్థ RDB సిఫార్సు చేసినప్పుడే ఈఅప్పు యిస్తారు. కొందరు కాందిశీకులు కలిసి, ఒక సహకారసంఘంగా ఏర్పడి, తాము చేయదలుచుకున్న వ్యాపారాన్ని లేక స్థాపించదలచుకున్న పరిశ్రమనుగురించి RDB కి దరఖాస్తు చేస్తారు. ఆ దరఖాస్తు ప్రకారం RFA అప్పు మంజూరుచేస్తుంది. కాబట్టి RFA యిచ్చిన ప్రతిఅప్పు ఒక్క కాందిశీక కుటుంబానికిగాక కొన్ని కుటుంబాలకు ఉపయోగపడుతుంది; ఈవిధంగా ఇప్పటికి చాలమంది కాందిశీకులకు పునరావాసపు ఏర్పాట్లుజరిగాయి. ఈఅప్పులుగాక, కాందిశీకులు స్థాపించే సహకారసంఘాలకు, వీటిమెంబర్లు ప్రోగుచేసిన మూలధనమంతసొమ్ము, రూ 2500 కు తక్కువలేకుండా, విరాళం యివ్వటానికి కూడా ప్రభుత్వం నిశ్చయించింది.

పట్నాలలో స్థిరపడిపోయే కాందిశీకులకు 18 లక్షలమందికి కొత్తగా ఇండ్లు కట్టవలసి వస్తుందని ప్రభుత్వం అంచనావేసింది. ప్రతి కాందిశీక కుటుంబానికి ఒక ఇల్లుగాని, నివేశనస్థలము, ఇంటికి కావలసిన సామగ్రిగాని యిచ్చి తీరవలెనని ప్రభుత్వం నిశ్చయించింది. కాందిశీకులు ఏయే రాష్ట్రాలలో, సంస్థానాలలో స్థిరపడుతారో ఆప్రాంతప్రభుత్వమే

ఇందుకు కావలసిన సొమ్ము ఖర్చుచేసి, ఇండ్లుకట్టించి, అంతసొమ్ము కేంద్రప్రభుత్వంనుంచి తీసుకొనవచ్చును. అవసరమైతే, వీలైనచోట్ల కొత్తపట్టణాలు నిర్మించటంగాని, ఇప్పటున్న పట్టణాలలో కొత్తపేటలు నిర్మించటంగాని చేయవచ్చును. ఆయాప్రాంతాల ప్రభుత్వాలు వెంటనే తమ స్కీములు వేసుకుని, పని ప్రారంభించవలసిందని కేంద్రప్రభుత్వం సూచించింది. ఈస్కీములక్రింద ఇంతవరకు 16 కోట్ల 58 లక్షల రూపాయలు కేంద్రప్రభుత్వం మంజూరుచేసింది. ఆ మొత్తం ఆయారాష్ట్రాలకు ఈవిధంగా పంచారు: తూర్పుపంజాబ్ (సంస్థానాలతో) రూ 7 కోట్లు; యు. పి. రూ. 3 కోట్లు; సి. పి. రూ. 2.92 కోట్లు; రాజాస్థాన్ 2 కోట్ల 6 లక్షలు; మత్స్య రూ 45 లక్షలు; కాండ్లా రూ. 1 కోటి 10 లక్షలు: మధ్యభారత్ రూ. 5 లక్షలు వగైరా. ఈస్కీముల ప్రకారం ఆయా రాష్ట్రాలలో కట్టబడే ఇండ్లవివరాలు: ఢిల్లీ రాష్ట్రంలో రెండు వేల ఇండ్లు కట్టటం పూర్తయింది; 1600 ఇండ్లు కడుతున్నారు. పాటియాలాలో 60 వేలమందికి ఒక కొత్తపట్టణం నిర్మిస్తున్నారు. తూర్పు పంజాబ్‌లో 4 వేల ఇండ్లు కట్టారు; 6 వేల నివేశనస్థలాలు పంచి యిచ్చారు. యు. పి. లో 2 వేల ఇండ్లు, 6 వేల షాపులు, 12 వేలు షాపు-ఇండ్లు కట్టారు. 4 పట్టణాలలో కొత్తపేటలు కడుతున్నారు. రాజాస్థాన్‌లో 6850 ఇండ్లు కట్టారు, మధ్యభారత్‌లో 4 వేల ఇండ్లు, కాండ్లాలో 4 వేల ఇండ్లు, మత్స్యలో 1400 ఇండ్లు, అజ్మీర్‌లో 2000 ఇండ్లు కట్టారు. బొంబాయిలో కల్యాణ్ వద్ద చిన్నపట్టణం కడుతున్నారు.

కాందిశీకులు పాకిస్థాన్‌లో వదలివేసివచ్చిన స్థిర, చరాస్థులను గురించి పాకిస్థాన్‌తో సంప్రదింపులు అనేకపర్యాయాలు జరిగాయి. కాందిశీకుల చరాస్థులను తీసుకపోనివ్వటానికి అనుమతిస్తూ, ఈవిషయమై ఆలోచించటానికి, సౌకర్యాలు కలుగజేయుటానికి, ఫిర్యాదులు విచారించటానికి ఒక అంతరధినివేశ సంఘాన్ని నియమిస్తూ, 1948 సెప్టెంబరులో ఒక ఒడంబడిక జరిగింది. పట్నవాసపు కాందిశీకుల స్థిరాస్థులను ఒక

అధినివేశంలోనివారు ఇంకొక అధినివేశంవారితో స్వచ్ఛందంగా వినిమయం చేసుకోటాన్ని అంగీకరిస్తూ డిసెంబరులో ఒక ఒడంబడిక జరిగింది. వ్యవసాయపు భూముల విషయం ఏ ఒడంబడిక జరగలేదు. ఇప్పటికి జరిగిన రెండు ఒడంబడికలు పాకిస్థాన్ ప్రభుత్వం ఏమాత్రము అమలుజరపడం లేదు. ఈవిషయం వేరొకచోట ప్రస్తావిద్దాము. ఆస్థులు మార్చుకోటానికి పాకిస్థాన్ వెళ్ళే ముస్లిమేతరులను పాకిస్థాన్ ప్రభుత్వం నిర్బంధించడము కూడా జరుగుచున్నది. కాందిశీకుల ఆస్థులు స్వచ్ఛందంగా మార్చుకోడానికి, అమ్ముకోటానికి వీలులేకుండా ఒక ఆర్డినెన్సు జూలై నెలలో పాకిస్థాన్ గవర్నర్ జనరల్ జారీచేశాడు. భారతదేశంనుంచి పాకిస్థాన్ వెళ్ళి, కాందిశీకులమని చెప్పుకుని ఆస్థి సంపాదించుకుని, రెండు అధినివేశాలలోను ఆస్థులు అనుభవిస్తున్నవారి ఆటలు కట్టించటానికి భారత ప్రభుత్వం జారీచేసిన ఆర్డినెన్సుకు ఇది జవాబట! పాకిస్థాన్‌లో కాందిశీకులు విడిచివచ్చిన స్థిరచరాస్థులు వారికి ఏరీతిగానైనా తిరిగిలభిస్తాయనుకోవటం వెర్రిభ్రమ. పాకిస్థాన్ ఇంత న్యాయమాలోచించే దేశమే అయితే వారు కాందిశీకులుగా రానవసరమే వుండేదికాదు.

కాందిశీకుల పునరావాసానికి ప్రభుత్వం ఎంత సహాయంచేసినా, వారు స్వయంకృషి, పరస్పర సహకారములద్వారానే వారికి శాశ్వత, సంతృప్తికర ఏర్పాట్లు చేసుకోగలరు. ప్రతి కాందిశీకుడు ప్రభుత్వంఇచ్చే రూపాయితో రోజు గడిచిపోతున్నదిగదా అని ఊరికే కాలం వృధా పుచ్చకూడదు. వారినాయకులు, సాంఘిక ప్రచారకులు, ప్రభుత్వము వారిలో నూతన ఉత్తేజాన్ని కలిగించి, వారిని పురోగమనశీలురను చేయాలి. ఇందుకు కృషి చాల తక్కువగా జరుగుతున్నది. కాందిశీకులలో అసంతృప్తిని రేకెత్తించి, రాజకీయంగా లాభాలు పొందాలని కొందరు నాయకులు ప్రయత్నిస్తున్నారు. ఇదిచాల శోచనీయమైన విషయం.

1949 మార్చి నెలాఖరుకు ఇంకా 8 లక్షలమంది కాందిశీకులు కాందిశీక శిబిరాలలో వున్నారు. తక్కిన వారంతా దాదాపు పూర్తిగా స్థిరపడిపోయినారని చెప్పవచ్చును. బహుశః 1949—50 సంవత్సరాలలో కాందిశీకులసమస్య పూర్తిగా పరిష్కారం కావచ్చును. భారత ప్రభుత్వ కాందిశీక పునరావాసశాఖ కృషి కొందరికి సంతృప్తి నివ్వటం లేదు. ముఖ్యంగా RFA సంస్థ, RDB సంస్థలు చెప్పుకోదగిన కృషి ఏమీ చేయుటంలేదు. RFA కు యిచ్చిన మూలధనం రూ. 10 కోట్లకు గాను, రూ. 1 కోటిమాత్రమే ఇంతవరకు అప్పులు యిచ్చింది. ఇది RDB సంస్థలోపమనిచెప్పాలి. కాందిశీకులు ఏయేపరిశ్రమలు స్థాపించాలో, ఏయే వ్యాపారాలు చేయాలో ఈసంస్థ స్కీములువేసి, వారికి సహాయం చేయవలసింది; కాని ఈసంస్థ అటువంటిదేమీ చేయలేదు; పైగా కొన్నాళ్లు కాందిశీకులు స్థాపించబోయే పరిశ్రమలకు అడ్డుకూడా తగిలింది. కాందిశీకశాఖకు ప్రాంతీయసలహాదార్లు, కేంద్ర సలహాదార్లు నియమింపబడిన తర్వాత కార్యక్రమం కొంతచురుకుగా జరిగింది. అయితే, ముందువెనక చూడకుండా అడిగినదానికల్లా అప్పులు యివ్వటంకూడా తప్పేఅవుతుంది. అప్పు అడుగుతున్నవారి శక్తిసామర్థ్యాలు, నిజాయితీ, వారు స్థాపిస్తున్న పరిశ్రమ మంచిచెడ్డలు పరిశీలించవలసిందే. కాని ఆపని అతిత్వరగా జరగాలికాని ఆలస్యంగాకాదు. ఈపాటికి కాందిశీకులందరు స్థిరపడి ఆయావృత్తులలోను, పరిశ్రమలలోను వుంటే దేశంలో ఉత్పత్తి ఎక్కువ అయ్యేది; ప్రభుత్వవ్యయము కొన్నికోట్లు తగ్గేది; కాందిశీకుల వ్యథ ఎంతోతగ్గి, వారు మామూలు పౌరులయ్యేవారు. కాందిశీకశాఖ ఈసంవత్సరం నిర్వహించిన కార్యక్రమం అసంతృప్తికరంగా లేకపోయినా, ఇంకా చురుకుగా జరిగివుంటే చాలబాగుండేది.

# సంస్థానాలు

స్వాతంత్ర్య భారత ప్రజాప్రభుత్వం తొలిసంవత్సరపు పరిపాలనలో సాధించిన మహత్తర విజయం సంస్థాన ఏకీకరణ. సంస్థాన ఏకీకరణ కార్యక్రమం 1948 జనవరి 1వ తేదీతో ప్రారంభమైంది. ఆగస్టు 15వ తేదీ నాటికి ఆ కార్యక్రమం చాలవరకు పూర్తిఅయిందని చెప్పవచ్చును. అప్పటికే 220 సంస్థానాలు సంశ్లిష్టరాష్ట్రాలలో కలసిపోవటము, 294 సంస్థానాలు కలసి ఆరు సంస్థాన యూనియన్‌లుగా ఏర్పడటము, 22 సంస్థానాలు నేరుగా కేంద్రప్రభుత్వ పరిపాలనక్రిందకు రావటము జరిగింది. ఏడు నెలలకాలంలో త్వరత్వరగా జరిగిన ఈ ఏకీకరణను సంఘటితపరచి, స్థిరము చేయటము, ఇంకా మిగిలివున్న సంస్థానాలను ఏదో ఒకవిధంగా కలిపివేయటము ఈ సంవత్సరం సంస్థానశాఖ నిర్వహించిన కార్యక్రమము. గతసంవత్సరం ఏకీకరణలో, తొందరలో జరిగిన లోటుపాట్లు, మినహాయింపులు, పునరాలోచనవలన అవుసరమని తోచిన ఇతర మార్పులు ఈ సంవత్సరం ఎక్కువగా జరిగాయి. ఇకముందు కొన్ని ఏండ్లవరకు కూడ సంస్థానశాఖ కృషి ఇప్పుడు జరిగిన ఏకీకరణ స్థిరపడి సుపరిపాలనా సౌకర్యమును, సౌఖ్యమును ప్రజలు అనుభవించుటకు తగు ఏర్పాట్లు చేయటానికి సంబంధించి మాత్రమే వుంటుంది.

భారతప్రభుత్వ సంస్థానశాఖ తొలిసంవత్సరం సాధించిన విజయాలు, నిర్వహించిన కార్యక్రమం ఇక్కడ తిరిగి చెప్పనవుసరంలేదు. గతసంవత్సరం ఏకీకరణ జరుగగా మిగిలినవి 9 చిన్నసంస్థానాలు, 12 పెద్దసంస్థానాలు. ఈ 12 పెద్దసంస్థానాలు తమకాళ్ళపైన తాను నిలబడగలవు కాబట్టి—వాటి జనాభా, ఆదాయము చాల ఎక్కువ కాబట్టి అవి ఏకీకరణ కార్యక్రమంవల్ల ఏవిధంగాను మార్పుచెందవని అప్పుడు భావించారు. చిన్నసంస్థానాలు ఏనాటికైనా రాష్ట్రాలలోనో, సంస్థాన కూట

ములలోనో కలిసిపోవలసిందే అని అప్పుడే గ్రహించారు. ఈ సంవత్స రంలో చిన్నసంస్థానాలు, పెద్దసంస్థానాలుకూడా మాయమైనాయి. చిన్న సంస్థానాలలో రాంపూర్, జైసల్మీర్, సాంబూర్ లు రాష్ట్రాలతోను సంస్థాన యూనియన్లతోను కలిసిపోయాయి. తెహరి-గార్వాల్, బెనా రస్ లు త్వరలోనే యు. పి. లో చేరిపోతున్నాయి. కూచ్-బీహార్ కేంద్రప్రభుత్వాధీనమయింది. ఇక అస్సాం, తూర్పుబెంగాల్ సంస్థానా లైన మణిపూర్, త్రిపురా, కాసీ సంస్థానాలు మాత్రమే మిగిలివున్నాయి. ఇవికూడా త్వరలోనే ఆయా రాష్ట్రాలలో కలిపివేస్తారని భావింపవచ్చును.

పెద్దసంస్థానాలలో బరోడా, కొల్హాపూర్ లు బొంబాయిరాష్ట్రం లోను. మయూర్ భంజ్ ఒరిస్సాలోను, బికనీర్, జైపూర్, జోద్ పూర్, లు రాజస్థాన్ లోను, భోపాల్ కేంద్రప్రభుత్వ పాలిత ప్రాంతాలలోను, తిరువాన్కూర్, కొచ్చిన్ లు ఒక కూటమిగాను కలిసిపోయాయి. ఇక మైసూర్, హైదరాబాద్, కాశ్మీర్ లు మాత్రమే యథాతథంగా నిలిచి వున్నాయి.

బరోడాలో 1948 సెప్టెంబరులో సంపూర్ణ ప్రజాప్రభుత్వాన్ని ఏర్పాటుచేయడానికి మహారాజా అంగీకరించాడు. డాక్టర్ జీవరాజ్ మహాతా నాయకత్వాన మంత్రివర్గం ఏర్పడింది. అప్పటినుంచి కూడ సంస్థానం బొంబాయి రాష్ట్రంలో చేరిపోవాలని వాదంబలపడింది. కొల్హాపూర్ సంస్థానం బొంబాయిరాష్ట్రంలో చేరటానికి నవంబరు 25వ తేదీన నిశ్చయమయింది. 1949 జనవరి ఆఖరున దాని పరిపాలన బొంబాయి రాష్ట్రప్రభుత్వం వశపర్చుకుంది. బరోడా ప్రభుత్వం మే 1-వ తేదీన బొంబాయి ప్రభుత్వంలో కలిసిపోయింది.

భోపాల్ సంస్థానం సి. పి. రాష్ట్రంలో చేర్చాలని ప్రజలు చాల రోజులనుంచి ఆందోళన చేస్తున్నారు. కాని ప్రభువు ముస్లింకావటం వల్ల భారతప్రభుత్వం ఆకోర్కెకు తన మద్దతు యివ్వలేదు. చివరకు ఈ విషయమై స్థానికంగా సత్యాగ్రహం ప్రారంభమైంది. భోపాల్

నవాబు అప్పటికే బాధ్యతాయుత ప్రజాప్రభుత్వం ఏర్పరచాడు కాని సత్యాగ్రహ సమయంలో ఆ ప్రభుత్వం పరిస్థితులకు తాళలేకపోయింది. 1949 జనవరి 31 వ తేదీన సంస్థాన పరిపాలనను నవాబ్ వప్పజెప్పుకున్నాడు. మే 2 వ తేదీన భోపాల్ సంస్థానాన్ని, నవాబుతో ఒడంబడిక చేసుకుని, భారతప్రభుత్వం వశపరచుకున్నది.

రాజపుటానాలోని 10 సంస్థానాలు రాజాస్థాన్ గా గతసంవత్సరమే ఏర్పడ్డాయి. వీటికి ఉదయపూర్ మహారాజా రాజప్రముఖ్. జోధ్ పూర్, జైపూర్ మొదలైన ఇతర రాజపుటానాసంస్థానాలుకూడా ఇందులో కలిసి మహారాజాస్థాన్ గా ఏర్పడితే బాగుండునని భారత ప్రభుత్వం ఆలోచిస్తూనేవున్నది కాని ఆ సంస్థానాలు చాలపెద్దవై, తమ కాళ్ళపై తాము నిలబడగలవవటంవల్ల బాహాటంగా ఆకాంక్ష వెల్లడించలేకపోయింది. సంస్థాన ఏకీకరణ సత్ఫలితాలు గమనించినతర్వాత తాముకూడా రాజాస్థాన్‌లో చేరుతామని ఈ సంస్థానాలపాలకులు ముందుకువచ్చారు. మహారాజాస్థాన్ ఒడంబడిక ఫిబ్రవరి 16 వ తేదీన జరిగింది. ఈ సంస్థానకూటమికి మార్చి 30 వ తేదీన సర్దార్ పటేల్ జయపూర్‌లో ప్రారంభోత్సవం జరిపాడు. ఇదివరకు రాజాస్థాన్ గా ఏర్పడిన 10 సంస్థానాలుగాక పెద్దపెద్ద సంస్థానాలైన జయపూర్, జోధ్ పూర్, బికనీర్, జైసల్మీర్‌లు ఈ మహారాజాస్థాన్ కూటమిలో చేరాయి. మత్స్యరాజ్యాన్ని చీలదీసి, అందులోని ఆళ్వార్, కురేలీసంస్థానాలను ఈ కూటమిలో కలపాలనీ, ధోల్ పూర్, భరతపూర్ సంస్థానాలను యు. పి రాష్ట్రంలో కలపాలని తరువాత నిశ్చయించారు. ఆరెండుసంస్థానాలు కలువకముందే మనదేశంలోకల్లా రాజాస్థాన్ పెద్దరాష్ట్రమైంది; దీని వైశాల్యం 120,668 చదరపుమైళ్ళు; జనాభా 1 కోటి 21 లక్షలు; ఆదాయం రూ. 11 కోట్ల 87 లక్షలు.

సంస్థాన ఏకీకరణలో ఈ సంవత్సరం జరిగిన మరొకముఖ్య ఏకీకరణ తిరువాన్కూర్-కొచ్చిన్ ఏకీకరణ. ఇది రెండు దక్షిణాన అరేబియన్

సముద్రతీరంలోవున్న మలయాళీసంస్థానాలు. ఇవి రెండు ఒక యూనియన్‌గా ఏర్పడితే ఒక్క కేరళరాష్ట్రం ఏర్పడటం చాల తేలిక అవుతుంది. ఈ యూనియన్‌లోగాక ఒక్క మలబార్ జిల్లాలోనే మలయాళీలు వున్నారు. ఇతరజిల్లాలలో కొన్ని తాలూకాలుమాత్రము అటు, ఇటు చేర్చి, ఐక్యకేరళరాష్ట్రం త్వరలోనే స్థాపించవచ్చును. ఐక్యకేరళ ఉద్యమం బాగా బలపడుతున్నది; ఐక్యకేరళకు తిరువాన్కూర్ అడ్డం రాకుండా వుండేటందుకే, దాని పూర్వప్రధాని పట్టంతానుపిళ్ళైపై అవిశ్వాస తీర్మానాన్ని ప్యాసుచేసి, ఐక్యకేరళ ఉద్యమనాయకుడు నారాయణపిళ్ళైను ప్రధానిగా ఎన్నుకున్నారు. కొచ్చిన్ ప్రధాని ఇక్కండవారియర్ కూడా ఐక్యకేరళ ఉద్యమంలోనివాడే. వీరిద్దరు అధికారంలోనికి వచ్చినప్పటినుంచి ఐక్యకేరళ ఉద్యమం చాల బలపడింది. ఐక్యకేరళ రాష్ట్రానికి ప్రాతిపదికగా కేరళసంస్థానాలైన తిరువాన్కూర్-కొచ్చిన్‌లు ఒక యూనియన్‌గా ఏర్పడితే, మద్రాసురాష్ట్రంలోని మలబార్ జిల్లానుకూడా దానితో కలిపివేయవలసిందని తరువాత వాదించవచ్చునని వారి ఉద్దేశ్యము. ఈ యూనియన్‌కు సంబంధించిన సంప్రదింపులు మార్చినెలనుంచి జరుగుతున్నాయి. సంస్థానశాఖ సలహాదారు వి. పి. మీనన్ ఈ సంస్థానాలకువచ్చి సంస్థానాధీశ్వరులతోను, మంత్రులతోను సంప్రదింపులు జరిపి యూనియన్ స్థాపనకు వారిని సుముఖులను చేశాడు; ఈ రెండు సంస్థానాల ప్రధానులు, ప్రజానాయకులు ఏప్రిల్ 1 వ-తేదిన సంస్థానశాఖ మంత్రి సర్దార్ పటేల్ వద్దకు రాయబారంవెళ్ళి, యూనియన్ స్థాపనకు తమ సుముఖతను వెల్లడించారు. ఈ యూనియన్ స్థాపన సందర్భమున రెండు ప్రభుత్వాల ఏకీకరణ విషయంలో ఉత్పన్నమయ్యే సమస్యలను ఆలోచించి పరిష్కరించటానికిగాను, ఉభయసంస్థానాల, సంస్థానశాఖ ప్రతినిధులతో ఒక 'ఏకీకరణ సంఘం' ఏప్రిల్ 4 వ-తేదీన ఏర్పాటుచేశారు. ఆ సంఘసూచనల ప్రకారం రెండు ప్రభుత్వయంత్రాలను ఏకమొనర్చుకున్నారు. తిరువాన్కూర్ కొచ్చిన్ యూనియన్ 1949 వ సంవత్సరం జూలై 1 వ తేదీన

అమలులోనికి వచ్చింది. ఇందు కేవలం ... 5 మహారాజా రాజప్రముఖ్. ఉపరాజప్రముఖ్ లేరు. సంస్థానాలలోని కొన్ని సంస్థానాలు మాత్రం ఆయా మహారాజ్యాలలోను. ప్రతి దేశం చేస్తూ ఈ యూనియన్ ఒప్పందికలో అంగీకరించారు.

ఇప్పటికి ఈ ఏకీకరణ ప్రవాహంలో 539 సంస్థానాలు కొట్టుకు పోయినవి; వాటిలోనే 6 సంస్థానకూటములు ఏర్పడినాయి, మన రాష్ట్రాలు కొంతవరకు పెద్దవైనాయి. మిగిలివున్న చిన్నసంస్థానాలు అస్సాం, తూర్పుబెంగాల్ సంస్థానాలైన త్రిపుర, మణిపూర్, కాసీ సంస్థానాలు మాత్రమే. అవి ఆయా రాష్ట్రాలలో త్వరలోనే కలిసి పోతవి. అప్పటితో చిన్నసంస్థానాల సమస్య శాశ్వతంగా, పూర్తిగా పరిష్కారమవుతుంది. ఇక మిగిలివుండే పెద్దసంస్థానాలు మూడు మాత్రమే కాశ్మీర్, హైదరాబాద్, మైసూర్. కాశ్మీర్ సమస్య ఐక్యరాజ్య సమితి వరకు పోయింది కాబట్టి ఆ సంస్థానం ఇంకా కొన్ని ఏండ్లపాటు నిలిచి వుండవలసివస్తుంది; మైసూర్, హైదరాబాద్ లు ఆసన్నభవిష్యత్తులోనే విచ్ఛిన్నమై, భాషారాష్ట్రాలకు స్థానమివ్వవలసి వుంటుంది. అప్పటితో సంస్థానాల ఏకీకరణ పూర్తిఅవుతుంది. కాని ఈ ఏకీకరణ తొందరలో జరిగినది. కాబట్టి చాల లోటుపాట్లు వుంటవి; కొన్ని యూనియన్లు చాల చిన్నవి; కొన్నిచోట్ల రాష్ట్రాలలో కలపవలసిన సంస్థానాలను యూనియన్లుగా ఏర్పరచారు. ఇప్పటి యూనియన్లను యథాతథంగా వుంచితే భారతరాష్ట్రాలలో కొన్ని మరీపెద్దవి కొన్ని మరీచిన్నవిగా వుండి, పరిపాలనకు అసౌకర్యంగా వుంటవి. ఈవిషయం, దేశమంతటినీ దృష్టిలోవుంచుకుని, సుదీర్ఘంగా ఆలోచించి, దేశమంతా రాష్ట్రాలుగా పునర్విభజన చేయాలి. ఇప్పటి సంస్థాన యూనియన్, రాష్ట్రాలుపోయి, కొత్తరాష్ట్రాలు ఏర్పడాలి. అప్పుడే దేశపరిపాలన సుకరమౌతుంది.

సంస్థానాలను త్వరత్వరగా యూనియన్లుగా సమకూర్చటంతో వాటి పరిపాలన ఏమీ బాగుపడలేదు. కొన్ని సంస్థానాలలో ఇదివరకు

పరిపాలనా యంత్రమనేది లేనే లేదు. కొన్నిచోట్ల వున్నా, అది చాల పురాతన పద్ధతులలో, నిరంకుశ విధానంలో నడుస్తున్నది. ఇప్పుడు ప్రజాస్వామ్యపద్ధతుల ప్రకారం పరిపాలన జరపటానికి ఆ పరిపాలనా శాఖలు ఏమాత్రము పనికిరావు. ఏవో కొద్దిసంస్థానాలలో తప్ప సివిల్ సర్వీస్ అంటూ ఒకటి లేనేలేదు. సంస్థానాల ఏకీకరణ త్వరత్వరగా జరుగుతుండటాన్ని అవకాశంగా తీసుకొని సంస్థానాధీశ్వరులు, ఇతర ఉద్యోగస్థులు తమ స్వలాభాపేక్షలతో, వున్న పరిపాలనా యంత్రాన్ని కూడా ధ్వంసంచేశారు. కొత్తకొత్త పేరుకు యూనియన్లు ఏర్పడినా, వాటికి పరిపాలనా యంత్రము—అంటే నూతన ఆధునిక పద్ధతులపై పరిపాలన నిర్వహించగల శాఖ—లేనేలేదు. ఒక్కొక్క యూనియన్ ఏర్పరచిన తర్వాత దాని పరిపాలన విషయం ఆలోచించి, పరిపాలన ఉద్యోగులను తర్ఫీదు చేసుకుని, నియమించుకుని, సక్రమపరిపాలన ప్రారంభించవలసి వస్తున్నది. ఇది చాల ఆలస్యంగా జరిగేపని. అందువల్ల సంస్థానాల ఏకీకరణ జరిగినా దాని సత్ఫలితాలు ప్రజలు పొందలేకపోతున్నారు. పైగా వారికి, నూతన ప్రభుత్వానికి ఏమీ సంబంధాలు లేకుండావున్నవి. విప్లవాత్మక మార్పుజరిగినప్పుడల్లా ఇటువంటి శూన్యత, స్తబ్ధత ఏర్పడటం సహజమే. అయితే మనం ముందు జాగ్రత్తవహించివుండి, కొందరు ఉద్యోగులనైనా తర్ఫీదుచేసుకుని, త్వరత్వరగా పరిపాలనా యంత్రాన్ని పూర్తిగా నిర్మించుకొనవలసింది. కాని అనేక కారణాల వల్ల అది జరగలేదు. మొదట్లో సంస్థానశాఖ ఉద్యోగులు యూనియన్ ప్రభుత్వాలకు సలహాదారులుగా వెళ్ళి, పరిపాలనా వ్యవహారాలు చూస్తుండేవారు. కాని సంస్థానశాఖ ఈవిధంగా జోక్యం కల్పించుకోవటం కొత్తగా ఏర్పడ్డ యూనియన్ ప్రజాప్రభుత్వాలకు ఇష్టంలేకపోయింది. అందువల్ల ఈవిధానంమానివేయాలిసివచ్చింది. యూనియన్ మంత్రివర్గాలకు, కాంగ్రెస్‌సంఘాలకు ఎప్పుడూ సరియైన సంబంధాలు లేకపోవటం వలనకూడా పరిపాలన దెబ్బతింటున్నది. ఒక్కమాటుగా

తలవనితలంపుగా, బాధ్యతాయుత ప్రజాప్రభుత్వం నెలకొల్పటంకూడా తప్పేనని వీరు రుజువుచేస్తున్నారు. అందువల్ల, సంస్థానయూనియన్ మంత్రివర్గాలు తమప్రాంత కాంగ్రెస్ సంఘాలకుగాక సంస్థానశాఖ మంత్రికి బాధ్యతవహించి పనిచేస్తున్నవని ఈమధ్య సర్దార్ పటేల్ చెప్ప వలసివచ్చింది. ప్రజాస్వామ్య పద్ధతులు కొత్తగా స్థాపించేటప్పుడు ఇటు వంటి అవకతవకలు తప్పవేమో!

ప్రతి సంస్థాన యూనియన్‌కు, రాజ్యాంగచట్టం ప్రజాప్రతినిధులు ఏర్పరచాలని భారతప్రభుత్వం ఆదిలో నిర్ణయించింది. ఈ విధానం ప్రకారమే అన్నియూనియన్ల ఒడంబడికలలోను రాజ్యాంగచట్టం నిర్మించటానికి రాజ్యాంగపరిషత్తులు ఏర్పరచాలని షరతు పెట్టారు. మైసూరులాంటి పెద్ద సంస్థానాలలో రాజ్యాంగ పరిషత్తులు ఏర్పడి, కొంత కార్యక్రమం సాగించాయికూడా. కాని తరువాత జరిగిన సంఘ టనలవల్ల, ఇన్ని రాజ్యాంగపరిషత్తులు అనవుసరమని రుజువైనది. సంస్థాన యూనియన్‌లు, పెద్ద సంస్థానాలుకూడా రాష్ట్రప్రభుత్వాలు ఎన్ని అధి కారాలు దాఖలుపరుస్తవో అన్ని అధికారాలు కేంద్రప్రభుత్వానికి దాఖలు పరచాలని భారతప్రభుత్వం నిర్ణయించింది. ఇందుకు అన్నిసంస్థానాలు అంగీకరించి, కొత్త ఒడంబడికలు చేసుకున్నాయి. భారతదేశంలో బలిష్టమైన కేంద్రప్రభుత్వం ఏర్పడాలంటే సంస్థానాలుకూడా రాష్ట్రాల స్థాయికి రావటం ఎంతైనా అవుసరం. సంస్థానాలు కేవలం రాష్ట్రాల స్థాయికి వచ్చినప్పుడు వాటికికూడా స్వల్ప మార్పులతో, రాష్ట్ర రాజ్యాం గాన్నే అమలు చేయవచ్చును. అప్పుడు అనేక రాజ్యాంగపరిషత్తులకు అవుసరముండదు; ఎంతో సొమ్ము ఆదాఅవుతుంది. సంస్థానాలకుకూడా భారతరాజ్యాంగ పరిషత్తుచేతనే రాజ్యాంగం తయారుచేయించటం మంచి దని అందరూ గ్రహించారు; అన్నిసంస్థానాల ప్రతినిధులు అందుకు అంగీకరించారు. రాష్ట్ర రాజ్యాంగం సంస్థానాలకు వర్తించటానికి ఏయేమార్పులు చేయాలో ఆలోచించి, సూచించటానికి సర్ బి. యన్.

రావ్ అధ్యక్షతన ఒక ఉపసంఘం నియమింపబడింది. ఈ ఉపసంఘ కార్యక్రమం ఈమధ్యనే పూర్తిఅయింది. వీరి నివేదికను రాజ్యాంగ పరిషత్తు రానున్న సమావేశంలో చర్చించి, ఆమోదిస్తుంది. సంస్థానాలను యూనియన్‌లనుకూడా అన్నివిధాల రాష్ట్రాల స్థాయికి తేవటానికి తగినట్లుగా సంస్థాన రాజ్యాంగం నిర్మిస్తున్నారని మనం ఆశించవచ్చును.

సంస్థానాలన్నీ రాష్ట్రాలస్థాయికి వచ్చినప్పుడు ఉత్పన్నమవుతున్న ముఖ్యసమస్య వాటి ఫిస్కల్—పన్నులు, సుంకాలువిధించే—విధానం. ఇప్పుడు సంస్థానాలలో అనేక రకములైన పన్నులు విధింపబడుతున్నవి; ఒకసంస్థానమునకు ఇంకొక దానికిమధ్య సుంకాలు వసూలుచేస్తున్నారు. ఈ సుంకాలవల్ల ఆ సంస్థానాలకు ఆదాయం వస్తున్నది. ఇప్పుడు ఆ సుంకాలు తొలగించి, ఆ ఆదాయం పోగొట్టుకోవాలసి వస్తున్నది. దాని బదులు ఇతరపన్నులద్వారా ఆ ఆదాయాన్ని సమకూర్చుకోవాలి. సంస్థానాల ప్రజలపై పన్నువిధించే అధికారంకూడా కేంద్రప్రభుత్వానికి లభించాలి. కొన్ని సంస్థానాలలో ఆదాయపు పన్ను మొదలైనపన్నులు లేవు. వాటిలో ఇవి ప్రవేశపెట్టాలి; పన్నులు విధించి, వసూలుచేసే ఉద్యోగస్తులు లేరు; వారికి తర్ఫీదు యివ్వటానికి ఏర్పాట్లు చేయాలి. ఈవిషయాలన్నీ సమగ్రంగా ఆలోచించి, జరుగవలసిన మార్పులు, అందుకు కావలసిన రాజ్యాంగ సంస్కరణలు సూచించటానికి శ్రీ వి. టి. కృష్ణమాచారిగారి అధ్యక్షతన 1948 అక్టోబరులో ఒక సంఘం నియమించారు, ఈసంఘం అన్నిసంస్థానాలలోను పర్యటించి వాటి పన్నుల విధానాలను ఆదాయవ్యయాలను పరిశీలించింది. ఈ సంస్థానాలన్నిటి ప్రజలపైనకూడా రాష్ట్రాల ప్రజలపైనవలెనే, పన్నులు విధించటానికి కేంద్రప్రభుత్వానికి హక్కుయివ్వటానికి రాజ్యాంగసూత్రాలప్రకారం ఎటువంటి ఒడంబడిక జరగాలో ఈ సంఘం ఆలోచిస్తున్నది. ఈసంఘం సూచనలు అనుసరిస్తే రాష్ట్రాలు, సంస్థానాలు పన్నులవిషయంలో ఒకేస్థాయికివచ్చి, దేశమంతటా నిర్నిబంధంగా వ్యాపారం చేయటానికి వీలవుతుంది; పరిశ్రమల స్థాపనకూడా సుకరమౌతుంది.

సంస్థానాలలో కొన్నింటికి ప్రత్యేక సైన్యాలున్నవి. ఇవి ఇప్పుడు సంస్థాన యూనియన్ల పరమైనాయి. ఈ సైన్యాలకుగాను సంస్థానాలు చేస్తున్న వ్యయం ఇతర నిర్మాణాత్మక కార్యాలకు వినియోగిస్తే సంస్థానాలు, సంస్థాన ప్రజలుకూడా అధికంగా బాగుపడుతారు. సంస్థానాలు అన్నివిధాల రాష్ట్రాలస్థాయికి వచ్చేటప్పుడు వాటికి ప్రత్యేక సైన్యాలు అనవసరం. ఈ సైన్యాలైనా సరియైన శిక్షణ, సామగ్రి లేకుండా వున్నాయి. కాబట్టి వాటిని కేంద్రప్రభుత్వం వశపరుచుకుంటే దేశసైన్యము వృద్ధిఅవుతుంది; ఈసైన్యము ఇతరసైన్యాల స్థాయికి వస్తుంది; సంస్థానాలకు ఖర్చుతగ్గుతుంది. సంస్థానాల స్వంతసైన్యాలను కేంద్రప్రభుత్వాధీనం చేసేవిషయం ఆలోచించటానికి యూనియన్ల రాజప్రముఖ్‌లు, ఇతర పెద్ద సంస్థానాల ప్రధానులు జూలై నెలాఖరున న్యూఢిల్లీలో సమావేశమైనారు. ఈ సమావేశ నిర్ణయాలప్రకారం రాజప్రముఖ్‌లు, తమతమ ప్రాంతాల సంస్థానాలకు అధిపత్యం వహిస్తారుగాని అవి సర్వవిధాల కేంద్రప్రభుత్వ సైనికాధికారుల అధీనంలోవుంటాయి. నామమాత్రంగానయినా రాజప్రముఖ్‌లకు ఈ అధికారం ఇవ్వటం అనవసరం. ఈ సైన్యాలకుగాను ఆ సంస్థానాలు కొంతసొమ్ము ఖర్చుచేయవలసి వుంటుంది. అదికూడా అనవసరమే. సంస్థానాలు అన్నివిధాల రాష్ట్రాలస్థాయికి రావలసినప్పుడు వాటికి సైన్యమెందుకు? ఈవిషయం పునరాలోచించి సంస్థాన సైన్యాలను పూర్తిగా భారతసైన్యంలో చేర్చుకునేందుకు నిర్ణయించేయాలి.

సంస్థానాల పరిపాలనా భారంనుండి విముక్తులైన పాలకులు ఇప్పుడేమి చేస్తారనే ప్రశ్న కొందరికి తట్టుతున్నది. వీరందరు ఇంతవరకు నిరంకుశంగా, అవక తవగా పరిపాలన జరిపినవారేగాని సక్రమ పరిపాలనా పద్ధతులు తెలిసిన అనుభవశాలురుకాదు. వీరికి స్వంత ఆస్తిగా బోలెడుసొమ్ము యిచ్చారు. ఏటేటా భరణము కూడా చాల పెద మొత్తము యిస్తున్నారు. ఈ మొత్తాలను దుర్వినియోగం చేయకుండా,

పరిశ్రమలు, ప్రభుత్వ ఋణాలు మొదలైన నిర్మాణాత్మక కార్యాలలో వినియోగించేట్లు ప్రభుత్వం వీరికి సలహాయివ్వాలి. వీరిలో కొందరిని విదేశాలలో రాయబారులుగాను, కొందరిని భారత ప్రభుత్వోద్యోగులుగాను నియమించటం జరుగవచ్చునని ఈమధ్య తెలుస్తున్నది. ఇది బహుశః హానికరమైన సూచనేమో ఆలోచించాలి. నిరంకుశ విధానాలకు అలవాటుపడిన, అనుభవశూన్యులను, విద్యావిహీనులను పెద్ద పదవులలో నియమించటం ప్రజాస్వామ్య విధానం కాదు. మన విదేశ రాయబారులు చేస్తున్నకృషి సంతృప్తికరంగా లేదు; ఈ సంస్థానాధీశ్వరులు రాయబారులైతే మన విదేశాంగశాఖ నిందలపాలౌతుంది. వీరు ప్రభుత్వోద్యోగులైతే ప్రజలలో అసంతృప్తి ప్రబలి పెరుగుతుంది. వీరికి కావలసినంత భరణము, స్వంతఆస్తి ఇచ్చినప్పుడు ఇటువంటి పెద్దహోదాలు అందుకు శక్తి సామర్థ్యాలు, తెలివితేటలు గమనించి యివ్వాలిసిన హోదాలు యివ్వటం అన్యాయము, అక్రమము, హానికరము. ఇటువంటి పని భారతప్రభుత్వం చేయదని ఆశించాలి.

సంస్థానాలను సర్వవిధాల రాష్ట్రాల స్థాయికి తేవటంలో సంస్థాన శాఖ కృషి చాలవరకు పూర్తి అవుతుంది. ఈ సంవత్సరం మన సంస్థాన శాఖ తన విజయ యాత్రను ఒక మెట్టు ముందుకు సాగించింది. గతసంవత్సర మంతటి పురోగమనం ఇక ఎప్పుడూ సాధ్యపడదు. కాని ఈ సంవత్సరం జరిగిన కృషికూడా ఏమీ అనల్పముకాదు. దీని ఫలితాలు వచ్చేసంవత్సరంగాని బాగా గోచరించవు.

# హైదరాబాద్

"దక్షిణాన హైదరాబాద్ కూడా కాశ్మీర్ వలె గణరంగంగా మారే టట్లున్నది. ఐక్యరాజ్యసమితికి భారతప్రభుత్వంపై ఫిర్యాదుచేయ టానికి నిజాం నిశ్చయించాడు. దీనివల్ల అతడికి ఏమిలాభించినా, లాభిం చకపోయినా మనను కొంత ఇబ్బంది పెట్టటం మాత్రం జరుగుతుంది. అగ్రరాజ్యాలు ఈ అవకాశాన్ని ఉపయోగించుకుని భారతప్రభుత్వానికి మరికొన్నిసంకటాలు తెచ్చిపెట్టవచ్చును. మన వైదేశివిధానానికి, మన రాయబారులకు ఇది మరొక పరీక్షారంగం కావచ్చును. హైదరాబాద్ పై సైనికచర్యలే అవసరమైతే, భారతసైనికులకుకూడా ఇది పరీక్షారంగ మౌతుంది; ఈ సైనికచర్యలు ఒకవారం పది రోజులకన్న ఎక్కువకాలం పట్టకపోవచ్చును." 'నవభారతం 1947-48' లో వ్రాసిన ఈ వాక్యాలు ఈ సంవత్సరారంభంలోనే కార్యరూపంలో సత్యాలుగా ఏవిధంగా రుజువు జరిగిందీ మనకు తెలుసును. ఈ సంవత్సరారంభంలో హైదరా బాద్ సమస్య ఎంత ఆందోళనజనకంగా వున్నదో ఇప్పుడు అంత ఆహ్లాద కరంగా వున్నది. భారతసంస్థానా లన్నిటితోపాటు అన్నివిషయాలలోను ముందంజవేయటానికి హైదరాబాద్ సిద్ధంగా వున్నది; హైదరా బాద్ లో పరిపాలనాయంత్రము ఇతరసంస్థానాలలోకన్న ఇప్పుడు బలిష్ట ముగానుండి చాల సక్రమంగా పనిచేస్తూ, రాష్ట్రప్రభుత్వాల పరిపాలనకు దీటుగా వున్నది.

1948 ఆగస్టు 15 వ తేదీనాటికి హైదరాబాద్ అతివిషమసమ స్యగా వున్నది. ఆగస్టు 6 వ తేదీననే ఇండియా-హైదరాబాద్ ల సంప్రదింపులు విఫలమైపోయాయి. న్యూఢిల్లీ లోని హైదరాబాద్ ఏజెంట్ జనరల్ ను ఇంటికి పిలిపించి, అతనిస్థానే ఇంకొకరిని నియమించటంకూడా జరిగింది. హైదరాబాద్ సమస్యను ఐక్యరాజ్యసమితికి నివేదించటానికి



నిజాం నవాబు, అతని మంత్రివర్గము చురుకుగా ప్రయత్నాలు చేస్తున్నారు. సిడ్నీ కాటన్ విమానాలలో కరాచీనుండి ఆయుధసామగ్రి అనుదినము వచ్చి చేరుతున్నది. తమ సర్వస్వతంత్రతను పునరుద్ఘాటిస్తూ అతని అనుచరులు అనేకప్రకటనలు చేస్తున్నారు. హైదరాబాద్ వ్యవహారాలను వివరిస్తూ, ఆగస్టు 10 వ తేదీన, భారతప్రభుత్వం ఒక 'శ్వేతపత్రం' ప్రకటించింది. హైదరాబాద్ పూర్వచరిత్రను, హైదరాబాద్‌లోని బ్రిటిష్‌ప్రతినిధులు నిజాంను ఏవిధంగా మందలిస్తూవచ్చినదీ, భారతప్రభుత్వం గత 150 ఏండ్లనుంచి నిజాంపై ఎట్టి అధికారాలు చలాయిస్తూవచ్చినదీ సమీక్షించి, హైదరాబాద్ పెద్దసంస్థానమైనంత మాత్రాన, దానికి వేరుగా సైన్యము, తపాలాసౌకర్యాలు, చలామణీ మొదలగునవి వున్నంతమాత్రాన అది ప్రత్యేక దేశంగా భావించటానికి ఎందుకు వీలులేదో వివరించి, 'సార్వభౌమత్వము' తొలగించినా ఏ సంస్థానము సర్వస్వతంత్రదేశముగా ఏర్పడరాదని బ్రిటిష్‌ప్రభుత్వము ఏవిధముగా ప్రకటించినదో చర్చించి, సంస్థానభవిష్యత్తు, సంస్థానానికి, ఇండియాకు వుండవలసిన సంబంధాలు సంస్థానప్రజలే నిర్ణయించవలెనని ఈ శ్వేతపత్రంలో భారతప్రభుత్వం పునరుద్ఘాటించింది. నిజాంపట్ల భారతప్రభుత్వం వహిస్తున్న వైఖరి విషయంలో కొన్నివిదేశాలలో కలుగుతున్న అపోహలను పోగొట్టి, వారికి సరియైన సమాచారము తెలియజేయటానికి, ఇప్పటివరకు నిజాంతో భారతప్రభుత్వం ఎంత మర్యాదగా వ్యవహరించినదో తెలియజేయటానికి ఈ శ్వేతపత్రంగా బాగా ఉపయోగపడింది.

సర్ వాల్టర్‌మాంక్టన్ కార్యదర్శి బ్యూమాంట్ ద్వారా నిజాం జార్జి రాజుకు ఒక లేఖ వ్రాశాడు. ఇన్నాళ్ళుగా తాను, తన పూర్వీకులు బ్రిటిష్‌ప్రభుత్వంపట్ల ఎంత విశ్వాసంతో వ్యవహరించినదీ ఉదహరించి, తన సర్వస్వతంత్రతవిషయం కొంచెం శ్రద్ధవహించవలసిందని జార్జి రాజును కోరుతూ నిజాం ఈ లేఖ వ్రాశాడు. దీనికి భారతగవర్నర్ జనరల్ ద్వారా

జవాబిస్తూ, భారతప్రభుత్వంతో సత్సంబంధాలేర్పరచుకుని, ప్రజాభ్యుదయానికి కృషిచేయవలసిందని జార్జిరాజు నిజాంను కలవాలనుకుని, తనకుగా మరొక్కమారు ప్రయత్నించి ఇండియా-హైదరాబాద్ సమస్యను శాంతియుతంగా పరిష్కరించవలసిందని గవర్నర్-జనరల్‌ను ఆదేశించాడు. ఆ ఆదేశం ప్రకారం భారతగవర్నర్‌జనరల్ శ్రీ రాజగోపాలాచారి నిజాంకు ఒక లేఖ వ్రాశాడుగాని దానికి మామూలు ధోరణిలోనే జవాబు వచ్చింది.

అగష్టు 21వ తేదీననే నిజాం భారతప్రభుత్వంపై భద్రతామండలికి ఫిర్యాదు చేశాడు. ఈ ఫిర్యాదు చేయటానికి నిజాంకు హక్కులేదని, హైదరాబాద్ ఎన్నడూ ఒక స్వతంత్రరాజ్యం గాదనీ, హైదరాబాద్ సమస్య భారతదేశ అంతరంగిక సమస్యఅనీ భారతప్రభుత్వం మొదటినుంచీ స్పష్టపరుస్తూనేవున్నది. భద్రతామండలి ఎజెండాలో హైదరాబాద్ విషయం చేర్చనేకూడదని భారతప్రభుత్వం వాదించదలచింది. భద్రతామండలిలో హైదరాబాద్ విషయం చర్చకు రాకమునుపే భారత ప్రభుత్వ 'పోలీసుచర్య' ప్రారంభమైంది.

ఆగస్టు నెలారంభంలో ఇండియా-హైదరాబాద్ ప్రతినిధుల సంప్రదింపులు భగ్నమైనప్పటినుంచి ఇండియా - హైదరాబాద్‌లమధ్య ఉత్తరప్రత్యుత్తరాలు తీవ్రధోరణిలో జరుగుతూనే వున్నవి. సెప్టెంబరు 7-వ తేదీన వి. పి. మీనన్ మీర్‌లాయక్ అలీకి లేఖవ్రాస్తూ, సంస్థానంలో ఏర్పడిన అరాచకాన్ని అరికట్టటానికి సికింద్రాబాద్‌లో భారత సేనను తిరిగి స్థావరంగా వుంచటం ఒక్కటేమార్గమని భారతప్రభుత్వం భావిస్తున్నట్లు తెలియజేశాడు. భారత గవర్నర్‌జనరల్‌కు సెప్టెంబరు 10-వ తేదీన లేఖవ్రాస్తూ, హైదరాబాద్‌పై భారతప్రభుత్వం ఎట్టి చర్య తీసుకున్నా దేశంలో అల్లకల్లోలం జరిగితీరుతుందని నిజాం హెచ్చరించాడు. 12-వ తేదీన ఈ లేఖకు జవాబిస్తూ, భారతప్రభుత్వ వైఖరిని గవర్నర్‌జనరల్ పునరుద్ఘాటించాడు. సెప్టెంబరు 12-వ తేదీ తెల్లవారు

ర్భూమున, భారత సేనలు, శాంతిభద్రతలు స్థాపించటానికిగాను, హైదరాబాద్ సంస్థానం ప్రవేశించాయి. ఈ సేనలు నాలుగుముఖాలుగా, నాలుగు వైపులనుంచి బయలుదేరాయి. ప్రధానదళం మేజర్ జనరల్ చౌదరి నాయకత్వాన షోలాపూర్ వద్ద హైదరాబాద్ సంస్థానంలో ప్రవేశించాయి; ఇంకొక దళం మేజర్ జనరల్ రుద్ర నాయకత్వాన బెజవాడ వద్ద హైదరాబాద్ సంస్థానంలో ప్రవేశించాయి; మరొక దళం సి. పి. లోని చాందా వద్దనూ; వేరొక దళం బళ్ళారి, కర్నూల్ లవద్దనూ సంస్థానంలో ప్రవేశించాయి. ఈ సైన్యానికంతకు జనరల్ రాజేంద్రసింహ్‌జీ సేనాధిపతి. షోలాపూర్, బెజవాడలనుండి బయలుదేరిన దళాలు చాల త్వరత్వరగా పురోగమించాయి. సంస్థాన సైనికులు, రజాకార్లు వీరి నెదిరించి యుద్ధంచేసినా, వారి ప్రతిఘటనాశక్తి త్వరలోనే సన్నగిలి పోయింది. భారత సేనలు పురోగమించినకొద్దీ శత్రువుల బలం తగ్గిపోయింది. నాలుగురోజులు పురోగమించేటప్పటికి భారత సైన్యాలు రెండువైపుల నుంచి సికింద్రాబాద్ పరిసరాలకు చేరుకున్నాయి. అనవసరంగా పెనుగులాడక ఇకనైనా లొంగిపోవలసిందని జనరల్ రాజేంద్రసింహ్‌జీ నిజాం సైన్యాధిపతిని రేడియోలో అడిగాడు. ఇక తన సైన్యాన్ని నమ్ముకుని లాభంలేదనీ, భారత సేనలు సికింద్రాబాద్‌ను బలవంతంగా ఆక్రమించుకోవలసివస్తే తనను ఖైదీ చేయగలవేమోనని నిజాం భయపడినాడు. ఆఖరు క్షణంలోనైనా లొంగిపోయి మంచిగా భారత సేనలను ఆహ్వానిస్తే, తన రాజరికం నిలుస్తుందని ఆశించాడు. భారతదేశంలో ముస్లింలందరు, హైదరాబాద్‌లో భారత సేనలు ప్రవేశించగానే కల్లోలం ప్రారంభిస్తారనీ, అల్లకల్లోలాన్ని భారతప్రభుత్వం అదుపులోనికి తేలేదనీ, అందువల్ల, వీలైతే తనే భారత భూభాగం కొంత ఆక్రమించుకోవచ్చునని నిజాం మొదట్లో ఆశించాడు. కాని అతని ఆశలు ఈవిధంగా పరిణమించాయి.

భారత సేనలకు లొంగిపోవాలనుకున్న తర్వాత ఆఖరుక్షణంలో లాయక్ అలీమంత్రివర్గం రాజీనామా నిచ్చింది. సెప్టెంబరు 18 వ-తేదీన

నిజాం సేనాధిపతి జనరల్ ఎల్ ఎడ్రూస్ సికిందరాబాద్ వద్ద భారత సేనానాయకుడు జనరల్ చౌదరికి తన సేనలను వశపరచి, లొంగిపోయాడు. యుద్ధం మానివేసి, భారత సైన్యాలకు లొంగిపోవలసిందని తన సైన్యాలకు స్వయంగా నిజాం ఉత్తరువుచేశాడు. లాయక్ అలీ మంత్రివర్గం ఇంతకుముందే రాజీనామానిచ్చివుంటే ఎంతో సంతోషించేవాడనని చెపుతూ, ఆ రాజీనామాను అంగీకరించి, ఒక తాత్కాలిక మంత్రివర్గాన్ని నిజాం ఏర్పరచుకున్నాడు. లాయక్ అలీ మంత్రివర్గ చర్యలకు తానేమాత్రము బాధ్యుడను కాదన్నట్లు, తాను నిస్సహాయుడై, విధిలేక వారి చర్యలకు ఒప్పుకోవలసివచ్చినట్లు నిజాం నటిస్తున్నాడు. భారత ప్రభుత్వంకూడా ఈ వైఖరిని హర్షించి, సమర్థిస్తున్నది కాని నిజాం ఇంతటి నిర్దోషి అని నమ్మటానికి వీలులేదు. భారతప్రభుత్వంతో శాంతియుతంగా ఒడంబడిక చేసుకోవాలని నిజాం గాఢంగా వాంఛిస్తూ, పట్టుపట్టివుంటే లాయక్ అలీ మంత్రివర్గంగాని, కాసిం రజ్వీగాని అడ్డుపడగలవారు కానేకారు. ఒకవేళ వారు అడ్డుపడినా, నిజాం తన కోర్కెను భారతప్రభుత్వానికి తెలియజేసుకోలేనంత నిస్సహాయస్థితిలో వున్నాడా? నూటికి 86 మంది ప్రజలు హిందువులైన సంస్థానంలో ముస్లిం రాజ్యం స్థాపించగల్గటం అసంభవమని నిజాం ముందే గ్రహించాడా లేక తను ఓడిపోయిన తర్వాత గ్రహించాడా? తన సంస్థానంలో ముస్లిం రాజ్యం ఏర్పరచగల్గటం అసంభవం అని ఎరిగిననాడు ప్రతివిషయములోను—ఉద్యోగాల వద్దనుంచి ఉపకారవేతనాలవరకు—ముస్లింలకే అత్యధిక ప్రాముఖ్యత ఇవ్వటం ఎందుకు? ఇత్తేహాద్-ఉల్-ముసల్మీన్ సంస్థను బలపడనివ్వటం ఎందుకు? తన ప్రభుత్వాధికారం ప్రజాపరం చేయటానికి వెనుకాడటమెందుకు? తనమంత్రులేమిచేస్తున్నారో తెలియనంతటి, ఒకవేళ తెలిసినా తాను మందలించలేనంతటి నిస్సహాయ, అసమర్థస్థితిలో నిజాం వున్నాడంటే ఎవ్వరూ నమ్మరు. జరిగినదానికి తప్పు తన ఆశ్రితులమీదకునెట్టి, తనేగా ఎరుగని నిర్దోషిలాగ ప్రవర్తించే సహజ నైచ్యము నిజాంకు ఎప్పుడూ వుండనేవున్నది. అతని మాటలకు

ఆశ్చర్యపడవలసింది ఏమీలేదు. ఈ అసమంజస ధోరణిని, భారత ప్రభుత్వం కార్షించి,సమర్థించి. ప్రచారం చెయ్యటం ప్రజా పక్షపాతులకు హృదయావేదన కలిగించింది. శరణన్న పగవాడిని క్షమించగలము గాని సమర్థించలేము. నిజాంను దోషిగా ఎంచి, పరిపాలనాధికారంనుంచి తొలగించితే అటుతర్వాత జరుగవలసిన విప్లవాత్మక మార్పులను వెంటనే జరపటానికి ఇష్టంలేకగాని, ముస్లింపాలకుని అన్యాయంగా తొలగించారని ముస్లిం పౌరులు కల్లోలం ప్రారంభిస్తారని భయపడిగాని భారత ప్రభుత్వం నిజాం గతచరిత్రను విస్మరించిందని చెప్పటానికికూడా వీలు లేదు. సంస్థానంలో శాంతిభద్రతలు నెలకొల్పటానికే పోలీసు చర్య జరపబడింది; సంస్థాన భవిష్యత్తు, నిజాంభవిష్యత్తు ఆప్రజలే నిర్ణయించాలి గాని భారతప్రభుత్వంకాదనే ప్రజాస్వామ్య సూత్రంప్రకారం నిజాంపై చర్యతీసుకోదలచుకొనకపోతే, అతడినిసమర్థించట మెందుకు? మొదటగానే భారతదేశంలోకేరి. సంస్థానాలను అభ్యుదయపంథాలో పాలిస్తూ, అధికారం ప్రజలపరంచేస్తున్న సంస్థానాధీశ్వరుల నందరిని ఒప్పించి, తొలగించి, యూనియన్‌లు నిర్మిస్తూ, తప్పుచేసిన నిజాంను సమర్థించి, నిలబెట్టటం ఏమిన్యాయము?

సంస్థానసేనలు లొంగిపోగానే మేజర్ జనరల్ చౌదరిని సంస్థానానికి మిలిటరీ గవర్నర్‌గా నియమించారు. సెప్టెంబరు 19 వ-తేదీన నిజాం ఒక ఫర్మానాచేస్తూ, ప్రజలందరు మిలిటరీ గవర్నర్ ప్రభుత్వానికి విధేయతతో మెలగవలసిందని కోరాడు. మిలిటరీ గవర్నర్‌కు ఒక చిన్న మంత్రివర్గం ఏర్పరచి, సంస్థాన పరిపాలనను చక్కబరచవలసిందని వారికి ఆదేశించారు. చుట్టుపక్కల రాష్ట్రాలనుంచి ఉద్యోగుల సేవలను హైదరాబాద్‌కు పంపించి. అక్కడి పరిపాలనా యంత్రాన్ని సంస్కరిస్తున్నారు. పరిపాలనా శాఖలలో ఇదివరకు ముస్లింలు అత్యధిక సంఖ్యాకులుగావుండి, అంతా గుడ్డిదర్బారువలె పాలనసాగుతుండేది. ఇప్పుడు హిందువులకు క్రమేణా, తగిన ప్రాతినిధ్యం దొరుకుతున్నది, పరిపాలన ఇతరరాష్ట్రాల స్థాయికి వస్తున్నది.

సంస్థానంలో శాంతిభద్రతలు నెలకొల్పటము, పరిపాలనా యంత్రాన్ని సంస్కరించి ప్రజాస్వామ్య పద్ధతులు స్థాపించటము, ఎన్నికలు జరిపి, రాజ్యాంగపరిషత్తు నేర్పరచి సంస్థానభవిష్యత్తు నిర్ణయింపటానికి తోడ్పడటము మొదలైనవి మిలిటరీ ప్రభుత్వ విధులు.

సంస్థానంలో శాంతికి భంగకరంగా వ్యవహరిస్తున్నది కమ్యూనిస్టులు, రజాకార్లు. సెప్టెంబరు 18 వ తేదీన యుద్ధవిరమణ జరిగిందిగాని రజాకార్లు అందరూ లొంగిపోలేదు. వీరు తమ ఆయుధాలు, మందుగుండు సామగ్రి నాశనంచేసి, దాచివేసి, కమ్యూనిస్టులకు ఇచ్చి భారతసేనల వశమైనారు. వీరిపట్ల మిలిటరీప్రభుత్వం అత్యౌదార్యంతో వ్యవహరించింది; తమను ఇన్నాళ్ళూ బాధించినవారు ఇంత తేలికగా విడిచిపెట్టబడటం సంస్థానప్రజలకు దిగ్భ్రమ కలిగించింది; ఇది భారతసైన్య అసమర్థతగాకూడా కొందరు భావించారు. ముఖ్యులైన రజాకార్ నాయకులు కొందరు ఇంతవరకు పట్టుబడనేలేదు. రజాకార్లు ఇంకా అప్పుడప్పుడూ భారతపోలీసులను ఎదిరిస్తూనేవున్నారు. మిలిటరీప్రభుత్వం రజాకార్లపట్ల అనుసరించినవిధానంవల్ల ప్రజలలో దానిపట్ల అవిశ్వాసం తప్ప మరేమీ కలుగలేదు.

రజాకార్ నాయకుడు సయ్యద్ కాశింరజ్వీ మిలిటరీప్రభుత్వానికి ఖైదీగా దొరికాడు. హైదరాబాద్ కల్లోలానికి నిజాంనవాబు కారకుడు కాకపోతే, కాశింరజ్వీ తప్ప మరే వ్యక్తి కారకుడని చెప్పటానికి వీలు లేదు. రజాకార్లు నిజాంను బందీచేసి, లాయక్ ఆలీని కీలుబొమ్మగా నిలిపి, నిజాంప్రభుత్వంపేరిట ఆటలాడారని భారతప్రభుత్వం భావిస్తున్నది. అయితే దీనికంతకు బాధ్యుడు రజ్వీయేకదా. అతనిని రాజద్రోహ నేరం క్రింద, ప్రజాద్రోహ నేరంక్రింద విచారించక, షోయిబుల్లాఖాన్ హత్యకేసును కుంటిసాకులతోనా విచారణచేయవలసింది? హైదరాబాద్ కల్లోలానికి నిజాము, రజ్వీ బాధ్యులుగాకపోతే, మరెవ్వరని భారతప్రభుత్వం భావిస్తున్నదో అర్థం కాదు.

హైదరాబాద్ సంస్థానం కమ్యూనిస్టులకు ఎప్పుడూ స్థావరమే. పోలీసు చర్యకు ముందు వీరు రజాకార్లతో చేతులు కలిపి, ఆయుధాలు సంపాదించారు. రజాకార్లు లొంగిపోతున్నప్పుడు మరికొన్ని ఆయుధాలు సంపాదించుకున్నారు. ఏవిధంగానైనా సంస్థానంలో శాంతికి భంగం కలిగిస్తూ, మిలిటరీప్రభుత్వంపట్ల అసంతృప్తి వ్యాపింపజేయటమే వీరి లక్ష్యము. సంస్థానంలో మిలిటరీప్రభుత్వం ఏర్పడగానే కమ్యూనిస్టు పార్టీని నిషేధించింది. అప్పటినుంచి వీరు మిలిటరీప్రభుత్వంతోను, ప్రజలతోను పోరాటం సాగిస్తూనే వున్నారు. వీరిని పట్టుకోటానికి మిలిటరీ ప్రభుత్వం అనుసరిస్తున్నవిధానంకూడా హర్షదాయకంగా లేదు. ప్రజలను గౌరవించి, మంచిచేసుకుని వీరిద్వారా కమ్యూనిస్టులను పట్టుకోగలము గాని, నిర్దోషులను అనుమానముపైన హింసించి, భయపెట్టి కమ్యూనిస్టులను పట్టుకోలేము. ప్రజలను హింసించాలనే కమ్యూనిస్టులు కోరుతారు! అదే వారికి జీవనాధారం. ప్రభుత్వం ప్రజలతో సరిగా వ్యవహరిస్తే, కమ్యూనిస్టులకు తావేలేదు. దురదృష్టవశాత్తు, మనపోలీసుశాఖ కొన్ని తరాలు వెనుకబడివున్నది. సామ్రాజ్యవాదవిధానం వారిలో చచ్చిపోలేదు; పోలీసుశాఖసంస్కరణ జరగనిదే ప్రజలు ప్రభుత్వాన్ని ఎన్నడూ గౌరవించరు. ఈ తప్పువల్లనే మిలిటరీప్రభుత్వం ప్రజలకు కంటకంగా పరిణమించి, రజాకార్ల రాజ్యానికి దీటనిపించింది.

లాయక్ ఆలీమంత్రివర్గం చేసిన ఖర్చులు పరిశీలిస్తే వారు చేసిన దుర్వ్యయాలు బయటపడినాయి. యుద్ధసన్నాహాలకు దాదాపు రూ. 20 కోట్లు ఖర్చయిందట. పాకిస్థాన్‌లో దాదాపు రూ. 3 కోట్లు, బ్రిటన్‌లో దాదాపు 30 లక్షల పౌనులు—ఇందులో సగం ఇంకా నిలవ వున్నది—ఖర్చయినట్లు తెలిసింది. ఈసొమ్ము ఏవిధంగానూ భర్తీచేసుకోటానికి వీలులేదు. లాయక్ ఆలీమంత్రివర్గసభ్యులందరి ఆస్తులు కలిపి రూ. 2,3 కోట్లు వుండునేమో!

పరిపాలనావ్యాసంగానికి కొత్త అయినవారికి పరిపాలన వప్పజెప్పితే, సరిగా నిర్వహించలేక పోతున్నారని ఇతర సంస్థాన యూని

యన్ల అనుభవాలనుబట్టి గుర్తించి, హైదరాబాద్‌లో ఆ పొరపాటు చేయకుండా. ప్రజాస్వామ్యపద్ధతులు ముందుగా ప్రవేశపెట్టి, ప్రజలకు, నాయకులకు అలవాటు చేయటానికిగాను భారతప్రభుత్వం మిలిటరీ ప్రభుత్వాన్ని ఏర్పరచింది. ఈ ప్రభుత్వం పరిపాలనా యంత్రాన్ని సంస్కరిస్తున్నదిగాని ప్రస్తుత పాలనతో భవిష్యత్ పాలకులకు ఎట్టిసంబంధము లేకుండావున్నది. ఇది గొప్పలోటు. సంస్థాన కాంగ్రెస్ నాయకులనే ఇప్పుడు మిలిటరీ ప్రభుత్వంలో పాలకులుగా నియమించినట్లయితే వారు అనుభవంపొంది, త్వరలో తమవ్యవహారాలు చక్కబెట్టుకోగలిగేవారు. ఈభావం కాంగ్రెస్‌వాదులలో వ్యాపిస్తున్నది. మిలిటరీ ప్రభుత్వానికి సలహాసంఘంగా ఏర్పడడానికికూడా వీరు అంగీకరించక నిరాకరించారు. వెంటనే తాత్కాలిక ప్రజాప్రభుత్వాన్ని ఏర్పరచవలసిందని సంస్థాన కాంగ్రెస్ కోరుతున్నది. ఇది న్యాయమైనకోర్కె. దీనిని సర్దార్ పటేల్ వెంటనే మన్నిస్తాడని ఆశిద్దాము.

కమ్యూనిస్టులను, రజాకార్లను అణచటంలోను, ప్రజలలో పలుకుబడి పొందటంలోను, ప్రజానాయకులకు పరిపాలనానుభవం కలిగించటంలోను మిలిటరీ ప్రభుత్వం సాధించినది శూన్యము. ఈ ప్రభుత్వం ఎంత త్వరలో తొలగితే అంతమంచిదని అందరూ భావిస్తున్నారు.

మిలిటరీ ప్రభుత్వం తొలగితే దానిస్థానం ఆక్రమించవలసింది సంస్థానకాంగ్రెస్. దురదృష్టవశాత్తు, సంస్థానకాంగ్రెస్ వ్యవహారాలు చాల అసంతృప్తికరంగా వున్నాయి. సామాన్యంగా అధికారము వ్యక్తులను పాడుచేస్తుంది; అధికారంలభించే అవకాశమే ఈవ్యక్తులను పాడు చేస్తున్నది. హైదరాబాద్ సంస్థానకాంగ్రెస్ పైకి నామమాత్రంగా ఐక్యంగా కనిపించినా వాస్తవానికి అగుకులబొంత; వ్యక్తిగతద్వేషాలు, వర్గద్వేషాలు, భాషాద్వేషాలు అన్నీ ఇందులోనే వున్నాయి. పరిపాలన వెంటనే వీరికి వప్పజెప్పేకంటే, వీరిని మిలిటరీ ప్రభుత్వంలో మంత్రులుగా నియమించి, పరీక్షించి చూడటం మంచిది. ప్రజాస్వామ్య పద్ధతులపై ఎన్నికలు జరిగి, ప్రజాపరిషత్తు ఏర్పడేవరకు బహుశః అదే జరుగవచ్చును.

హైదరాబాద్ సంస్థాన భవిష్యత్తు, నిజాం భవిష్యత్తు ఇంకా నిర్ణయించాలి. సంస్థానంలో ఎన్నికలుజరిగి, రాజ్యాంగపరిషత్తు ఏర్పడి ఆ పరిషత్తు ఈ విషయాలు నిర్ణయించాలి. ఎన్నికలు జరగటానికి కనీసం ఒక సంవత్సరమైనా పడుతుంది; ఓటర్ల జాబితాలు ఇప్పుడే తయారవుతున్నవి. ఈలోపుగా మిలిటరీ ప్రభుత్వం కొన్ని సంస్కరణలు జరుపుతున్నది. నిజాం స్వంతభూములన్నీ—మూడుకోట్ల రూపాయలు ఆదాయం వచ్చే రెండువేల గ్రామాలు—వదులుకున్నాడు. జాగీర్దారీలు త్వరలో రద్దు చేయటానికి ఆలోచనలు జరుగుతున్నవి. ఇటువంటి సంస్కరణలవల్ల ప్రజలలో వ్యాపించిన అసంతృప్తి పూర్తిగా తగ్గిపోదు.

హైదరాబాద్ సంస్థానం భవిష్యత్తు, నిజాంనవాబు భవిష్యత్తు ఏమిటి అనే ప్రశ్నకు జవాబు చెప్పటం కష్టం. హైదరాబాద్ రాజ్యాంగ పరిషత్తు ఏర్పడితే, నిజాంను తొలగించి, సంస్థానాన్ని భాషారాష్ట్రాలుగా విడదీసి, ప్రక్కరాష్ట్రాలతో కలిపివేయవలెనని నిర్ణయం జరగవచ్చును. సంస్థానకాంగ్రెస్ ప్రస్తుతధోరణి, వ్యవహారాలు అటువైపుకే మొగ్గుతున్నాయి. కాని నిజాంను తొలగించడానికి భారతప్రభుత్వం సిద్ధంగావున్నదా అనేది సంశయాస్పదమే. హైదరాబాద్ సంస్థానాన్ని భాషారాష్ట్రాలుగా విడదీస్తే, మద్రాసు, బొంబాయి రాష్ట్రాలు కూడా విచ్ఛిన్నంచేసి ఆంధ్ర, కర్నాటక, కేరళ, మహారాష్ట్ర, తమిళ రాష్ట్రాలు ఏర్పరచవలసివుంటుంది. ఇందుకు కాంగ్రెస్ అగ్రనాయకులు ఇంత త్వరలో పూనుకునేటట్లు లేరు. హైదరాబాద్ సంస్థానం యథాతథంగా, నిజాంనవాబు పరిపాలనక్రిందనే వుండాలని ప్రజాపరిషత్తు నిర్ణయిస్తుందని గాని, అట్లా నిర్ణయించవలసిందని దానిని భారతప్రభుత్వం వత్తిడి చేస్తుందనిగాని ఇప్పుడు అనుకోవటంకూడా అప్రస్తుతమే. హైదరాబాద్ భవిష్యత్తు, నిజాంభవిష్యత్తు సరిగా ఎరిగినవ్యక్తులు భారతదేశంలో ఈనాడు ఇద్దరుమాత్రమే వున్నారు; వారిఉద్దేశ్యాలు చివరకు ఆచరణలో ఏరూపం దాలుస్తాయో జోస్యం చెప్పబూనటం అనవసరం.

# కాశ్మీర్

భారతప్రభుత్వానికి ప్రజలకు ఐక్యరాజ్యసమితిపట్లగల విశ్వాసాన్ని, గౌరవాన్ని కాశ్మీర్ సంఘటన తుడిచివేసింది. ఐక్యరాజ్యసమితి ఉపసంఘాలు, ఉపాంగాలు ఎంత స్వార్థబుద్ధితో, ఎంత నిష్పాక్షికంగా వ్యవహరిస్తున్నవో ఈసంఘటన రుజువుచేసింది. ప్రపంచంలో ఏసమస్యనైనా పాశ్చాత్యరాజ్యాలు—ముఖ్యంగా అగ్రరాజ్యాలు—వాటివాటి సంబద్ధాలను బట్టి దృష్టులనుంచిగాక కేవలం తమ స్వలాభదృక్పథంతోనే పరిశీలిస్తవని, అందువల్లనే ప్రపంచ సుస్థిరశాంతి ఆనాటి కానాడు న్యూనత్వస్థితి అయిపోతున్నదని కాశ్మీర్ సంఘటనవల్ల మనకు తెలిసిపోయింది. న్యాయాన్యాయాలు ఎట్లావున్నా, మొండిపట్టు, వాచాలత్వము, ఎకౌంపులతో ఈప్రపంచంలో నెట్టుకు రావచ్చునని ఈ అనుభవంవల్ల తెలుసుకుంటున్నాము. ఐక్యరాజ్యసమితి చరిత్రలో అతి అన్యాయ, అతి విషాదకరసంఘటన కాశ్మీర్ వ్యవహారములను అది పరిశీలించిన విధానమే నని భవిష్యత్ చరిత్రకారుడు నిర్ణయించకపోడు.

ఐక్యరాజ్యసమితి భద్రతామండలి నియమించిన 'ఇండియా పాకిస్థాన్ల కాశ్మీర్ సంఘము' గతసంవత్సరం జూలై నెలలో భారతదేశం వచ్చి, ఇండియా, పాకిస్థాన్ ప్రభుత్వాలతో సంప్రదింపులు ప్రారంభించింది. కాశ్మీర్ యుద్ధంలో పాకిస్థాన్ సేనలే ప్రత్యక్షంగా పాల్గొంటున్నవని ఈ సంఘానికి భారతప్రభుత్వం రుజువుచేసింది. అందువలన గత్యంతరంలేక పాకిస్థాన్ ప్రభుత్వం అంగీకరించవలసివచ్చింది. సెప్టెంబరు నెలలో ఈవిషయాన్ని పాకిస్థాన్ వ్రాతపూర్వకంగానే అంగీకరించింది. భారతదేశ భూభాగమైన కాశ్మీర్లో తనసేనలు యుద్ధంచేస్తున్నవని పాకిస్థాన్ ప్రభుత్వం అంగీకరించటంవల్ల ఇన్నాళ్ళనుండి - దాదాపు తొమ్మిది నెలలు - పాకిస్థాన్ ప్రతినిధులు భద్రతామండలిలో వాదిస్తున్న

వాదనలు కేవలం అసత్యాలని, భద్రతామండలిని పాకిస్తాన్ మోసం చేస్తూ, అవమానపరుస్తున్నదని రుజువైనా, అంతేకాదు. ఈ దౌర్జన్యాన్ని, ఈ మోసాన్ని అరికట్టి ఇండియాకు న్యాయంచేసి తనతప్పు దిద్దుకోవలసిన బాధ్యత భద్రతామండలిని పైబడింది. ఇన్నాళ్ళనుంచి తనను మోసంచేసి నందుకు పాకిస్తానును మందలించి, కనీసం ఏమైనా జరిగివుంటే అంత న్యాయంగా ఐక్యరాజ్యసమితి ప్రతిష్ఠ ఇనుమడించి వుండేది. దురదృష్టవశాత్తు ఇలాంటిదేమీ జరగలేదు.

పాకిస్తాన్ సేనలు కాశ్మీర్‌లో ప్రత్యక్షంగా యుద్ధం చేస్తున్నందువలన ఒక అసాధారణ పరిస్థితి ఏర్పడిందని ఐక్యరాజ్యసమితి ఉపసంఘం గుర్తించింది. ఆ అసాధారణ పరిస్థితిని అతిసాధారణ పద్ధతిలో పరిష్కరించటానికి ఆ సంఘం పూనుకున్నది. కొత్తగా ఏర్పడిన అసాధారణ పరిస్థితిని భద్రతామండలికి నివేదించి, దానికి బాధ్యులైనవారిని సరియైన స్థానంలోనికి తెచ్చుట సరియైన పరిష్కారమార్గమని ఎంత అజ్ఞానులైనా గుర్తించగలరు. కాని ఆ సంఘము ఇటువంటిపని తలపెట్టలేదు. ఇండియా-పాకిస్తాన్‌లకు తన మాధ్యస్థ్య విధానాన్ని, పంథాను సూచిస్తూ ఈ సంఘం ఆగస్టు 13 వ తేదీన ఒక తీర్మానం చేసింది. ఇది చాలా ముఖ్యమైన తీర్మానం.

ఆగస్టు 13 వ తేదీ తీర్మానాన్ని మూడుభాగాలుగా విభజించారు. అందులో మొదటిభాగం వెంటనే యుద్ధవిరమణకు, రెండవభాగం తాత్కాలిక శాంతిస్థాపనకు మూడవభాగం సంస్థాన భవిష్యత్తు నిర్ణయానికి సంబంధించినవి. యుద్ధవిరమణకు సంబంధించిన భాగంలో ఇండియా, పాకిస్తాన్‌లు తమ సేనలకు వెంటనే యుద్ధవిరమణ ఉత్తరువులు చేయాలని, యుద్ధవిరమణ సమయంలో ఎక్కడవున్న సేనలు అక్కడనే వుండాలని, యుద్ధవిరమణ రెండువర్గాలు సరిగా అమలు జరుపుతున్నవో లేదో పరిశీలించటానికి సైనిక పరిశీలకులను ఈసంఘం నియమించగలదని సూచించారు. ఈ అంశాలను అంగీకరించి, ఇరుపక్షాలు యుద్ధవిరమణ ఉత్తరువులుచేస్తే, తాత్కాలిక శాంతిస్థాపనకు ప్రయత్నించవచ్చును.

తాత్కాలిక శాంతికి ఈసంఘం సూచించిన షరతులప్రకారం, పాకిస్థాన్ తనసేనలన్నీ ముందుగా ఉపసంహరించి, కాశ్మీర్‌లో ప్రవేశించిన కొండజాతులు, పాకిస్థాన్ ప్రజలు మొదలైన ఇతర దుండగులు వెళ్ళిపోయేట్లు వారిని ప్రోత్సహించాలి. వీరందరూ కాశ్మీర్‌నుంచి వెళ్ళిపోయినారని ఈ సంఘము, భారత ప్రభుత్వము సంతృప్తిజెందిన తర్వాత, ఇండియా తన సేనలను కొంతవరకు ఉపసంహరించుకోవాలి. కాశ్మీర్‌లో పాకిస్థాన్ ఆక్రమణలోవున్న భూభాగంలో అక్కడి స్థానికాధికారులు పరిపాలన నిర్వహిస్తారు. భారతసేనలున్న ప్రాంతంలో కాశ్మీర్ ప్రభుత్వమే పరిపాలన నిర్వహిస్తుంది. కాశ్మీర్ ప్రజలు, ఇప్పుడెక్కడ వున్నాసరే, తిరిగి తమ స్వస్థలాలకు జేరుకుని, తమ నిత్యజీవితం ఇదివరకటివలెనే గడుపుకోటానికి సంపూర్ణ రక్షణలు, హామీలు ఆయాప్రాంతాల అధికారులు యివ్వాలి. ఈవిధంగా కాశ్మీర్‌లో తాత్కాలిక శాంతి స్థాపించిన తర్వాత సంస్థాన భవిష్యత్తు నిర్ణయించటానికి ప్లెబిసైట్ జరపాలి. ఈవిషయం తర్వాత ఆలోచించవచ్చును అని ఐక్యరాజ్యసమితిసంఘం తీర్మానించింది.

ఈ తీర్మానానికి భారతప్రభుత్వం రెండు సవరణలు కోరింది. అజాద్ కాశ్మీర్ ప్రభుత్వాన్నిగాని, సేనలనుగాని గుర్తించరాదనీ, ఆ సేనలను నిరాయుధం చెయ్యాలనీ లేకపోతే, ఆప్రాంతంనుంచి వచ్చివేసిన కాందిశీకులు తిరిగి అక్కడకు వెళ్ళటానికి భయపడతారనీ భారత ప్రభుత్వం సూచించింది. కాశ్మీర్ ఉత్తరభాగంలో ఇప్పుడు ఏ సేనల ఆక్రమణలో లేనిభాగాలు కాశ్మీర్ ప్రభుత్వంక్రిందనే వుండాలనికూడా భారతప్రభుత్వం కోరింది. ఈ రెండుసవరణలు భారతప్రభుత్వానికి సంతృప్తికరంగా ఐక్యరాజ్యసమితి సంఘం ఆమోదించటంవల్ల ఈ తీర్మానాన్ని, ఆ సవరణలతో భారతప్రభుత్వం అంగీకరించింది.

పాకిస్థాన్ ప్రభుత్వంమాత్రం ఈ తీర్మానాన్ని అంగీకరించక, అనేకసవరణలు ప్రతిపాదించింది. అజాద్ కాశ్మీర్ సేనలకు యుద్ధవిరమణ

ఉత్తరువుచేసేది అజాద్ కాశ్మీర్ ప్రభుత్వమేననీ, అజాద్ కాశ్మీర్ ప్రభుత్వంతో ఐక్యరాజ్యసమితిసంఘం సంప్రదింపులు జరిపి, నిర్ణయాలు చేయవలసిందనీ, అజాద్ కాశ్మీర్ సేనను నిరాయుధం చెయ్యకూడదనీ, భారత సేనలు తరలి వెళ్ళితేనే కాశ్మీర్‌నుంచి దుండగులు వెళ్ళిపోతారనీ, దుండగులను పంపివేసే భారం పాకిస్థాన్ వహించదనీ, పాకిస్థాన్ సేనల ఆక్రమణక్రింద వున్న ప్రాంతం అజాద్ కాశ్మీర్ పరిపాలనలో వుండాలనీ, ప్లెబిసైట్ విషయం సంతృప్తికరంగా నిర్ణయించనిదే యుద్ధవిరమణ అసంభవమనీ అనేకసవరణలు పాకిస్థాన్ ప్రతిపాదించింది. దీనిమీద చాల ఉత్తరప్రత్యుత్తరాలు, సంప్రదింపులు జరిగాయికాని పాకిస్థాన్ ప్రభుత్వం ఆగస్టు 13 వ తేదీ తీర్మానానికి అంగీకరించలేదు.

కాశ్మీర్‌లో పాకిస్థాన్ సేనలు వుండటం అసందర్భం కాబట్టి చేమరతుగా ముందుగా వాటిని ఉపసంహరించకపోతే, ఐక్యరాజ్యసమితి పాకిస్థాన్ పైచర్య తీసుకుంటుందని తెలిస్తే పాకిస్థాన్ ఇన్ని అవకతవక మరతులు పెట్టేదికాదు. ఐక్యరాజ్యసమితి వెనకవున్న అగ్రరాజ్యాలు పాకిస్థాన్‌ను బలపరుస్తుండటం వలననూ, ఐక్యరాజ్యసమితి సహజ నిర్వీర్యతవలనను ఐక్యరాజ్యసమితి సంఘం ఇంతగట్టిగా, నిర్మొహమాటంగా పాకిస్థాన్‌తో వ్యవహరించలేక మనకు కీడు కలిగిస్తున్నది. కాశ్మీర్‌లో తనకు స్థానంలేదని పాకిస్థాన్‌కు తెలుసును. కాని ఐక్యరాజ్యసమితి తన దురాక్రమణచర్యను కొంతవరకు సహించిందికాబట్టి, దాని బలహీనతను ఆధారంచేసుకుని, మరికొంతలాభం ఎందుకుపొందకూడదని పాకిస్థాన్ ప్రభుత్వం ఆలోచిస్తున్నది. పాకిస్థాన్‌పట్ల దృఢమైనవైఖరి అవలంబించ లేకపోవటం భారతప్రభుత్వపు గొప్పలోటు. దానివల్లనే కాశ్మీర్ ఇంత సమస్యగా తయారైంది. భారతప్రభుత్వమే మొదటినుంచి పాకిస్థాన్‌పట్ల కఠినంగా, సమంజసంగా వ్యవహరించివుంటే ఐక్యరాజ్యసమితికి ఫిర్యాదు అక్కరనే లేకపోయేది. తన రాజీవిధానమే, తన మెత్తదనమే తన గొప్పదనమని భారతప్రభుత్వం భావిస్తున్నది. ఇది మన దురదృష్టము.

ఒక తేలికగా మైత్రిపడే పార్టీకీ, బిగదీసి కూర్చునేపార్టీకి ఇతరులుమధ్యవర్తిత్వంవహిస్తుంటే ఎవరు ఎక్కువలాభం పొందుతారో మనకు తెలుసును. కాశ్మీర్ విషయంలో అక్షరాలా జరుగుతున్నది అదే. అందువల్లనే భారతదేశంలో విద్యార్థులకు తమ ప్రభుత్వంపట్ల విసుగుపుట్టుతున్నది.

ఆగస్టు 13-వ తేదీ తీర్మానాన్ని పాకిస్తాన్ అంగీకరించదని నిశ్చయంగా తేలిపోయినతర్వాత, ఐక్యరాజ్యసమితిసంఘం జెనీవా వెళ్ళి తమ నివేదిక తయారుచేసి, భద్రతామండలికి సమర్పించింది. పాకిస్తాన్ చేసిన మోసానికి కఠినచర్యలు తీసుకోవాలనిగాని, కనీసం కఠినంగా మందలించవలసిందనిగాని ఈ నివేదికలో చెప్పలేదు. ఇది అంతర్జాతీయన్యాయం. ఇదేసమయంలో భద్రతామండలిలో కాశ్మీర్సమస్య చర్చకు వచ్చింది. ఇండియాప్రభుత్వం అదనపు సేనలను కాశ్మీర్ పంపుతున్నదని, ఈ సేనలు కొత్తగా దాడులు మొదలుపెట్టి ఐక్యరాజ్యసమితి విజ్ఞాపనను పాటించడంలేదని పాకిస్తాన్ ప్రతినిధి ఇండియాపై నిందవేశాడు. మన దేశంలోవున్న శత్రువును తరిమివేయటానికి ప్రయత్నించటం కూడా తప్పే కాబోలు. దీనికి భారతప్రభుత్వం సమాధానమిస్తూ, తన ప్రాంతంలో నుంచి శత్రువులను తరిమివేసే హక్కు తనకు వున్నదనీ, అయినా ఐక్యరాజ్యసమితి విజ్ఞాపననుసరించి ఇప్పటను భారతసేనలు కొత్తయుద్ధాలు ప్రారంభించటం లేదనీ తెలియజేసింది. ఐక్యరాజ్యసమితి విజ్ఞాపనలు యధార్థంగా పాటించి, నాశనంకొపటమే భారతప్రభుత్వ విధానం. ఉపయోగించుకోలేని హక్కులు ఉన్నా లేనట్లేనని భారతప్రభుత్వం ఇంకా గ్రహించుకోలేదు.

ఐక్యరాజ్యసమితి సంఘసభ్యులు ఈసమయంలోనే ఇండియా పాకిస్తాన్ల ప్రతినిధులతో న్యూయార్కులో సమాలోచనలు జరిపారు. ప్లెబిసైట్ ఏపద్ధతులపైన జరగాలో ఈసమావేశాలలో ఆలోచించారు. ప్లెబిసైట్ నిర్వహణకు ఒక 'ప్లెబిసైట్ నిర్వహణాధికారి'ని నియమించాలనీ, అన్నియత్నాలు అతడే చేయాలని, ఉభయప్రాంతాలలోను

కాందిశీకులు తిరిగిరావటానికి సౌకర్యాలు కలిగించాలనీ, మొదలైన షరతులు ఇంకాలో వున్నాయి. వీటిని భారతప్రభుత్వం అంగీకరించటానికి ఎప్పుడూ సిద్ధంగా వున్నది. ఇప్పుడు పాకిస్తాన్ కూడా అంగీకరించింది. అయితే ఐక్యరాజ్యసమితి సంఘసభ్యులు కొందరు ఇండియా వచ్చి, ఇండియా పాకిస్తాన్ ప్రభుత్వాలతో సంప్రదింపులు జరిపారు. ఆజాద్ కాశ్మీర్ సేనలను నిరాయుధం చేస్తామనీ, ఆప్రాంతాలలో అధికారం వారికే వుంచమనీ భారతప్రభుత్వానికీ, వారిని సేనలోనుంచి తొలగించాలేగాని ఆయుధాలు వుంచుకోనివ్వవచ్చునని, ఇప్పుడు వారే పాలిస్తున్నారు గనుక ఇకముందుకూడా ఆప్రాంతాలను వారే పాలించగలరని పాకిస్తానుకు ఎవరికి నచ్చేటట్లు వారికి చెప్పి [illegible] ఆగస్టు 13-వ తేదీ తీర్మానానికి ఇరుపక్షాలను వీరు అంగీకరింపజేశారు.

పాకిస్తాన ఇంతవరకు అన్నిసవరణలు ప్రతిపాదించి, నిరాకరించిన తీర్మానాన్ని ఇప్పుడు ఎంతసులభంగా అంగీకరించటంలో అర్థం లేకపోలేదు. కాశ్మీర్‌లో భారతసేనలు ముందుకు సాగుతున్నాయి. దీనిని అరికట్టడానికి పాకిస్తాన్ సేనలు యుద్ధంలో పాల్గొంటున్నాయి. ఇది ప్రపంచంలో [illegible] వ్యాపిస్తున్నది. పైగా భారతప్రభుత్వం ఈ అప్రకటితయుద్ధాన్ని ప్రకటిత యుద్ధంగా పరిగణించే అవకాశంకూడా లేకపోలేదు. కాశ్మీర్ యుద్ధానికి పాకిస్తాన్ చాల ఎక్కువ సొమ్ము ఖర్చు చేస్తున్నది. ఇప్పుడు యుద్ధవిరామాన్ని అంగీకరిస్తే, ఖర్చుతగ్గుతుంది; ఉన్న ప్రదేశంలో పాకిస్తాన్ స్థిరపడవచ్చును; ప్రపంచం పాకిస్తాన్ ఔదార్యాన్ని మెచ్చుకుంటుంది. ఇప్పుడు తమ ఆక్రమణలోవున్న ప్రాంతాన్ని బలపరచుకుని, స్థిరపడటానికే పాకిస్తాన్ యుద్ధవిరామాన్ని అంగీకరించింది. భారతప్రభుత్వం, కాశ్మీర్ నాయకులు, ఐక్యరాజ్యసమితి సంఘము ఎన్ని చెప్పినా ఇప్పటి యుద్ధవిరమణ నీతిప్రకారం కాశ్మీర్ విభజన స్థిరపడిపోయినట్లే భావించవచ్చును. ఇప్పుడు పాకిస్తాన్ ఆక్రమణలో వున్నభాగం ఏకొంచమైనా ఇకముందు కాశ్మీర్ ప్రభుత్వానికి చేరుతుందనటం కలలోనివార్త.

ఐక్యరాజ్యసమితి సంఘసూచనలను ఇరుపక్షాలు అంగీకరించినవి కాబట్టి ఇక యుద్ధవిరమణ జరపవచ్చునని అందరూ భావించారు. ఇందుకు భారతప్రభుత్వం ముందంజవేసింది. భారతసేనానాయకులద్వారా పాకిస్థాన్ సేనానాయకులతో సంప్రదింపులు జరిపి, వెంటనే తాను యుద్ధ విరమణ చేయటానికి సిద్ధంగావున్నానని భారతప్రభుత్వం తెలియజేసింది. పాకిస్థాన్ తాముకూడా యుద్ధవిరమణకు సంసిద్ధమేనని తెలియజేసింది. అందువల్ల 1948 డిశెంబరు 31-వ తేదీ అర్ధరాత్రితో ఇరుపక్షాలు యుద్ధం విరమించారు. నూతనసంవత్సరం శాంతిని తెచ్చిందని అందరూ సంతోషించారు.

యుద్ధవిరమణ సరిగా అమలుజరుగుతున్నదో లేదో పరిశీలించ టానికి, ఉభయపక్షాల సేనలమధ్య యుద్ధవిరమణ గీతగీసి, వారివారి ఆక్రమిత ప్రాంతాలు స్పష్టపరచటానికి మిలిటరీ పరిశీలకులను నియమించి, తాత్కాలిక శాంతి ఒడంబడిక సాధించటానికి ఐక్యరాజ్యసమితి సంఘం పూనుకున్నది. యుద్ధవిరమణ ఉత్తరువులు అక్కడక్కడా ఉల్లంఘింప బడినా, మొత్తంమీద రెండు వర్గాలు చాలవరకు ఈ ఉత్తరువులను పాటించారు. చిన్నచిన్న సంఘటనలు అక్కడక్కడ రెండు వైపులా జరిగినవి. ఇవి మిలిటరీ-పరిశీలకులు వెంటనే సర్దివేయగలిగారు. కాని ఇరు పక్షాలకు ఎన్నడూ యుద్ధంజరగని ఉత్తరప్రాంతాలలో ఇండియాకు చాల అన్యాయం జరిగింది. యుద్ధవిరమణ జరగగానే పాకిస్థాన్ సేనలు ఈ ప్రాంతాలను ఆక్రమించుకోవటం మొదలుపెట్టాయి. ఈవిషయం భారతసేనలకు తెలిసి, మిలిటరీ పరిశీలకులకు ఫిర్యాదుచేసి, పాకిస్థాన్ సేనలను నివారించేటప్పటికే మనకు చాలనష్టం జరిగింది. ఆక్రమించిన ప్రాంతాన్ని పాకిస్థాన్ వదలుకోలేదు; వదులుకొమ్మని ఐక్యరాజ్యసమితి సంఘం పాకిస్థాన్‌ను కోరనూలేదు.

తాత్కాలిక శాంతి ఒడంబడికను కుదర్చటానికి ఐక్యరాజ్య సమితి సంఘం తీవ్రంగా కృషిచేసింది. ఇది కుదరగానే ప్లెబిసైట్

ఏర్పాట్లు జరుగుతవి. ప్లెబిస్సైట్ నిర్వహణాధికారిగా అడ్మిరల్ నిమిట్జ్ ను నియమించారు. ఈయన పేరుగాంచిన అమెరికన్ నౌకానాయకుడు. ప్లెబిస్సైట్ జరపటానికి సన్నాహమంతా చేసుకుని ఇండియా రావటానికి ఈయన మార్చి నెలలనుంచి సిద్ధంగావుంటున్నాడు. తాత్కాలిక శాంతి ఒడంబడిక కుదరకపోవటంవల్ల ఈయనరాక ఎప్పటికప్పుడు వాయిదా పడుతున్నది.

తాత్కాలికశాంతి ఒడంబడిక సాధించటానికి ఐక్యరాజ్య సమితి సంఘం ఇండియా, పాకిస్థాన్ ప్రభుత్వాలతో కొన్నినెలలు సంప్రదింపులు జరిపింది. కాని ఆగస్టు 13 వ తేదీ తీర్మానంపట్ల ఆసంఘ దృక్పథం మారిపోయింది. కాశ్మీర్ ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు ముస్లింలు కాబట్టి కాశ్మీర్ పాకిస్థాన్‌లో చేరటమే న్యాయమని వీరు, పైకి చెప్పక పోయినా, అంగీకరిస్తున్నారు. అందువల్లనే గురెజ్ కు ఉత్తరప్రాంతాలను యుద్ధవిరమణ తర్వాత పాకిస్థాన్ ఆక్రమించినా సహించి వూరుకున్నారు. అజాద్ కాశ్మీర్ పట్లకూడా వీరిదృక్పథం మారింది. ఆప్రాంతాలలో వారే పరిపాలన జరపాలని పాకిస్థాన్ కు చెప్పిన అర్థాన్నే అనుసరించాలని ఈసంఘంకూడా ఇప్పుడు భావిస్తున్నది. అజాద్ కాశ్మీర్ సైనికులను నిరాయుధులను చెయ్యటానికి కూడా వీరు అంగీకరించటం లేదు. అజాద్ కాశ్మీర్ సైన్యం అనేపేరుతో 32 డివిజనుల సైన్యం, దాదాపు 25 వేలమంది సైనికులు—వున్నారు. వీరు ఆప్రాంతాలను ఆక్రమించివుంటే కాందిశీకులు తిరిగి వెళ్ళటంగాని, శాంతి ఏర్పడి, మామూలు జీవితం వీలవటంగాని, ప్లెబిస్సైట్ నిష్పాక్షికంగా జరగటంగాని కల్ల అని భారతప్రభుత్వం భావిస్తున్నది. అజాద్ కాశ్మీర్ సేనలో తనసైనికులను, ఇతరులనుచేర్పించి, వారికి ఎక్కువ ఆయుధాలిచ్చి, ఒక్కమారుగా తిరిగి విజృంభించాలని పాకిస్థాన్ ఆలోచిస్తున్నది. భారతప్రభుత్వం ఇట్టి ప్రయత్నాలు చేయకపోయినా, అజాద్ కాశ్మీర్ సేనలనుగురించి మాత్రం గట్టిపట్టు పట్టింది. జనవరి 13 నుంచి ఏప్రిల్ 15 వరకు ఇరుపక్షాలలోను

సంప్రదింపులు జరిగి, చివరకు ఏప్రిల్ 28 తేదీన తాత్కాలిక శాంతి సంధిషరతులు రెండు ప్రభుత్వాలకు ఐక్యరాజ్యసమితి సంఘం అందజేసింది. ఆషరతులు ఏనాటికీ ప్రచురింపబడలేదు; వాటిని భారతప్రభుత్వం అంగీకరించాడని మాత్రం తెలుసును; పాకిస్థాన్ అంగీకరించినదీ లేనిదీ తెలియదు. తన ప్రయత్నాలు విఫలమైనవని ఐక్యరాజ్యసమితి సంఘం అంగీకరించింది.

కాశ్మీర్ శాశ్వతంగా, భారతదేశంలో జేరిపోవాలని కాశ్మీర్ ప్రధాని షేక్ అబ్దుల్లా, కాశ్మీర్ జాతీయ మహాసభ కోరుతున్నారు. కాశ్మీర్ అధికారదత్తతను శాశ్వత అధికారదత్తతగా భావించవలసిందని అక్టోబరు 12 వ తేదీన జాతీయమహాసభ తీర్మానించింది. కాశ్మీర్ పౌరసైన్యం భారతసేనలకు చాల తోడ్పడుతూ, మాతృదేశాన్ని సంరక్షిస్తున్నది. షేక్ అబ్దుల్లా ప్రభుత్వం ప్రజారంజకంగా పరిపాలిస్తున్నది. భారతదేశంలో ఇంతవరకు విమర్శకు రానిది ఒక్క షేక్ అబ్దుల్లా ప్రభుత్వమే! కాశ్మీర్ విభజనను తుదిదాకా ప్రతిఘటిస్తామని అబ్దుల్లా చెప్పుతున్నాడు. అయినా అది జరగక తప్పేటట్లు లేదు. కాశ్మీర్ ప్రజలు భారతరాజ్యాంగపరిషత్తులో కూడా పాల్గొంటున్నారు. కాశ్మీర్ భారతదేశంలో శాశ్వతంగా జేరిపోయిందని దీనివల్లనే తెలుస్తున్నది. అయినా భారతప్రభుత్వం ఇంకా కాశ్మీర్‌ను శాశ్వతంగా జేర్చుకున్నట్లు చెప్పటానికి భయపడుతున్నది.

ఇండియాగాని పాకిస్థాన్‌లలో దేనిలోను జేరకుండా కాశ్మీర్ స్వతంత్రంగా వుండాలని కొందరు విదేశీయులు సూచిస్తున్నారు. ఇందుకు కాశ్మీర్ జాతీయమహాసభ, ఇండియా, పాకిస్థాన్‌లు అంగీకరించవు కాబట్టి అది జరగదు. కాశ్మీర్ స్వతంత్రంగా వుండటం దానికేగాక ఇండియా పాకిస్థాన్‌లకుకూడా నష్టదాయకమే. ఇండియాపాకిస్థాన్‌లనుబలహీనంగా వుంచి, అగ్రరాజ్యాలు పెత్తనం చేయటానికి ఈ సూచన చేస్తున్నారు.

తాత్కాలిక శాంతి సంప్రదింపులు విఫలమై, ఇండియా పాకిస్థాన్‌లమధ్య తిరిగి యుద్ధం ప్రారంభమయ్యేసూచనలు కనిపిస్తున్నవి. ప్లెబిసైట్ సంగతి, శాంతిసంగతి ఎట్లావున్నా తిరిగి యుద్ధం ప్రజ్వరిల్ల



రైలు మార్గము
రోడ్లు
సైనిక పరిహద్దు
0 25 50 మైళ్లు
సోవియెట్ రష్యా
పామిర్
ఆఫ్ఘనిస్థాన్
ఖోటాన్
ముస్తాజ్
యాసిన్
చిత్రాల్
చిత్రాల్
స్వాట్
హుంజా
నాజిర్
గిల్గిట్
ఆస్టర్
స్కర్డూ
కిరన్
గురెజ్
కార్గిల్
ఖలాట్సె
సింధునది
శ్రీనగర్
పూంచ్
మెందార్
రాజౌరీ
నౌషేరా
బెనిహాల్ కనుమ
రాంబాన్
రావల్పిండి
ఝీలం
ఝీలం
భింబర్
జమ్మూ
చీనాబ్
సియాల్‌కోట్
పఠాన్‌కోట్
లాహోర్
అమృతసర్
బియాస్
రావి
ఇండియా
పశ్చిమ పంజాబ్
ఫిరోజ్‌పూర్
లూధియానా
సిమ్లా
కాల్కా
సట్లెజ్
తూర్పు పంజాబ్

కుండా చేయటానికిగాను యుద్ధవిరమణగీతను శాశ్వతంగా కాశ్మీర్‌లో ఈ చివరనుంచి ఆ చివరకు నిర్ణయించి, అటుతర్వాత రాజకీయవిషయాలు ఆలోచించవలెనని ఐక్యరాజ్యసమితిసంఘం నిర్ణయించింది. జనవరి 1 వ తేదీన యుద్ధవిరమణ జరిగినప్పుడు గురెజ్ ఉత్తరప్రాంతాలలో సరిహద్దు గీత గీయలేదు. ఆపని ఇప్పుడు జరిపి, ఉభయపక్షాలప్రాంతాలను శాశ్వతంగా నిర్ణయించటానికి ఉభయపక్షాల ప్రతినిధులను ఐక్యరాజ్యసమితి సంఘం కరాచీలో ఈమధ్య సమావేశపరచింది. యుద్ధవిరమణ తర్వాత పాకిస్థాన్ సేనలు అన్యాయంగా ఆక్రమించుకున్న ప్రాంతాలు చాలవరకు వారి ఆక్రమణలో వుండనివ్వటానికే భారతప్రభుత్వం విధిలేక అంగీకరించింది. లడఖ్‌లోయప్రాంతంమాత్రం భారతప్రభుత్వ అధీనంలోకి వచ్చింది. ఇది టిబెట్ సరిహద్దుప్రాంతము. గిల్జిట్ ప్రాంతము పాకిస్థాన్ ఆక్రమణలో వున్నది. ఇది ఆఫ్ఘనిస్థాన్, రష్యాలకు సరిహద్దున వున్నది. ఈ సరిహద్దుగీతను భారతప్రభుత్వం జులై 80 వ తేదీననే ఆమోదించింది.

ఇక రాజకీయాలవిషయం చర్చించి, తాత్కాలిక శాంతి సంధి కుదర్చటానికి కాశ్మీర్‌సంఘం ప్రయత్నించవచ్చును. లేదా, ఒక సంఘం బదులు ఒక వ్యక్తి—పాలస్తీనాలోవలె ప్రయత్నిస్తే బాగుండునని భద్రతామండలి భావిస్తే ఒక వ్యక్తిని బహుశః అడ్మిరల్ నిమిట్జును నియమించవచ్చునని భావిస్తున్నారు. తిరిగి యుద్ధం ప్రజ్వరిల్లే ప్రమాదం లేదని మనం భావించరాదు.

ప్లెబిసైట్ జరుగుతుందా, జరిగితే ఫలితం ఎట్లా వుంటుంది అనే సంగతి ఇప్పుడు దాదాపు అనవసరమైపోయింది. కాశ్మీర్ విభజన మాటలలోగాక చేతలలో జరిగిపోయింది. ఇప్పుడు పాకిస్థాన్ ఆక్రమణలో వున్న ప్రాంతం ఇక ఎప్పటికీ వుండిపోవటమే నిశ్చయం. ఒకవేళ ఇందులో కొంతప్రాంతం భారతదేశంలో తిరిగి కలిస్తే అది దైవకృపగాని, పాకిస్థాన్ అసమర్థతగాని అని చెప్పవలసిందేగాని ఐక్యరాజ్యసమితి న్యాయబుద్ధిఅనీ, భారతప్రభుత్వ సమర్థతఅనీ ఎంతమాత్రము భావించరాదు.

# ఇండియా - పాకిస్థాన్ సంబంధాలు

భారతఖండం శాంతి సంపదలతో వర్ధిల్లాలంటే ఇండియా- పాకిస్థాన్‌లు అనేక సమస్యలను సామరస్యంతో పరిష్కరించుకుని, ఇచ్చి-పుచ్చుకునే వ్యవహారాలలో కొంచెం ఎగుడుదిగుడులను లెక్కచేయకుండా, హృదయపూర్వక మైత్రితో మెలుగుతుండాలి. పాకిస్థాన్ స్థాపనకు పూర్వం ముస్లింలీగ్ నాయకులు తాము విడిపోవాలని కోరుతున్నామంటే ఇండియాతో ఏసంబంధాలు వుండరాదని భావించటం కాదనీ ఇండియాతో అన్నివిషయాలలోను అతిసన్నిహిత సంబంధాలు ఏర్పరచుకోవటమే తమ ఆశయమని చెపుతుండేవారు. దేశవిభజనానంతరం ఉత్పన్నమైన అనేక సమస్యలను పరిష్కరించుకోటానికీ, దేశాల సహజసంపదల స్వభావాలవల్ల తప్పనిసరియైన వస్తువులను ఇచ్చిపుచ్చుకునే వ్యవహారాలు ఆలోచించటానికే ఉభయ అధినివేశాల ప్రతినిధులు అనేక పర్యాయాలు సంయుక్తంగా సమావేశమై, ఉభయులకు సంతృప్తికరమైన ఒడంబడికలు కుదుర్చుకుంటున్నారు. 1947-48 సంవత్సరంలో జరిగిన కలకత్తా కరాచీ సమావేశాలు ఈవిషయంలో అతిముఖ్యమైనవి. వీటిలో కలకత్తా ఒడంబడిక రాజకీయాలు, తత్సంబంధమైన విషయాలకు సంబంధించినది; కరాచీ ఒడంబడిక వర్తక వ్యాపారవిషయాలకు సంబంధించినది.

ఇండియా, పాకిస్థాన్‌లమధ్య వివాదాస్పదమైన విషయాలు ముఖ్యమైనవి మూడు: సంస్థానాలు, కాందిశీకులు, దేశవిభజన సమస్యలు. సంస్థానాలలో వివాదానికి దారితీసినవి జునాగడ్, హైదరాబాద్, కాశ్మీర్‌లు. వీటిలో జునాగఢ్, హైదరాబాద్‌లు పాకిస్థాన్‌కు పతికూలంగా పరిష్కారమైపోయాయి. హైదరాబాద్ విషయమై పాకిస్థాన్ విదేశాంగమంత్రి అప్పుడప్పుడు భద్రతాసమండలిలో తన ఆక్రోశం వెడలబోసుకుంటుంటాడు. జునాగఢ్ విషయం పూర్తిగా సమసిపోయింది.

[illegible] పాకిస్థాన్ అంత శ్రద్ధగా ఆలోచిస్తున్నట్లులేదు. పాకిస్థాన్ ఆలోచనంతా ఒక్క కాశ్మీర్‌పైనే వున్నది. ఆవిషయం ఇంకొకచోట సమనిస్తాము.

దేశవిభజనవలన ఉత్పన్నమైన ముఖ్యసమస్య కాందిశీక సమస్య. పశ్చిమ పాకిస్థాన్‌నుంచి వచ్చివేస్తున్న ముస్లిమేతరులను సురక్షితంగా జేరవేసి, వారికి తాత్కాలిక సదుపాయాలు, సౌకర్యాలు ఏర్పాటు చేయటము, ఢిల్లీ, తూర్పు పంజాబ్‌లనుండి వెళ్ళిపోతున్న ముస్లింలను సురక్షితంగా పంపివేయుటను మొదలైన తాత్కాలిక సమస్యలను ఇండియా ప్రభుత్వం జయప్రదంగానే నిర్వహించింది. కాని వీటికన్న ముఖ్యమైనది కాందిశీక పునరావాస సమస్య. పశ్చిమ పాకిస్థాన్‌నుంచి దాదాపు 55 లక్షలమంది కాందిశీకులు వచ్చారు. వీరు స్థిరచరాస్తులనన్నింటిని పాకిస్థాన్‌లోనే వదలివేసి రావటంవల్ల, తాత్కాలిక సౌకర్యాలు ఏర్పాటు చేసినతర్వాత, వీరి ఆస్తులను రాబట్టుకునే విషయం ఆలోచించవలసివచ్చింది. తూర్పు పంజాబ్‌నుంచి వెళ్ళిపోయినవారు వీలైనంత చరాస్తిని వెంటతీసుకుపోయారు. వెళ్ళిపోయినవారికివున్న స్థిరాస్తి చాల తక్కువ. మనదేశం తరలివచ్చినవారు, తరలి వెళ్ళిపోయిన వారికన్న 2 లక్షల ఎకరాలు ఎక్కువభూమిని వదలివచ్చారు. పాకిస్థాన్‌నుంచి వచ్చివేసినవారు అక్కడ బ్యాంకులలో దాచుకున్న సొమ్ము, నేలమాళిగ కొట్లలో దాచుకున్న వస్తువులు మొదలైనవి తెచ్చుకోటానికి అనేక ఆటంకాలు విధించబడటంవల్ల కాందిశీకుల ఆస్తిసమస్య చివరకు అంతరధినివేశ సమావేశాలలో ఆలోచింపవలసి వచ్చింది.

కాందిశీకుల ఆస్తులను స్వాధీనపరచుకుని, రక్షిస్తుండటానికి ప్రత్యేకాధికారులు గతసంవత్సరారంభంలోనే నియమింపబడ్డారు. కాందిశీకులు వదలిపోయిన ఇండ్లు, మొదలైన స్థిరాస్తులు ఇతరులు నాశనం చెయ్యకుండా కాపాడుతూ, వాటిపైవచ్చే ఆదాయాన్ని వసూలుచేసి ఉంచుతూండటము వీరి బాధ్యత. ఈ బాధ్యతలు సంతృప్తికరంగా ఎప్పుడూ

నిర్వహింపబడలేదు. కాందిశీకుల ఆస్తిని ఊరికే వేసుకోవాలనే ప్రతి వారు ప్రయత్నిస్తారుగాని న్యాయమైన ఆదాయం ముట్టజెప్పరు. ప్రభుత్వము, ఉద్యోగులు న్యాయంగా ప్రవర్తిస్తేనే కాందిశీకులకు కొంచెం న్యాయం జరుగుతుంది. పాకిస్తాన్ ప్రభుత్వం ఇటువంటి న్యాయం చేయాలని ఎన్నడూ ఆలోచించనే లేదు. అసలు ముస్లిం నేతల ఆస్తిని తేలికగా వశపరచుకోటానికే జనాభా మార్పిడి, బలవంతంగా పాకిస్తాన్ ప్రారంభించింది. ఇండియా ప్రభుత్వపు తలపు వేరు. అందువల్ల ఇక్కడనుంచి వెళ్ళిన కాందిశీకులకు తాము వెళ్ళిన పాకిస్తాన్‌లోను, తాము వదిలి వేసిన ఇండియాలోనూకూడా న్యాయము, లాభము చేకూరింది, ఇండియా వచ్చిన ముస్లిమేతరులకు రెండువిధాలా అన్యాయమే జరిగింది. ఈ విషయం దేశవిభజనకు పూర్వమే మాస్టర్ తారాసింగ్ మొదలైన అకాలీ నాయకులు నొక్కి చెప్పారు. అప్పట్లో భారత ప్రభుత్వం ఈ విషయాన్ని పట్టించుకోలేదు.

పశ్చిమపాకిస్తాన్ సంగతి ఇట్లావుండగా, తూర్పు బెంగాల్ నుంచి కాందిశీకులు వచ్చివేయటం ప్రారంభమైంది. తూర్పు బెంగాల్ ప్రభుత్వ పక్షపాతవిధానాన్ని, లీగ్ వర్కర్లు పెడుతున్న కష్టాలను సహించలేక హిందువులు అక్కడినుంచి లేచివచ్చివేయటం ప్రారంభించారు. 1948 అక్టోబరు, నవంబరు నెలలకు ఈ కాందిశీకులసంఖ్య ఆందోళనజనకంగా వృద్ధిపొందింది. అప్పటికే దాదాపు ఒకకోటి 25 లక్షలమంది కాందిశీకులు పశ్చిమబెంగాల్ వచ్చారని ప్రధాని డా. బి. సి. రాయ్ అంచనా వేశాడు. పశ్చిమబెంగాల్ అసలే జనసమృద్ధమైన ప్రాంతము. తూర్పు బెంగాల్ నుంచి వచ్చిన కాందిశీకులకు అక్కడ పునరావాసం కల్పించటం అసాధ్యం. ఒకచెంప, పశ్చిమపాకిస్తాన్ నుంచి వచ్చిన కాందిశీకుల పునరావాసపు ఏర్పాట్లు ఇంకా పూర్తికానేకాలేదు. అందువలన ఈ కాందిశీక సమస్యనుకూడా ఎదుర్కోవలసి వస్తుందేమోనని భారతప్రభుత్వం భయపడింది. నవంబరు 5-వ తేదీన నాగపూర్‌లో సర్దార్ పటేల్

మాట్లాడుతూ, తూర్పుబెంగాల్ నుంచి హిందువులను పంపించివేస్తే, వారికి కావలసిన భూములక్రింద కొన్నిజిల్లాలనుకూడా వదలుకోవలసి వుంటుందని పాకిస్థాన్‌ను హెచ్చరించాడు. దీనిపై పెద్ద వాదోపవాదాలు జరిగాయి. తూర్పుబెంగాల్ నుంచి హిందువులు లేచిపోవటానికి పశ్చిమ బెంగాల్ ప్రభుత్వము, హిందువులు కారణమని ఆరోపిస్తూ, పాకిస్థాన్ పౌరులు తమ దేశరక్షణకు సిద్ధంగావుండాలని హెచ్చరిస్తూ తూర్పు బెంగాల్ ప్రధాని ఒక ప్రకటనచేశాడు. దానికి పండిట్ నెహ్రూ, డా. బి. సి. రాయ్ మొదలైనవారు సమాధానలిచ్చారు. మొత్తంమీద తూర్పుబెంగాల్ హిందువుల పరిస్థితి కొంతవరకు చక్కబడింది.

కాందిశీకుల ఆస్తిసమస్యలు, తూర్పుబెంగాల్ల సమస్యలు, ఇతర రాజకీయసమస్యలు ఆలోచించటానికి ఉభయ అధినివేశాల ప్రతినిధులు న్యూఢిల్లీలో డిసెంబరు 6-14 తేదీలమధ్య సమావేశమైనారు. ఈ సంవత్సరం జరిగిన అంతరధినివేశ సమావేశాలలో ఇదిచాల ముఖ్యమైనది. భారతప్రభుత్వం తరఫున శ్రీ గోపాలస్వామి అయ్యంగారు డా. శ్యాంప్రసాద్ ముఖర్జీ, డా. జాన్‌మత్తాయ్, శ్రీ. కె. సి. నియోగి, శ్రీ మోహన్‌లాల్ సక్సేనాలు, పాకిస్థాన్ తరఫున గులాంమహమ్మద్, ఖ్వాజాషహాబుద్దీన్, నూరుల్ అమీన్, దస్తీగారలు ఈ సంప్రదింపులలో పాల్గొంటున్నారు. ఈ సమావేశంలో రాజకీయ విషయాలనుగురించి, కాందిశీకుల ఆస్తులనుగురించి, ఇతర ఆర్థికవ్యవహారాలను గురించి ముఖ్య నిర్ణయాలు జరిగాయి.

ఉభయ అధినివేశాలలోను అల్పసంఖ్యాకులకు ధైర్యం కలిగించి నిబ్బరం చేకూర్చేటందుకుగాను 1. అంతరధినివేశ సమాచార సలహా సంఘాన్ని ఏర్పాటుచేయటానికి 2. అల్పసంఖ్యాకులకు సంబంధించిన ఒడంబడికలు ఏవిధంగా అమలు జరుగుతున్నదో పరిశీలించటానికి ఉభయ అధినివేశాల మంత్రులతో ఒక సంయుక్త సంఘాన్ని ఏర్పాటు చేయుటానికి 3. కలకత్తా ఒడంబడికలో సూచించిన అల్పసంఖ్యాకుల రక్షణ

బోర్డులు ఫిబ్రవరి 15 వ తేదీలోగా ఏర్పాటుచేయటానికి 4. తూర్పు బెంగాల్ - అస్సాం, తూర్పు బెంగాల్ - పశ్చిమ బెంగాల్ ల సరిహద్దులను, ఇతర తగాదాలను పరిష్కరించటానికి ఒక న్యాయమూర్తుల సంఘాన్ని నియమించటానికి 5. కాందిశీకులు తిరిగివచ్చి తమ స్వదేశాలలో నివసించదలచినచో ఉద్యోగులు వారిని ప్రోత్సహించేట్లు చేయాలని 6. ఈ ఒడంబడికలు ఏవిధంగా అమలు జరుగుతున్నవి పరిశీలిస్తుండటానికి ఉభయ అధినివేశాల ఉద్యోగుల సంఘాన్నొకదానిని ఏర్పరచటానికి ఈ సమావేశంలో నిర్ణయించారు. ఈనిర్ణయాలు అమలు జరిగినంతమాత్రాన అల్పసంఖ్యాకుల భయాలు - ముఖ్యంగా తూర్పు పాకిస్థాన్లోవున్న హిందువుల భయాలు - తొలిగిపోతవా అన్నప్రశ్న అటుంచి, ఈ నిర్ణయాలుకూడా చెప్పుకోదగ్గంతగా ఇంతవరకు ఏమీ అమలుజరగక పోవటము శోచనీయము.

ఆర్థికవిషయాలనుగురించి కరాచీ, కలకత్తా ఒడంబడికలలో జరిగిన ఏర్పాట్లు త్వరగా అమలు జరగటంలేదు 1. రెండు అధినివేశాల మధ్య రాకపోకలను సౌలభ్యపరచటానికి 2. వస్తువుల రవాణాపైగల నిర్బంధాలు తొలగించటానికి, 3. ఒక దేశంలోవున్న కంపెనీలు రెండో దేశంలోవున్న తమ బ్రాంచీలకు నిర్నిబంధంగా వస్తువులు పంపించేటందుకు అనుమతించేటందుకు 4. ఒక అధినివేశంలోనుండి రెండవ అధినివేశంలో భీమావ్యాపారంచేసే కంపెనీల ప్రయోజనాలు రక్షించటానికి 5. రైల్వేల విభజనవ్యవహారాల అంతిమపరిష్కారానికి ఒక కమిటీని నియమించటానికి 6. ఇండియా - పాకిస్థానులు కలిసివుండేగా బ్రిటిష్ వద్ద కొన్న యుద్ధసామాగ్రికి పాకిస్థాన్ తనవంతు సొమ్ము చెల్లించటానికీకూడా ఈ సమావేశంలో ఏర్పాట్లు, నిర్ణయాలు జరిగాయి.

కాందిశీకుల ఆస్తులవిషయంలో 1. భూముల లెక్కలను ఒక అధినివేశంవారు ఇంకొక అధినివేశానికి యిచ్చేవిషయం ఆలోచించటానికి ఒక కమిటీని 2. కాందిశీకుల ఆస్తుల రక్షకులతో సన్నిహితంగా వుండి

కాందిశీకుల ఆస్తుల వ్యవహారాలు వారికి త్వరగా తెలుపుతుండేటందుకు ప్రత్యేక ఉద్యోగులను నియమించటానికి 3. చరాస్తిని త్వరగా వాపసు చేసేటందుకు ఒక సంయుక్తసంఘాన్ని ఏర్పరచేటందుకు ఈ సమావేశంలో నిర్ణయమైంది.

కాందిశీకుల ఆస్తివిషయాలు జాగ్రత్తగా పరిశీలించేటందుకు కరాచీలో 1949, జనవరి 10-13 తేదీలలో ఉభయ అధివేశాల ప్రతినిధులు తిరిగి సమావేశమైనారు. వ్యవసాయదారుల భూములనుగురించి, ఆస్తులనుగురించి ఆలోచించటానికి కావలసిన రికార్డులు, అంకెలు తమ వద్దలేవనీ, అందువల్ల ప్రస్తుతానికి పట్నవాసుల ఆస్తులనుగురించిమాత్రమే ఆలోచించాలని పాకిస్తాన్ సూచించింది. ఇది ఇండియాకు చాల నష్టము. మనదేశం తరలివచ్చిన కాందిశీకులు వదలివచ్చినభూమి ఇక్కడనుంచి వెళ్ళిపోయిన కాందిశీకులు వదలివెళ్ళినభూమికంటె కనీసం 2 లక్షల ఎకరాలు ఎక్కువ. ఈ 2 లక్షల ఎకరాలకు ఖరీదు మనకు యివ్వవలసి వస్తుందనే భయంతోనే పాకిస్తాన్ ఈ పన్నాగం పన్నింది. పట్నవాసుల ఆస్తులు రెండువైపుల సరిసమానంగానే వుంటవి కాబట్టి వాటివిషయం ఆలోచించేటందుకు పాకిస్తాన్ అంగీకరించింది. అయితే భారతప్రతినిధులు తమ పక్షాన్ని సరిగా వాదించుకోలేక పాకిస్తాన్ సూచనకు తలవూపారు. పట్నాలలోని ఆస్తిమార్పుకు నేవిషయాన్నిగురించి, కాందిశీకుల ఆస్తికి నష్టపరిహారం యిచ్చేటందుకు అనుసరించవలసిన సూత్రాలనుగురించి, చరాస్తిని స్వంతదారులకు యిచ్చివేయటాన్నిగురించి, ట్రస్టుల ఆస్తులను గురించి ఆలోచించటానికి ఒక కమిటీ నియామకానికి, కాందిశీకుల ఆస్తులవిషయాలు ఆలోచించటానికి ఉభయఅధివేశాల ఉద్యోగులసంఘమొకటి, మంత్రుల సంఘమొకటి నియమించటానికి ఈ సమావేశంలో నిర్ణయాలు జరిగాయి.

ఈ సమావేశాలలో ప్రతివిషయము పరిశీలించటానికి ప్రత్యేక సంఘాలు మొదలైనవి ఏర్పాటుచేయటంకంటె జరిగినది ఏమీలేదు.

చర్చకువచ్చిన ప్రతివిషయము ఇంకా ఆలోచించవలసివుంటే, ఆ సమావేశం జరపటం అనవసరమే. ఉభయ అధినివేశాల ప్రతినిధులు ఏఒక్క విషయాన్నిగురించి హృదయపూర్వకమైన, సంతృప్తికరమైన సమాధానానికి రాలేకపోయారని ఇందువలన రుజువౌతున్నది. తమ సమావేశ వైఫల్యాన్ని నేరుగా ఒప్పుకోలేక అనేక కమిటీలను నియమించి, ప్రస్తుతానికి వైఫల్యాన్ని కప్పిపుచ్చారు. సమావేశంలో జరిగిన కొద్దిపాటి నిర్ణయాలుకూడా వాస్తవంగా ఆచరణలో పెట్టబడలేదు. కాందిశీకులు తాము వదలిపెట్టివచ్చిన ఆస్తిని, ఇతరులు ఇక్కడ వదలిపెట్టిన ఆస్తితో మారకం వేసుకోవచ్చునని అంతరధినివేశసమావేశంలో అంగీకరించారుగాని గత ఆరునెలలలోను కేవలం 80 మందిమాత్రమే అట్లా మార్పుకోగలిగారు. సమావేశాలలో నిర్ణయాలుచేయటం ఒకవంతు; వాటిని ఉద్యోగులు ఆదరించి, ఆచరించటం ఇంకొకవంతు; వీటిలో రెండవది జరగనప్పుడు మొదటిది జరిగినా నిష్ఫలం.

ఇండియా-పాకిస్థాన్ల ప్రతినిధుల సమావేశం మరొకటి ఏప్రిల్ నెలారంభంలో జరిగింది. ఇది అంతముఖ్యమైనదికాదు. ఒక అధినివేశం నుంచి ఇంకొక అధినివేశంలోకి మారిన ప్రభుత్వోద్యోగుల పెన్షన్, ప్రావిడెంట్ ఫండు, ఇతర డిపాజిట్లు మొదలైనవి త్వరగా ఇచ్చివేయటాన్నిగూర్చి, కాష్ సర్టిఫికేట్లు ట్రాన్స్ఫర్‌ను గురించి, తూర్పు పశ్చిమ పంజాబ్‌ల విభజన సమస్యలు, మొదలైన 27 సమస్యలనుగురించి చర్చించి సంతృప్తికరమైన ఒడంబడికకు ఉభయ అధినివేశ ప్రతినిధులు రాగలిగారు. ఇవి అప్రాముఖ్యమైన విషయాలు. ఇటువంటి అంతరధినివేశ సమావేశాలు ప్రతినెలా జరపాలనికూడా ఇప్పుడే నిర్ణయించారు. హైదరాబాద్ నవాబు పాకిస్థాన్‌కు ఋణమిచ్చినవిషయం ఈసమావేశంలో ప్రస్తావనకు వచ్చిందిగాని దానిని చర్చించటానికి పాకిస్థాన్ ఒప్పుకోలేదు.

ఒక అధినివేశంనుంచి రెండవ అధినివేశానికి ఎగుమతి చేయబడుతున్న వస్తువులపై కేంద్రప్రభుత్వ ఎక్సైజ్ పన్నులు పూర్తిగా ముదరా

యుక్తాటానికి అంగీకరిస్తూ 1949 మే నెలలో ఒక ఒడంబడిక జరిగింది. కొన్ని వస్తువులపై ఎగుమతి దిగుమతి సుంకాలు పూర్తిగా రద్దుచేసి, వ్యాపారం ఇతోధికంగా జరగటానికి దోహదం చేసేటందుకు అంతరదేశ సమావేశం ఒకటి త్వరలో జరగబోతున్నది.

ఈశాన్య ఆసియా దేశాలమధ్య వ్యాపారాన్ని గురించి గతసంవత్సరం మే నెలలో కరాచీలో జరిగిన ఒడంబడిక జూన్ నెలాఖరులో అంతమైంది. దీనికి ప్రత్యామ్నాయంగా ఇంకొక వ్యాపార ఒడంబడిక కుదుర్చుకోటానికి ఉభయదేశాల ప్రతినిధులు సమావేశమై జూన్ నెలాఖరుకు ఒక ఒడంబడికకువచ్చారు. గతసంవత్సరపు ఒడంబడికవలన లాభనష్టాలను ఉభయులు బేరీజువేసుకొని ఈసమావేశానికి తయారైనారు. గతసంవత్సరం ఇండియా - పాకిస్థాన్‌లమధ్య జరిగిన వ్యాపారం దాదాపు 200 కోట్ల రూపాయలు. ఇండియానుంచి పాకిస్థాన్‌కు ఎగుమతులకన్న, దిగుమతులు రూ 47 కోట్లు ఎక్కువ. ఇంతమొత్తపు సొమ్ము పాకిస్థాన్‌కు ఇండియా ఇచ్చుకోవలసివస్తున్నది. అందువల్ల దిగుమతులు తగ్గించుకోటానికి ఇండియా ప్రయత్నించింది. గతసంవత్సరపు ఒడంబడికలో పాకిస్థాన్ నుంచి 6½ లక్షల బేళ్ళ ముడిప్రత్తికొంటే ఈసంవత్సరం 4½ లక్షల బేళ్ళు మాత్రమే కొనాలని నిర్ణయించారు. ఇదేవిధంగా, తోళ్ళు 25 లక్షలనుంచి 12 లక్షలకు, ముడి జనపనార 55 లక్షల బేళ్ళనుంచి 40 లక్షల బేళ్ళకు తగ్గించుకోటానికి ఇండియా నిర్ణయించింది. దీనితోపాటు పాకిస్థాన్‌కు ఎగుమతులుకూడా తగ్గించారు. రాక్షసిబొగ్గు ఎగుమతి 34 లక్షల టన్నులనుంచి 20 లక్షల 40 వేల టన్నులకు, నూలుగుడ్డ 3 లక్షల బేళ్ళనుంచి 1½ లక్షల బేళ్ళకు, ఆవనూనె 50 వేల టన్నులనుంచి 35 వేల టన్నులకు తగ్గించటానికి అంగీకరించారు.

ఎగుమతి దిగుమతుల వ్యత్యాసంవల్ల మనం చెల్లించవలసి వచ్చే డబ్బు రూపాయలలోను, స్టెర్లింగు రూపేణాను చెల్లించవచ్చునని గత సంవత్సరం నిర్ణయించారు. అయితే, ఆ స్టెర్లింగు 1-వ ఖాతాకుచెందిన

నికి పూర్వం భారతప్రభుత్వం ఒక ఆర్డినెన్సు జారీచేసింది. దానిప్రకారం ఇండియాలో ఆస్తికలిగివుండి, పాకిస్తాన్‌లో కాందిశీకుల ఆస్తిని సంపాదించిన వారినందరినీ ఇండియాలో కూడా కాందిశీకులుగా భావించి, వారి ఆస్తిని పాకిస్తాన్‌నుంచి వచ్చిన వారికి ఇవ్వటానికి ప్రభుత్వానికి అధికారం వస్తుంది. ఈ ఆర్డినెన్సు లేక పూర్వం చాలమంది భాగ్యవంతులైన ముస్లింలు పాకిస్తాన్ వెళ్ళి, కాందిశీకులమని చెప్పి ఆస్తి సంపాదించుకుని, ఇండియా, పాకిస్తాన్‌లలో రెంటిలోను ఆస్తులు సంపాదించటం మొదలు పెట్టారు. దానిని అరికట్టటానికే భారతప్రభుత్వం ఈ ఆర్డినెన్సు జారీ చేసింది. పాకిస్తాన్ ప్రభుత్వంలో బలంగా వున్నవారు ఇటువంటి ముస్లిములే కాబట్టి ఈ ఆర్డినెన్సును పాకిస్తాన్ హర్షించలేకపోయింది. ఈ ఆర్డినెన్సును సాకుగా తీసుకుని దానిని తొలగించేటంతవరకు కాందిశీకుల ఆస్తివిషయం పరిష్కారం కాకూడదని పాకిస్తాన్ పట్టుపడుతున్నది. ఇంతకూ కాందిశీకుల ఆస్తివల్ల వచ్చేలాభాన్ని పోగొట్టుకుని, వారికి న్యాయంచేయాలని పాకిస్తాన్‌కు ఏకోశానా లేదు; వున్నదనుకోవటం మతిభ్రమమాత్రమే.

ఈవిధంగా వ్యాపారం విషయంలోను, కాందిశీకుల విషయంలోను పాకిస్తాన్ మనలనుంచి లాభం పొందుతున్నది. అసలు విషయాలు సమగ్రంగా ప్రజలకు చెప్పటానికే ఇండియాప్రభుత్వం ఇష్టపడటంలేదు; ప్రతి ఒడంబడిక మనకే మంచిదని పైకి చెపుతున్నారు. అంతే. కార్యరూపంలో నష్టమంతా మనదే.

ఇది ఇట్లావుండగా ఇండియా-పాకిస్తాన్‌లు ఒక కస్టమ్స్ యూనియన్‌గానో, కస్టమ్స్ డిఫెన్స్ యూనియన్‌గానో ఏర్పడాలని కొందరు పెద్దలు సూచిస్తున్నారు. దేశం ఎట్లాగూ విభజితమైపోయింది కాబట్టి తిరిగి ఈవిధంగానైనా కొంత ఐక్యత సంపాదించాలని వీరి ఆశయం. మనదేశంలో ఇట్టి పిచ్చిభావాలు వున్నంతకాలం పాకిస్తాన్ మనకు కష్టనష్టాలు కలిగిస్తూనే వుంటుంది. భారతదేశ ఐక్యతపైన పాకిస్తాన్‌కు

వ్యామోహం లేదు, వ్యామోహం వున్నవారు కోరితే, అందుకుతగ్గమూల్యం చెల్లిస్తే పాకిస్తాన్ అందుకు వప్పుకోవచ్చు. ఆమూల్యం చెల్లించటం వస్తురూపేణా, ధనరూపేణా మన ప్రజలను మోసంచేయటమే అవుతుంది. కస్టమ్స్ యూనియన్ (సుంకాలు లేకుండా నిర్నిబంధంగా వ్యాపారం చేసుకునేపద్ధతి) ఏర్పడాలంటే అది ఉభయులకు లాభసాటిగా వుండాలికాని వ్యామోహాన్ని తీర్చుకోటానికి కాదు. భారతప్రభుత్వం అనునయ వైఖరి అనుసరిస్తున్నంతకాలం పాకిస్తాన్ ప్రభుత్వం బెద్రిగుస్తూ, లాభాలు పొందుతూనే వుంటుంది. ప్రస్తుత భారతప్రభుత్వం పాకిస్తాన్‌పట్ల సరియైన, సమంజసమైన వైఖరి అనుసరించగలదను ఆశ ఇంతవరకు ఏమీ కలగటం లేదు. మనపట్ల సమంజసంగా ప్రవర్తించటానికి, మనతో చేసుకున్న ఒడంబడికను అక్షరాలా పాటించటానికి, తనకు ఒక చిల్లిగవ్వంత కష్టనష్టం ఏర్పడినట్లు కనిపిస్తే, నిరాకరించటానికి పాకిస్తాన్ ఎన్నడూ సంకోచించదు; మొహమాటపడదు. పాకిస్తాన్‌తో మనకు ఎంతతక్కువ సంబంధాలువుంటే అంతమంచిది.

# వైదేశిక వ్యవహారాలు

మనదేశం స్వతంత్రమైనవెంటనే మనం ఆనందంతో స్వీకరించిన బాధ్యత వైదేశిక వ్యవహారాల నిర్వహణ. విదేశాలతో సమాన పాదాలో సంబంధాలేర్పరచుకోవటం దేశస్వతంత్రతకు చిహ్నం. విదేశాలతో సంబంధంలేని స్వతంత్రదేశం ప్రపంచంలో తనస్థాయిని, ప్రతిష్ఠను నిలబెట్టుకోలేదు. మనకు ఇతరదేశాలలో సంభవిస్తుండే లావాదేవీలను పరిష్కరించుకోటానికి, విదేశాలతో మన వర్తకవ్యాపారాలు వృద్ధి చేసుకోటానికి, విదేశాలలో నివశిస్తున్న మనదేశీయుల సంరక్షణకు మనప్రభుత్వం ప్రతిదేశములోను తన ప్రతినిధులను నియమించి వుంచాలి. అప్పుడు ప్రపంచపరిస్థితులను మనం సరిగా అవగాహనచేసుకుని తదనుగుణ్యంగా వ్యవహరించగలుగుతాము.

భారతదేశం స్వతంత్రమవటంతో ప్రపంచ రాజకీయాలలో, ప్రాక్పశ్చిమాల సంబంధాలలో ఒక విప్లవాత్మక మార్పువచ్చింది. ఇండియాతోపాటు సిలోన్, పాకిస్థాన్, బర్మాలు స్వాతంత్ర్యం పొందాయి; ఇండోచైనా, ఇండొనీషియాలు స్వాతంత్ర్య పోరాటాన్ని చేస్తున్నాయి. ఇంతకు పూర్వము ఈ రాజ్యాలన్నీ పాశ్చాత్యరాజ్యాల ఆక్రమణలో పడివుండటంవల్ల ప్రపంచరాజ్యాల సమావేశాలలో ఆసియా రాజ్యాల గొంతుక అసలు వినపడేదికాదు; ప్రపంచమంటే యూరప్ రాజ్యాలనే అర్థం వస్తుండేది. కాని ఇప్పుడది మారిపోయింది. ఇదివరకు వెనుకబడివున్న దక్షిణఅమెరికా రాజ్యాలు, మధ్యప్రాచ్యంలోని తురుష్క రాజ్యాలు, ఆసియారాజ్యాలు ఒక్కమారుగా పైకివచ్చాయి. ఇప్పుడిప్పుడే పైకివస్తున్న రాజ్యాలన్నీ— ముఖ్యంగా ఆసియారాజ్యాలు —ప్రపంచశాంతి సౌభాగ్యాల పురోభివృద్ధినే తమలక్ష్యంగా పెట్టుకున్నాయి. ఇన్నాళ్లనుంచి ప్రపంచాధిపత్యంలోవున్న పాశ్చాత్య

రాజ్యాలు రెండు ప్రపంచ సంగ్రామాలవలన, అనాడినుంచి తమకువున్న పరస్పర వైరుధ్యాలవలన. తమ ఆధిపత్యం క్రిందవున్న ఆసియా రాజ్యాలు స్వతంత్రాలు కావటంవలన క్రమేణా క్షీణించిపోతున్నవి. ప్రపంచ రాజ్యాల సభలలో ఆసియా రాజ్యాల, ఇతరరాజ్యాల మాటలే ఎక్కువగా వినపడుతున్నవి; గౌరవింపబడుతున్నవి. పాశ్చాత్యరాజ్యాల నాయకత్వం ప్రపంచాన్ని సంక్షోభపెట్టింది; ద్వేషానలం ప్రజ్వరిల్లజేసింది; ప్రపంచశాంతికి నాయకత్వం వహించటానికి తాము అసమర్థులని ఆరాజ్యాలు రుజువుచేసుకున్నవి. ఆసియా రాజ్యాల విషయం వేరు. అవి ఇప్పుడిప్పుడే నవజీవనం పొందుతున్నవి; వీటిలో ద్వేషభావం ఏమీ లేదు; ప్రపంచశాంతికి, సర్వమానవ కల్యాణానికి పాటుపడాలని నిష్కపటమైన వాంఛతో ఈరాజ్యాలు ముందుకు వస్తున్నవి. భవిష్యత్తులో ప్రపంచనాయకత్వం వీటిదే నని అందరూ గుర్తిస్తున్నారు. ఆసియా రాజ్యాలలో ప్రస్తుతం అన్నివిధాల అగ్రగామిగావున్న భారతదేశంమరి కొంతకాలంలో ప్రపంచనాయకత్వం వహించవలసి రావచ్చును. మనం విదేశాలతో సంబంధాలు ఏర్పరచుకునేటప్పుడు, విదేశాలతో వ్యవహారాలు నిర్వహించేటప్పుడు, ప్రపంచసభలలో ఒక వైఖరి వహించి మాట్లాడేటప్పుడూ ఈ దృక్పథంతోనే మనం ఇప్పటినుంచీ వ్యవహరించాలి.

కమ్యూనిస్టు చైనా బలపడినప్పటికీ ఆసియారాజ్యాల నాయకత్వం ఇండియాకుగాక చైనాకు లభించగలదని కొందరు భావిస్తారు. ఒకవేళ కమ్యూనిస్టుచైనా బలవత్తరమైన రాజ్యంగా స్థిరపడినా, అది మాస్కో ఆధిపత్యాన్ని కాదని తన స్వతంత్రవిధానాన్ని అనుసరిస్తుందని భావించటానికి అవకాశంలేదు. కమ్యూనిస్టుచైనా రష్యా ఆధిపత్యాన నడుస్తుంటే ఆసియా రాజ్యాలలో దానికి ఏమాత్రమూ ప్రతిష్ఠ వుండదు. పైగా కమ్యూనిజం వ్యాప్తిని అరికట్టాలని విశ్వప్రయత్నాలు చేస్తున్న ఆంగ్లో-అమెరికన్ రాజ్యాలు ఇతర ఆసియారాజ్యాలకు అన్నివిధాల తోడ్పడి, ఈ దేశాలలో కమ్యూనిస్టు ప్రభుత్వాలు ఏర్పడకుండా చూస్తుంటవి. ఆగ్నేయ

ఆసియా, మధ్యప్రాచ్యరాజ్యాలలో భారతదేశంపట్ల వున్న గౌరవం చైనా పట్ల ఎన్నడూ లేదు. కాబట్టి కమ్యూనిస్టు చైనా, ప్రజాస్వామిక భారత దేశంకన్న ముందంజవేసి ఆసియా నాయకత్వాన్ని అందుకోలేదు. అయితే, భారతప్రభుత్వ వైదేశిక విధానము, ఆంతరంగిక విధానము లోపభూయిష్టములై, ఇండియా ప్రపంచంలో తనపట్లగల మంచితనాన్ని పోగొట్టుకుని, ఆంతరంగికంగా బలహీనమైన దేశమైపోతే కమ్యూనిస్టు చైనాదే పైచేయి కావచ్చును.

ప్రపంచరాజ్యాలన్నిటి ప్రతినిధులతోను మన దేశప్రతినిధులు ఐక్యరాజ్యసమితి సమావేశాలలో కలిసి పాల్గొంటారు. ఈ సమావేశాలలో ఇతరదేశాలన్నీ మన విధానాలను, వైఖరులను, మన ప్రతినిధుల ప్రవర్తనను అడుగడుగునా పరిశీలిస్తవి. మనమవలంబించే వైఖరి సమంజసత, మనప్రతినిధుల మాటలసరణి మనకు ప్రతిష్ఠ తెస్తాయి. ఐక్యరాజ్య సమితిగాక దాని అనుబంధసంస్థలనదగిన అంతర్జాతీయ సంస్థలు చాల వున్నవి. వాటన్నిటిలోకూడ భారతప్రతినిధులు ఇతరదేశాల ప్రతినిధులతో పరిచయం చేసుకుంటుంటారు.

ఈ సంవత్సరం ఐక్యరాజ్యసమితి సర్వసభ్య సమావేశం మొదట కొంతకాలం పారిస్‌లో జరిగి, వాయిదాపడి, తిరిగి న్యూయార్క్‌లో జరిగింది. పారిస్ సమావేశానికి వెళ్ళిన భారతప్రతినిధులకు శ్రీమతి విజయలక్ష్మి పండిట్ నాయకత్వం వహించింది. న్యూయార్క్ వెళ్ళిన ప్రతినిధివర్గానికి శ్రీ చిమన్‌లాల్ సెతల్‌వాడ్ నాయకత్వం వహించాడు. ఈ రెండు సమావేశాలలోను భారత ప్రతినిధులు ప్రపంచదృష్టి నాకర్షించారు. ధర్మకర్తృత్వ సంఘంలో భారత ప్రతినిధి శ్రీ శివరావు, ఏటామిక్ కమిషన్‌లో భారతప్రతినిధి శ్రీ ఓ. యన్. రావు చాల మెప్పు గడించుకున్నారు. అనేక విషయాలపై భారతదేశ దృక్పదాన్ని ఇతర రాజ్యాలన్నీ హర్షించినవి. కాని తీర్మానాల విషయం, నిర్ణయాలవిషయం వచ్చేటప్పటికి భారతప్రతినిధులు సూచించిన తీర్మానాలు యథాతథంగా అంగీకరింపబడలేదు. మనవైఖరిని హర్షించిన ఇతరులుకూడా, ఇతర

స్వలాభాపేక్షలవలన వాటిని అంగీకరింపలేక పోయినారు మనకు అతి ముఖ్యమైన దక్షిణాఫ్రికా భారతీయుల విషయంలోకూడా ఐక్యరాజ్య సమితి ఏమీ చేయలేకపోయింది. అంతేకాదు, ఐక్యరాజ్యసమితి ఉపాంగాలైన భద్రతామండలి, రాజకీయ సంఘము, ఆర్థిక సామాజిక సంఘము, ధర్మకర్తృత్వ సంఘము మొదలైనవాటిలో దేనికీ ప్రముఖ స్థానంలో భారతీయుడు ఎన్నుకోబడలేదు. ఆ ఎన్నికలు అగ్రరాజ్యాల, తదితర గ్రూపుల ఇష్టాయిష్టాలనుబట్టి జరుగుతుండటంవల్ల, సర్వస్వతంత్రమైన, నిష్పాక్షిక విధానం అవలంబించే భారతదేశానికి తావులేక పోతున్నది. అంతర్జాతీయ విజ్ఞానసంఘానికి అధ్యక్షుడుగా సర్. ఎస్. రాధాకృష్ణ, అంతర్జాతీయ కార్మికసంఘానికి అధ్యక్షుడుగా శ్రీ యస్. లాల్, అంతర్జాతీయ ఆరోగ్యసంస్థకు అధ్యక్షుడుగా సర్. లక్ష్మణస్వామి మొదలియార్ గారులు ఈసంవత్సరం ఎన్నుకోబడ్డారు. అంతర్జాతీయంగా మనకు ఈసంవత్సరం లభించిన గౌరవాలు యివిమాత్రమే.

మన విదేశాంగ వ్యవహారాల నిర్వహణ ఏమాత్రం బాగుపడలేదు. ఈసంవత్సరంలో అనేకదేశాలతో క్రొత్తగా మనం రాజకీయ, రాయబార సంబంధాలు ఏర్పరచుకున్నాము. విదేశాంగశాఖ వ్యయం చాల పెరిగింది. ఇది అవుసరమే, సమంజసమే. ఈ వ్యయానికి తగిన ప్రతిఫలం, మన విశిష్టవిధాన-వలన మనకు రాదగిన సత్ఫలితాలు మనం పొందలేక పోతున్నాము. ఇది మన రాయబారుల లోటు. రాయబారుల, తదితర ముఖ్యోద్యోగుల నియామకం కేవలం శక్తిసామర్థ్యాలనుబట్టి జరగటం లేదు. సంస్థానాధీశ్వరులను రాయబారులుగా నియమించవచ్చునని ఈ మధ్య కొందరు సూచిస్తున్నారు. ఇది వాస్తవమే అయితే, మన వైదేశిక శాఖ మరింత అపభ్రంశము, హాస్యాస్పదము అవుతుంది. వర్తక వ్యాపారాల విషయంలో, ముఖ్యంగా యంత్రసామగ్రి, సాంకేతిక నిపుణుల విషయంలో మనరాయబారులు తాము చేయవలసినంతకృషి చేయటంలేదు. ఈవిషయమై విదేశాంగ శాఖామంత్రి ఇతోధిక శ్రద్ధతో ఆలోచించాలి.

ఇండియా స్వతంత్రదేశమైనప్పటినుండి ఇండియా-బ్రిటన్ల భవిష్యసంబంధాలు ఒక ముఖ్య సమస్యగా ఆలోచింపబడుతూనే వున్నవి. భారత రాజ్యాంగ పరిషత్తుకూడా ఇండియా సర్వస్వతంత్ర రిపబ్లిక్ గా వుండాలని తీర్మానించి, తదనుగుణ్యంగా రాజ్యాంగ చట్టం తయారుచేస్తున్నది. 1947 సంవత్సరపు భారత స్వాతంత్ర్య చట్టంప్రకారం ఇండియా అధినివేశంగా మాత్రమే ఏర్పడింది. కాబట్టి భారత రాజ్యాంగ చట్టం పూర్తికాకముందే, ఇండియా-బ్రిటిష్ కామన్వెల్తులో సభ్యరాలుగా అధినివేశంగా వుండాలా లేక బ్రిటిష్ కామన్వెల్తులో తెగతెంపులు చేసుకుని సర్వస్వతంత్ర రిపబ్లిక్ గా ఏర్పడాలా అనే విషయం చర్చించుకొని, నిర్ణయం చేసుకోవలసివుంటుంది. అందువలన ఈ విషయం ఈ సంవత్సరం అతి ప్రాముఖ్యం వహించింది.

ఇండియా కామన్వెల్తులోనుండి విడిపోకూడదని బ్రిటన్, ఇతర అధినివేశాలుకూడ వాంఛిస్తున్నవి. మనరాజకీయ చరిత్రదృష్ట్యా, భారత జాతీయ కాంగ్రెసు ఇండియా రిపబ్లిక్ స్థాపనకే కృషిచేసింది. ఈవిధాన అధికార ప్రతిపత్తి అంగీకరిస్తే, కాంగ్రెసు తన పూర్వచరిత్రనే కాదనుకున్నట్లవుతుంది. ఇండియా అధినివేశ హోదాలో కామన్వెల్తులో కలిసివుండటం అసంభవం. అధినివేశ హోదాగాకపోతే, మరేహోదాలోనైనా కామన్వెల్తులో కలిసివుండవచ్చునా? కామన్వెల్తులో వుండటం మనకు లాభకరమా? అపాయకరమా? ఈ విషయాలు పరిశీలిస్తాము.

భారతదేశానికి ముఖ్యమైనవి రాజకీయ స్వాతంత్ర్యము, ఆర్థికాభివృద్ధి. రాజకీయ స్వాతంత్ర్యంకొరకు ఇన్నాళ్ళు పోరాడిన మనం, ఆ స్వాతంత్ర్యానికి ఎటువంటి ఆటంకము, భంగము కల్పించే సంబంధాలను తిరస్కరిస్తాము. కామన్వెల్తులోవుంటే మన రాజకీయ స్వాతంత్ర్యానికి ఏమైనా భంగం కలుగుతుందా? ఒకవేళ మనం అధినివేశములోనేవున్నా, మనదేశ వ్యవహారాలలో ఇంకొకరు జోక్యం కలుగజేసుకునే అవకాశంలేదు. రక్షణ, విదేశ వ్యవహారాలు మొదలైనవి పూర్తిగా మన యాజమాన్యాననే వుంటాయి. జార్జిరాజు ప్రతినిధిగా

ఇక్కడ ఒక గవర్నర్ జనరల్ వున్నా అతడు అన్నివిధాల మంత్రుల చెప్పుచేతలలోనే వుంటాడు. విదేశాలకు రాయబారులనుకూడా మంత్రులే ఎన్నుకుంటారు. నియామకంమాత్రం జార్జిగారి పేరుతో జరుగుతుంది. కామన్వెల్తు రాజ్యాలకు యుద్ధకాలంలోగాని, శాంతికాలంలోగాని ఏవిధంగానైనా తోడ్పడాలనిగాని, ఇతర సౌకర్యాలు చూపించాలనిగాని షరతు, నిర్బంధము ఏమీ వుండదు. కామన్వెల్తులోని ఇతర దేశాలను అన్నివిషయాలలోను, పరాయిదేశాలుగానే పరిగణించి వ్యవహరించవచ్చును. ఒక్కొక్క దేశ రాయబారుల నియామకంమాత్రం, నామమాత్రంగా, జార్జిరాజు పేర జరుగుతుంది. ఇదొక్కటే మనకు సరిపడని సంగతి.

అధికంగాకూడా కామన్వెల్తులో వుండటంవల్లగాని, వెళ్ళిపోవటంవల్లగాని మనకు వొరిగేదీ, పోయేదీ ఏమీ లేదు. మనకు కావలసిన వస్తువులు ఎక్కువగా బ్రిటన్‌లోనే మనం కొనుక్కుంటున్నాము. మన దేశంనుంచి బ్రిటన్ కూడా ఎక్కువ వస్తువులు కొంటున్నది. కామన్వెల్తునుంచి విడిపోవటానికి మనం నిర్ణయించినంతమాత్రాన ఈవర్తకం ఏమీ ఆగిపోదు. కామన్వెల్తులోలేని రాజ్యాలతో మనముగాని, బ్రిటన్‌గాని వ్యాపారంచేయటం మానుకున్నామా? కామన్వెల్తులో ఉన్నంత మాత్రాన బ్రిటన్‌కుగాని ఇతర అధినివేశాలకుగాని వ్యాపారంలో 'ప్రత్యేక సౌకర్యాలు'—ఇంపీరియల్ ప్రిఫరెన్స్ లాంటివి—ఇవ్వాలను నిర్బంధము ఏమీ లేదు. అది ఆయాదేశాల ఇష్టాయిష్టాలపై ఆధారపడి వుంటుంది. కామన్వెల్తులో లేని రాజ్యాలతోకూడా మనం ప్రత్యేక షరతులపై వ్యాపారపు ఒడంబడిక చేసుకోవచ్చును. కామన్వెల్తులోనే వున్న దక్షిణాఫ్రికాతో మన వ్యాపారసంబంధాలు తెంచుకుంటే ఎవరుకాదన్నారు? మనదేశ పారిశ్రామికాభివృద్ధికి కావలసిన యంత్రసామగ్రిని, సాంకేతిక నిపుణులను కామన్వెల్తులో వుండటంవల్ల బ్రిటన్ మనకు ఇతోధికంగా, ఇతరదేశాలకు సప్లయిచేసేకన్న,

యిస్తుందా? లేదు. స్టర్లింగు ప్రాంతాలలోవున్నదేశాలకు అమ్మటం కన్న ఇతరప్రాంతాలలోని దేశాలకు అమ్మటానికే బ్రిటన్ ఇష్టపడుతున్నది. ఇప్పుడు ఆర్డర్లిచ్చిన యంత్రసామగ్రి సరఫరాకే చాలరోజులు పడుతున్నది. సాంకేతిక నిపుణులుకూడ బ్రిటన్‌నుంచి వచ్చేఅవకాశం ఏమీలేదు. ఈవిషయంలో యునైటెడ్‌స్టేట్స్ మనకు బ్రిటన్‌కన్న ఎక్కువ ఉపయోగకారిగావుంటుంది. ఇక స్టర్లింగు నిలువలవిషయం మనం కామన్వెల్తులో వుండనంతమాత్రాన స్టర్లింగు నిలువలు బ్రిటన్ చెల్లించకుండా ఎగవేస్తుందా? ఇప్పటికన్న తక్కువ సౌకర్యాలు యిస్తుందా? ఇతరదేశాల అనుభవాలు పరిశీలిస్తే, కామన్వెల్తులో లేని అర్జెంటైనా, డెన్మార్కు, బెల్జియం మొదలైన దేశాల స్టర్లింగు నిలవలే కామన్వెల్తుదేశాల స్టర్లింగు నిలవలకన్న సమంజసంగా సత్వరగా పరిష్కరింపబడుతున్నాయి. అంటే కామన్వెల్తు దేశాలకు ఈసొమ్ము బ్రిటన్ ఎగవేస్తుందనికాదు. స్టర్లింగునిలవల ఉపయోగం దృష్ట్యా, కామన్‌వెల్తు సంబంధాల సమస్యను ఆలోచించటం అనవసరం.

కామన్వెల్తులో ఇండియా వుండటంవల్ల ఇటు ఇండియాకుగాని అటు బ్రిటన్‌కుగాని ప్రత్యేకంగా లాభంగాని నష్టంగాని ఏమీలేదు. చారిత్రాత్మకంగా, కాంగ్రెస్ ఇండియాలో రిపబ్లికన్ రాజ్యాంగవిధానాన్ని స్థాపించడానికి కంకణం ధరించివున్నది. అందువల్ల ఇండియా అధినివేశంగావుండే అవకాశం ఏమాత్రములేదు.

ఇండియా కామన్వెల్తునుంచి విడిపోవటం ప్రస్తుత బ్రిటిష్‌ప్రభుత్వానికి ఇష్టంలేదు. ఇందుకు కారణం ఇదమిద్ధమని చెప్పలేము. కాని ఇండియాకు కామన్వెల్తుతో ఏదో ఒకవిధమైన సంబంధం వుంటే మంచిదని ఈ ప్రభుత్వ అభిప్రాయం. రక్షణదృష్ట్యా, సైనికశక్తిదృష్ట్యా, ఆర్థికసహాయందృష్ట్యా, రాజకీయతంత్రదృష్ట్యా కామన్వెల్తుకు, ఇతర కామన్వెల్తురాజ్యాలకు ఇండియా ఏమాత్రము ఉపయోగకారి కాకపోయినాసరే, ఇండియా కామన్వెల్తులో వుండటం మంచిదని వారి అభిప్రాయం. విదేశరాయబారుల నియామకంవిషయంలో జార్జిరాజు

ప్రసక్తివుండటం ఇండియాకు ఇష్టంలేదని వారికి తెలుసును. ఆ ప్రతిబంధకాన్ని తొలగించటానికి వీలుగా, కామన్వెల్తు స్వరూపాన్ని మార్చటానికికూడా బ్రిటన్, ఇతర అధినివేశాలు సిద్ధపడినవి. బ్రిటిష్ 'కిరీటము' కామన్వెల్తు ఐక్యతకు కేవలం చిహ్నంగా మాత్రమే వుండాలనీ, రిపబ్లికన్ దేశాలుకూడా సర్వవిధాల సమానహోదాతో, కామన్వెల్తు సభ్యదేశాలుగా చేర్చుకోటానికి వీలుగా కామన్వెల్తు స్వరూపాన్ని మార్చుకున్నారు. బ్రిటిష్ కామన్వెల్తులో 'బ్రిటిష్' అన్న పదంకూడా తొలగించారు. భారతదేశం సర్వస్వతంత్రమైనా, నామమాత్రంగా కామన్వెల్తులో సభ్యత్వం పొంది వుండటం మన స్వతంత్రతకు, గౌరవానికి ఏమీ భంగం కాదు. అయితే, ఈ సభ్యత్వంవల్ల మనకు ఏ బాధ్యత అంటుకోదు. కామన్వెల్తు రాజ్యాలన్నీ యుద్ధంచేస్తున్నా మనం తటస్థంగా వుండవచ్చును; వారితో యుద్ధం చేస్తున్న దేశంతో స్నేహపూర్వకంగా వ్యవహరించవచ్చును. ఈ సంబంధంవల్ల ఇండియాకు వచ్చే లాభంకూడా ఏమీ లేదు.

ఈ సంవత్సరం ఏప్రిల్ నెలాఖరున జరిగిన కామన్వెల్తు రాజ్యాల సభ బ్రిటిష్ కామన్వెల్తు స్వరూపం మార్చివేసింది. ఆ సమావేశం ప్రధాని అట్లీకి, ప్రధాని నెహ్రూకు వ్యక్తిగతంగా గొప్పవిజయం. బ్రిటిష్ కామన్వెల్తు చరిత్ర స్వరూపాన్ని మార్చివేసిన వారుగా, రాజకీయసిద్ధాంతాలలో గొప్ప మార్పు తెచ్చిన వారుగా వీరిద్దరూ పేరు గడించుకున్నారు. అంతకన్న జరిగినది ఏమీలేదు. బ్రిటన్, భారతదేశాలు ఇందువల్ల పొందిన లాభంగాని, నష్టంగాని ఏమీలేదు. ఈ సంబంధం ఏనాడైన కావాలంటే ఆనాడైన తెగతెంపులు చేసుకోవచ్చును ప్రధాని నెహ్రూ అంగీకరించి వచ్చిన విధానాన్ని మన రాజ్యాంగ పరిషత్తు అంగీకరించింది. మన నూతన రాజ్యాంగచట్టంలో ఇందుకు అనుగుణంగా ఒకటి రెండు క్లాజులు బహుశ చేర్చబడవచ్చును. ఆ రాజ్యాంగ చట్టం తయారుకాగానే ఇండియా రిపబ్లిక్‌గా ఏర్పడుతుంది.

భారతదేశం స్వతంత్రమైన తర్వాత దేశంలో అక్కడక్కడా చెల్లాచెదురుగా విదేశీయుల ఆక్రమణలో వున్న ప్రాంతాల సమస్య ముందుకు వచ్చింది. భారతదేశంలో పరాయి రాజ్యానికి దేనికీ తావుండ రాదనే కాంగ్రెస్ మొదటినుంచి చెపుతున్నది. మనదేశంలో ఏకొద్ది భాగమైనాసరే విదేశీయుల ఆక్రమణలో వుంటే, మన దేశస్వాతంత్ర్యోద్యమం ఇంకా పూర్తికాలేదని చెప్పవచ్చును. బ్రిటన్‌తో సాధించినట్లే శాంతియుతమార్గాలద్వారానే ఈ ప్రాంతాల స్వాతంత్ర్యంకూడా సాధించాలని భారతప్రభుత్వం ప్రయత్నిస్తున్నది.

ఇండియా భూభాగంలో ఫ్రెంచి, పోర్చుగీస్ రాజ్యాలకు చిన్న చిన్న వలసలున్నాయి. చంద్రనాగూర్, పుదుచ్చేరి, కారికల్, మాహే, యానాం మొదలైనవి ఫ్రెంచిప్రాంతాలు; గోవా, డయ్యూ, డామన్‌లు పోర్చుగీస్ ప్రాంతాలు. ఫ్రెంచి ఆక్రమణలోవున్న చిన్నచిన్న పేటలు గతసంవత్సరమే భారతప్రభుత్వానికి వప్పజెప్పబడినవి. ఇక మిగిలిన ఈ ఐదుపట్టణాలవిషయము ఇప్పుడు ఆలోచనలో వున్నది. ఈ ప్రాంతాల ప్రజాభీష్టంప్రకారము వాటిని భారతప్రభుత్వంలో జేర్చటానికిగాని, విడిగావుంచటంగాని జరుగుతుందని ఫ్రెంచిప్రభుత్వం ప్రకటించింది. ఈ పట్టణాలపౌరులు వాస్తవానికి భారతదేశంలో జేరాలనే కోరుతున్నారు. కాని ఇన్నాళ్ళనుండి ఫ్రెంచివారికి అనుకూలముగా వుండి, వారివల్ల లాభాలను పొందుతున్న కొందరు స్వలాభాపేక్షపరులు ఈ ప్రాంతాలు ఫ్రెంచి యూనియన్‌లోనే భాగంగా వుండాలని ప్రచారంచేస్తున్నారు. ఫ్రెంచి ప్రభుత్వాధికారులుకూడా వారికి తోడ్పడుతున్నారు. పుదుచ్చేరి, కారికల్‌లలో ఫ్రెంచివారికి ఇట్టి పలుకుబడి ఎక్కువ వున్నది. చంద్రనాగూర్ పట్టణ ప్రజలు, తమ మ్యునిసిపల్ సభ్యుల ద్వారా, తాము భారతదేశంలో జేరిపోతామనే ప్రకటించారు. ఈ సంవత్సరం మాహేలో ప్రజావిప్లవం జరిగింది. భారత యూనియన్‌లో జేరాలనే వారు అధికారాన్ని బలవంతంగా హస్తగతం చేసుకున్నారు. వారికి భారతప్రభుత్వం ఏమీ సహాయం చేయక పోవటం వలననూ,

ఫ్రెంచిప్రభుత్వం వెంటనే కొంత సేనను పంపించుటవలననూ వీరు తిరిగి ఫ్రెంచిఅధికారానికి లోబడిపోవలసివచ్చింది. మొత్తంమీద, తన వలస లను వదలుకోటానికి ఫ్రెంచిప్రభుత్వం అంగీకరిస్తూనేవున్నది. వీటి విషయం శాంతియుతంగా త్వరలోనే పరిష్కారమౌతుంది.

పోర్చుగీస్ వలసలు ఫ్రెంచివలసలకన్న అన్నివిధాల అల్పములే అయినా వాటివిషయం ఇంత త్వరలోను, ఇంత సామరస్యంగాను పరి ష్కారమయ్యేటట్లులేదు. తనవలసలను వదలుకోటానికి పోర్చుగీస్ ప్రభు త్వం ఒప్పుకోవటంలేదు. అక్కడి ప్రజలను భయపెట్టి, హింసించి లోబరుచుకోవాలని పోర్చుగీస్ ప్రభుత్వం ప్రయత్నిస్తున్నది. ఆప్రజలకు జీవితం ఆనాటి కానాడు దుర్భరమౌతున్నది. పరిస్థితులు కొన్నాళ్ళపాటు ఇట్లాగే గడిస్తే, ఆప్రజలు తిరుగుబాటుచేసి, పోర్చుగీస్ ఉద్యోగులను తరిమివేయక మానరు. భారతప్రభుత్వం ఈవిషయంలో తటస్థంగావున్నా భారతప్రజలు పూనుకుని తమ సోదరుల కడగండ్లు తప్పించాలి. భారత దేశంలో తొలిగా అడుగుపెట్టిన తెల్లజాతి పోర్చుగీసుజాతి; బహుశ చిట్టచివరకు, బలవంతంగా, గెంటించుకునే గౌరవంకూడా వారికే దక్కవచ్చును.

ఇండోనీసియా విషయంలో మనం ముందంజవేసి ఆసియా రాజ్యాల మన్ననలు పొందాము. నవ ఆసియా నవ్యతేజము భారతదేశంనుంచి అన్నిదేశములకు వ్యాపించగలదని ఈ సంఘటన రుజువుచేసింది. ఆసియా రాజ్యాలను ఇకమీదట నిర్లక్ష్యంచేయ వీలులేదని పాశ్చాత్య రాజ్యాలు గ్రహించాయి. ప్రపంచం దృష్టిలో భారతప్రతిష్ట ఇనుమడించినది.

మన విదేశాంగ వ్యవహారాలు ఇదేధోరణిలో నడుస్తూంటే దాని సత్ఫలితాలు ఇకముందు ఇతోధికంగా పొందగలుగుతాము. నెహ్రూ విధానము ప్రపంచాదరణ పొందుతున్నది. భారతదేశం ప్రపంచంలో తన కొక విశిష్టస్థానం వున్నదని రుజువుచేసుకుంటున్నది.

# బడ్జెట్

దేశ ఆర్థిక స్వాస్థ్యానికీ, స్థిరత్వమూ మాత్రమేగాక ప్రభుత్వ అభివృద్ధి విధానాలకు, వివిధతరగతుల ప్రజలపట్ల ప్రభుత్వవైఖరికి, దేశ ఆర్థిక భవిష్యత్తుకుకూడా బడ్జెట్ సూచికవంటిది. ప్రభుత్వపు గతసంవత్సర ఆదాయవ్యయాలను లెక్కకట్టి, రానున్నసంవత్సర ఆదాయవ్యయాలను అంచనా వెయ్యటంతో బడ్జెట్ పని పూర్తికాదు. గత సంవత్సరం అనుసరించిన ఆర్థికవిధానాలు ఎంతవరకు జయప్రదమై ఏయేతరగతుల ప్రజలకు ఎంతెంత ఉపయోగకరములైనవో, రానున్న సంవత్సరంలో ఏయే నూతనవిధానాలద్వారా ఏవిధంగా ఏయేతరగతి ప్రజలకు మేలు చేయటానికి ప్రభుత్వం సంకల్పించుకున్నదో, అందుకు కావలసిన ధనాన్ని ఏవిధంగా సేకరించదలంచుకున్నదో బడ్జెట్ విపులీకరించాలి. కేవలం ఆదాయవ్యయాలపద్దు లెక్కగాగాక ఆసన్న భవిష్యత్కాలములో ప్రభుత్వ ఆర్థికలక్ష్యమేమిటో నిర్వచించి, వాటిని సాధించటానికి ప్లానుగా బడ్జెట్ వుండాలి. ప్రభుత్వ లక్ష్యాలు స్వల్పకాలంలో సాధించటం కష్టంకావచ్చు; కాని ఒకమారే ముందుగా ప్లానువేసుకుని ఏటేటా కొంతభాగము పనిజరుపుతూంటారు కొబట్టి ఒకసంవత్సరమాత్రపు స్వల్ప కాలానికి సంబంధించిన బడ్జెట్‌లోకూడా ప్రభుత్వవిధానం ప్రతిఫలించి తీరుతుంది. ప్రభుత్వాల బడ్జెట్‌లలో ఎప్పుడూ వ్యయాన్ని ఆదాయానికి సరిపెట్టటానికి ప్రయత్నించకూడదు. రానున్నసంవత్సరంలో ఏయేపనులు చేయదలచుకున్నామో ముందుగా నిర్ణయించి, వాటికి ఎంతసొమ్ము ఖర్చవుతుందో అంచనావేసి, అంత ఆదాయాన్ని సంపాదించటానికి మార్గాలను అన్వేషించాలి. బడ్జెట్ బాగోగులను, ప్రభుత్వ విధానాల మంచిచెడ్డలను ప్రభుత్వం నిర్వహించదలచుకున్న కార్యక్రమాన్ని బట్టి, అందుకు కావలసినధనాన్ని సేకరింపదలచుకున్న విధానాన్నిబట్టి నిర్ణయించాలి.

1948-49 వ సంవత్సరానికి సంబంధించిన బడ్జెట్ అంచనాలు గతిసంవత్సర బడ్జెట్‌లో ముందుగా అంచనా వేశారు. ఈ సంవత్సర కాలంలో సమకూడిన ఆదాయాన్ని, జరిగిన ఖర్చును వీలైనంతవరకు లెక్కకట్టి 1949 సంవత్సరం ఫిబ్రవరి నెలాఖరుకు అధివేశ పార్లమెంటులో ఖజానాశాఖ మంత్రి డా. జాన్ మత్తయ్ ప్రవేశపెట్టాడు. వీటినే రివైజ్డ్ ఎస్టిమేట్స్ అంటారు. వీటితోపాటు 1949-50 సంవత్సర ఆదాయవ్యయాల అంచనాలనుకూడా మంత్రి పార్లమెంటు ఆమోదానికి దాఖలుచేశాడు. ఆ వివరాలు ఈక్రింద గమనించండి.

## బడ్జెట్ వివరాలు

| ఆదాయం | లక్షలు రూ. లు. | | |
|---|---|---|---|
| | 1948-49 సం | 1949-50 | |
| | రి. అంచనా | బడ్జెట్ అంచనా | |
| సుంకాలు | 117,25 | 107,25 | |
| | | +8,98 | * |
| కేంద్ర ఎక్సైజ్ | 50,25 | 57,75 | |
| | | +11,52 | * |
| కంపెనీల ఆదాయపుపన్ను | 57,25 | 41,81 | |
| ఇతరుల ఆదాయపుపన్ను | 100,75 | 113,19 | |
| | | —6,10 | * |
| నల్లమందు | 1,08 | 1,18 | |
| వడ్డీలు | 1,42 | 1,19 | |
| పరిపాలన వ్యవహారాలు | 7,05 | 6,78 | |
| చలామణి, ముద్రణ | 13,05 | 9,70 | |
| సివిల్ వర్క్సు | 1,02 | 1,02 | |

| | | |
|---|---|---|
| విభజనపూర్వపు పద్దులు | 13,40 | |
| ఇతర ఆదాయాలు | 6,52 | 5,37 |
| తంతి, తపాలాలు | 3,73 | 1.63 |
| | | +2,84 * |
| రైల్వేల ఆదాయం | 7,84 | 4,72 |
| తీసివేత రాష్ట్రాలకు పంచవలసిన ఆదాయపుపన్ను | —41,79 | —43,85 |
| | | +3,00 * |
| ఆదాయం మొత్తం | 338,32 | 322,98 |
| వ్యయం | | |
| పన్ను వసూలు ఖర్చులు | 9,88 | 10,06 |
| నీటిపారుదల | 8 | 12 |
| అప్పులకు వడ్డీలు | 39,91 | 39,29 |
| పరిపాలన | 38,35 | 40,50 |
| చలామణీ, ముద్రణ | 2,76 | 2,23 |
| సివిల్ వర్క్సు | 8,15 | 7,32 |
| పింఛనులు | 2,68 | 2,68 |
| కాందిశీకులు | 19,45 | 9,85 |
| ఆహారసబ్సిడీలు | 31,96 | 32.97 |
| ఇతరఖర్చులు | 5,30 | 5,12 |
| రాష్ట్రాలకు గ్రాంటులు | 2,96 | 2,96 |
| ఇతర పద్దులు | 2,21 | 2,06 |
| రక్షణశాఖ | 155,43 | 157,37 |
| విభజన పూర్వపుపద్దుల చెల్లింపు | 20,75 | |
| | 339,87 | 322,58 |
| | లోటు— 1,55 | మిగులు +45 |

* బడ్జెట్‌లో సూచించిన మార్పులు

1948-49 సంవత్సరంలో భారతప్రభుత్వ ఆదాయం రూ. 255·24 కోట్లు వుంటుందనీ, వ్యయం రూ. 257·38 కోట్లు అవుతుందనీ మొదట్లో అంచనా వేశారుగాని ఇప్పుడు లెక్కలు చూస్తే ఆదాయం రూ. 338·32 కోట్లువచ్చి, వ్యయం రూ. 339·87 కోట్లు అవుతున్నది. ఈ సంవత్సరం బడ్జెట్‌లో లోటు రూ. 1·55 కోట్లు మాత్రమే.

భారతప్రభుత్వ ఆదాయం ఈ సంవత్సరం అనుకున్నదానికంటె రూ. 83·08 కోట్లు పెరిగింది. బడ్జెట్ సమయంలో అంచనావేసినదానికంటె సుంకాలవలన రూ. 36·49 కోట్లు, ఆదాయపుపన్నువలన రూ. 20·62 కోట్లు, సెంట్రల్ ఎక్సైజ్ వలన రూ. 4·28 కోట్లు, చలామణీ వ్యవహారాలవలన రూ. 3·65 కోట్లు మొదలైన మొత్తాలుగా ఎక్కువ ఆదాయం లభించింది. అట్లానే వ్యయంకూడా అనుకున్నదానికంటె రూ. 82·49 కోట్లు పెరిగింది. దీనితో ఆదాయపు పెరుగుదలతో వచ్చిన లాభం కొట్టుకుపోయింది. బడ్జెట్ సమయంలో అంచనావేసినదానికంటె రక్షణశాఖవలన రూ. 34·35 కోట్లు, కాందిశీకులకు అదనపు సౌకర్యాలకు రూ. 9·41 కోట్లు, ఆహారసబ్సిడీలకు రూ. 12·05 కోట్లు వ్యయం పెరిగింది. దేశవిభజన పూర్వపు అప్పులలో తన వంతును చెల్లించటానికి పాకిస్థాన్ నిరాకరిస్తున్నందువలన ఆ మొత్తం రూ. 20·75 కోట్లు కూడా మనమే అచ్చుకోవలసివచ్చింది. ఈవిధంగా ఆదాయ వ్యయాలు రెండూ దాదాపు సమానంగా పెరిగి, బడ్జెట్‌లోటు యథాప్రకారంగానే మిగిలింది.

1949-50 సంవత్సరంలో వ్యయం రూ. 322·53 కోట్లు అవుతుందనీ, ఇప్పటి పన్నుల రేట్లప్రకారం ఆదాయం రూ. 307·74 కోట్లు మాత్రమే వచ్చి రూ. 14·79 కోట్లు లోటుపడుతుందని అంచనావేసి, కొత్తపన్నులు విధించి ఆ లోటును భర్తీచేయవలసిందని ఖజానా మంత్రి సూచించాడు. ఈ ఆదాయవ్యయాల వివరాలు పైన కనపరచిన పట్టికలో వివరంగా పరిశీలించండి.

1949-50 సంవత్సరపు బడ్జెట్‌లో విధించిన కొత్తపన్నులు, తొలగించిన పన్నులు వివరాలు పరిశీలిద్దాము. నూనెగింజలు, నూనెలు ఎగుమతులపై విధించిన సుంకాన్ని రద్దుచేసి రూ. 1.5 కోట్లు ఆదాయాన్ని, విమానాలు ఉపయోగించే పెట్రోల్ పై పన్నుతగ్గించి రూ. 40 లక్షల ఆదాయాన్ని, దేశంలోకి దిగుమతియైన ముడిపదార్థాలపై సుంకాలు తగ్గించి రూ. 35 లక్షలు ఆదాయాన్ని పోగొట్టుకోటానికి మంత్రి నిశ్చయించాడు. ఇంతేకాదు, కాపిటల్ లాభాల పన్నును పూర్తిగా తొలగించి రూ. 1 కోటి, రూ. 10 వేలకు తక్కువ ఆదాయం వున్నవారి ఆదాయపుపన్ను తగ్గించి రూ. 3 కోట్లు, సూపర్-టాక్స్ రేట్లు మార్చి రూ. 2.1 కోట్లు ఆదాయం పోగొట్టుకోటానికికూడా నిశ్చయింపబడింది. అసలే రూ. 14.79 కోట్లు లోటువున్న బడ్జెట్‌లో దీనివల్ల రూ. 20.14 కోట్లు లోటువచ్చింది. ఈ పన్నుల తొలగింపుల వల్ల లాభం పొందుతున్నది కేవలం పెట్టుబడిదారులు, వ్యాపారస్థులు మాత్రమే. దేశంలో ఇన్‌ఫ్లేషన్ నివారణకుగాను ప్రజల చేతులలో వున్న అదనపు సొమ్ము అంతా ఏదో ఒకవిధంగా ఖజానాకు చేరేటట్లు చూడాలని చెపుతూ ప్రయత్నిస్తూ, అదేసమయంలో పెట్టుబడిదారులపై పన్నులు తగ్గించటం విరుద్ధమైన చర్య.

స్వతంత్ర భారత ప్రభుత్వం ఏర్పడిన తర్వాత పెట్టుబడిదారులను అనునయించటం ఆనాటికానాడు మితిమీరిపోతున్నది. గత సంవత్సరపు బడ్జెట్‌లోకూడా ఇదేవిధంగా పెట్టుబడిదారులపై పన్నులు చాలా తగ్గించారు. వర్తక లాభాల పన్నులో మార్పులుచేసి రూ. 2 కోట్లు, సూపర్‌టాక్స్ సవరణచేసి రూ. 1 కోటి, కంపెనీలు వ్యాపారంలో తిరిగి పెట్టుబడి పెట్టేలాభాలపై పన్నుతగ్గించి రూ. 2 కోట్లు, చిన్నకంపెనీల లాభాలపై పన్నుతగ్గించి రూ. 12 లక్షలు, పెట్టుబడిదారుల దానధర్మాలకు పన్నులు తీసివేసి రూ. 75 లక్షలు ఆదాయాన్ని గత సంవత్సరం ఖజానామంత్రి శ్రీ షణ్ముఖం చెట్టి పోగొట్టుకున్నాడు. ఈ సంవత్సరం డా॥ మత్తయ్‌కూడా అదేపంథాను అనుసరించాడు.

భారతదేశం రాజకీయంగా స్వతంత్రమైనతర్వాత ఆర్థికంగాకూడా స్వతంత్రం కావాలనుకోర్కె ప్రబలమైంది. దానిని అదునుగా తీసుకుని తమ మనుగడను ముందుగానే స్థిరపరచుకోవాలని పెట్టుబడిదారులు ప్రయత్నిస్తున్నారు. గత రెండేండ్లలోను భారతపరిశ్రమల ఉత్పత్తి ఏవిధంగావున్నదీ, పరిశ్రమల అభివృద్ధి ఏవిధంగా జరుగుచున్నది వేరొక చోట పరిశీలిద్దాము. ఎప్పటికప్పుడు ఏవో కొన్నిసాకులు చెప్పి, వాటికి సంబంధంలేని సౌకర్యాలను పెట్టుబడిదారులు గుంజుకుంటున్నారు. ప్రభుత్వం అనునయవిధానం అనుసరించినకొద్దీ పెట్టుబడిదారులు బిర్ర బిగిస్తూ, తమకు, ప్రభుత్వానికీ అప్రతిష్ఠ తెస్తూ, దేశానికీ, ప్రజలకు ముప్పుకలిగిస్తున్నారు. పన్నులు తగ్గించి పెట్టుబడిదారులను సంతృప్తి పరచి, వారి సహకారం పొందగలమనుకోవటం అవివేకం.

తొలగించిన పన్నులు పెట్టుబడిదారులకు ఎట్లా లాభకరంగా వున్నవో, కొత్తగావిధించిన పన్నులు ప్రజాబాహుళ్యానికి అంత బాధ కరంగా వున్నవి. తపాలారేట్లు పెంచి రూ. 2.8 కోట్లు, మద్యాలు, సిల్కులు, కొయ్యసామాను మొదలగు వాటిపై సుంకాలువిధించి రూ. 2.4 కోట్లు, మోటారుపెట్రోలు పన్ను హెచ్చించి రూ. 2.55 కోట్లు, వక్కలపై పన్నుహెచ్చించి రూ. 1 కోటి, సిగరెట్ల ఎగుమతిపై పన్ను హెచ్చించి రూ, 60 లక్షలు, పంచదారపై పన్నుహెచ్చించి రూ. 1.5 కోట్లు, గుడ్డలపైపన్ను హెచ్చించి రూ. 9 కోట్లు అదనపు ఆదాయం సంపాదించాలని నిశ్చయించారు. ఈ క్రొత్తపన్నులు ప్రజల జీవన వ్యయాన్ని చాలా వృద్ధిచేసినవిగా వున్నవి. రూ. 2.84 కోట్ల ఆదాయం కొరకు తపాలారేట్లు పెంచి, ప్రజలందరికి అసంతృప్తి కల్గించటం ఏ ప్రభుత్వమూ చేయకూడనిపని. గతసంవత్సరంకూడా అగ్గిపెట్టె, తేయాకు కాఫీ, వనస్పతి, రబ్బరుటైర్లు, పొగాకు, సిగరెట్లు మొదలగు వస్తువులపై పన్నులు వృద్ధిచేసి ప్రజల జీవన వ్యయాన్ని వృద్ధిచేశారు. ఈవిధంగా ప్రజాసామాన్యపు జీవనవ్యయం పెంచుతూ, పెట్టుబడిదారులచేతులలో

అధికధనం మిగుల్చుతూవుంటే, ఇన్‌ఫ్లేషన్ పెరగటము, జీతాలు పెంచాలని ఆందోళన జరగటము, దేశమంతట అసంతృప్తివ్యాపించటము జరిగితీరుతుంది.

భారతప్రభుత్వ పన్నుల విధానం ఆనాటికానాడు అధ్వాన్న మైపోతున్నది. కేంద్రంలోను, రాష్ట్రాలలోను ప్రత్యక్షపన్నులు తగ్గించి, పరోక్షపన్నులు వృద్ధిచేస్తున్నారు. ప్రత్యక్షపన్నులు ముఖ్యంగా పెట్టుబడిదారుల జేబులలో నుంచి రావాలి. పరోక్షపన్నులు ముందు ఎవరు చెల్లించినా, చివరకు ప్రజాబాహుళ్యం వద్దనుంచి వారు వసూలుచేసుకో గల్గుతారు. ప్రత్యక్షపన్నులవల్ల తక్కువఖర్చుతో, తక్కువమంది ప్రజలపై పన్ను విధించటంతో, తక్కువసంఖ్య పన్నులను విధించటం తోనే ఎక్కువ ఆదాయం వస్తుంది. అదే ఆదాయాన్ని పరోక్షపన్నుల ద్వారా సంపాదించాలంటే ఎక్కువ ఖర్చుఅయి, చాల ఎక్కువమంది ప్రజలవద్దనుండి, ఎక్కువసంఖ్య పన్నులు వసూలుచేయవలసివుంటుంది. పరోక్షపన్నులు పెరిగినకొద్దీ జీవనవ్యయం పెరిగి, జీతాలు ఎక్కువ చేయాలను నినాదం బలపడుతుంది. ఇన్‌ఫ్లేషన్‌ను ఎదుర్కొటానికి ఇటువంటివిధానం ససేమిరా పనికిరాదు. మనరాష్ట్ర కేంద్రప్రభుత్వాలకు పన్నుల పంపకాల విషయమై వున్న లావాదేవీలనూ, రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాల పన్నుల విధానాలను కూలంకషంగా పరిశీలించి, దేశా భ్యుదయకరమైన సవరణలు, సూచనలు, సిఫార్సులు చేయగల, అభ్యు దయభావాలుగల పెద్దలతో ఒక సంఘాన్ని నియమించి, వారి సిఫా ర్సులు శిరసావహించి మన ఆర్థికపరిస్థితులను చక్కబరుచుకోవటం ఎంతైనా అవుసరం.

పెట్టుబడిదారులపై పన్నులభారం తగ్గించటానికి ముఖ్యమైన సాకు, వారు కొత్తపరిశ్రమలు స్థాపించటానికిగాను అదనపుసొమ్ము, ఉత్సాహము యివ్వటము మనదేశంలో కంపెనీలు, వ్యక్తులు కలిసి రూ. 150 కోట్లకుపైగా ఆదాయపుపన్ను చెల్లిస్తున్నారు. అందులో

దాదాపు రూ. 5,6 కోట్లు తగ్గించినంతమాత్రానే సంతోషించి, సహకారంచేసి, లేకపోతే అధైర్యపడి, సమ్మె ప్రారంభించేపాటి జ్ఞానవంతులు, దేశభక్తులూనా మన పెట్టుబడిదారులు? దేశంలో అత్యధికంగా ధనం చలామణిలో వుండగానే స్తబ్ధతగావున్న షేర్‌మార్కెట్ పరిశ్రమలు ఈ రూ. 5,6 కోట్లు వచ్చి కలిసేటప్పటికి, పెరుగుదల, అభివృద్ధి చూపెట్టగలవా? అసలు వాస్తవానికి, పరిశ్రమలకు కావలసిన సొమ్మంతా పెద్దపెట్టుబడిదారులే పెట్టుబడిపెట్టగలరా? ఎక్కువ సొమ్ము వచ్చేది మధ్యతరగతివారివద్దనుంచి అయినప్పుడు వారికి పన్ను భారం తొలగించకుండా, జీవనవ్యయం పెంచి, వారు నిలువచేసే అవకాశమే లేకుండాచేస్తే, పరిశ్రమలు ఎట్లా అభివృద్ధిపొందుతవి? భారత ప్రభుత్వ ఆలోచన, దృక్పథము ఇంకా పూర్వకాలపు పద్ధతులలోనే వున్నది.

కేంద్రప్రభుత్వం రూ. 87 కోట్లకుపైగా వెచ్చించి 1949-50 సంవత్సరంలో అభివృద్ధికార్యక్రమం నిర్వహించ నిశ్చయించింది. అండమాన్‌దీవులఅభివృద్ధి, డేరాడూన్ అటవీ పరిశోధకశాఖఅభివృద్ధి, కోసీ, అస్సాంవాలీ, నర్మదా, తపతీ, సబర్మతీ ప్రాజెక్టుల విచారణ దామోదర్ వాలీప్రాజెక్టు, సింద్రలో ఎరువులఫ్యాక్టరీ, టెలిఫోన్ సామగ్రి ఉత్పత్తి ఫ్యాక్టరీ, నౌకాశకం పెనీలస్థాపన, డీసిల్ ఇంజన్లు, మెషీన్‌టూల్స్, విద్యుచ్ఛక్తిపరికరాలు, వైర్‌లెస్ సామగ్రి మొదలైన వాటి ఉత్పత్తికి ఫ్యాక్టరీలు కట్టటము మొదలైనవి ఈ సంవత్సరం తలపెట్టిన అభివృద్ధి కార్యక్రమము. ఇదిగాక అభివృద్ధికార్యాలకు రాష్ట్రాలకు రూ. 62.42 కోట్లు అప్పుయివ్వాలనికూడా నిశ్చయించారు.

1948-49 సంవత్సరంలో రూ. 150 కోట్లు అప్పుచేయాలని ఆశించారుగాని అది సాగలేదు. ఈ సంవత్సరం రూ. 85 కోట్లు

మాత్రమే అప్పు దొరకవచ్చునని అంచనావేశారు. స్మాల్ సేవింగ్స్ ప్రచారంవల్ల దాదాపు రూ. 37.56 కోట్లు అప్పు లభిస్తుందని ఆశిస్తున్నారు.

ఇప్పటికన్న అభివృద్ధికి ఎక్కువ అవకాశాలు వుండి, సౌఖ్య ప్రదము స్వతంత్రమైన జీవితం గడిపేటట్లు చేయకపోతే కోట్లకొలది మన ప్రజలకు మన దేశస్వాతంత్ర్యం ఒక నవ్వులాటవంటిదిగా మాత్రమే మిగిలిపోతుందనీ మన ఆర్థికమంత్రి గుర్తించాడు. ఆయన తయారు చేసిన బడ్జెట్, ఆయన వేస్తున్న నూతనపథకాలు కల, కల్లకాకుండా వాస్తవము, ఆనందమయము చేయటానికి తోడ్పటంలేదు సరికదా అధిక సంఖ్యాకుల జీవితాలను కష్టమయంచేసి, వారిని రెచ్చగొట్టి దేశానికి ముప్పు తెచ్చిపెట్టేటట్లున్నది. మన ప్రభుత్వం అనాటికానాడు ఇతోధికంగా పెట్టుబడిదారీవర్గంతో కలిసిపోతోందని మన బడ్జెట్‌లు రుజువు చేస్తున్నాయి.

# రైల్వే బడ్జెట్

భారత రైల్వేల ఆర్థిక పరిస్థితి, గతసంవత్సరం బడ్జెట్‌లో ఆశించినంతకన్న చాలా స్పష్టనంగావున్నదని ఈ సంవత్సరం బడ్జెట్‌లో రవాణాశాఖమంత్రి గోపాలస్వామయ్యంగారు వివరించాడు. 1948-49 వ సంవత్సరంలో రైల్వేల ఆదాయవ్యయాల అంచనాలను గతసంవత్సరం బడ్జెట్‌లో అప్పటి రవాణాశాఖమంత్రి వివరించాడు. ఈసంవత్సర ఖాతాపైన ఆదాయవ్యయాలు నికరంగా ఎంతవున్నదీ ఇప్పుడే చెప్పగల్గటం కష్టం గాని, పద్దులు తయారైనంతవరకు సరిచేసి, తక్కిన కాలానికి కూడా లెక్కకట్టి సుమారు మొత్తాలను అంచనావేయవచ్చును. దానినే రివైజ్‌డు అంచనా అంటారు. 1949 వ సం. ఫిబ్రవరినెలలో 1949-50 సం. నకు సంబంధించిన, రైల్వేల ఆదాయవ్యయాల అంచనాలను తెలియజేస్తూ, 1948-49 వ సంవత్సరపు రివైజ్డు అంచనాలను కూడా మంత్రి వివరించాడు. ఆ అంకెలను ఈ క్రింద గమనించండి :—

| | 1948-49 సం. బడ్జెట్ అంచనా. రూ. కోట్లు. | 1948-49 సం. రివైజ్డు అంచనా. రూ. కోట్లు. | 1949-50 సం. బడ్జెట్ అంచనా. రూ. కోట్లు |
|---|---|---|---|
| రైల్వేల ఆదాయం | 186.13 | 200.38 | 205.85 |
| రైల్వేల ఖర్చులు | 159.78 | 168.71 | 159.03 |
| నికరాదాయం | 32.37 | 38.07 | 32.32 |
| వడ్డీలు వగైరా | 22.24 | 22.24 | 22.88 |
| నికరం లాభం | 7.84 | 15.83 | 9.44 |

ఈసంవత్సరం రైల్వేల నికరలాభం రూ. 9.84 కోట్లు వుంటుందని మొదట్లో అంచనావేశారుగాని, ఆమొత్తం దాదాపు రూ. 15.83 కోట్లు వుండవచ్చునని ఇప్పుడు తెలుస్తున్నది. రైల్వేల నికరలాభం ఏ

విధంగా వినియోగించాలనే విషయమై రవాణాశాఖ మంత్రికి, ఖజానా శాఖమంత్రికి గతసంవత్సరం కల్గిన అభిప్రాయ బేధాలను పరిష్కరించటానికి ఏర్పరచిన ఉపసంఘం రూ 4.50 కోట్లు ప్రభుత్వఖజానాకు, రూ 4.50 కోట్లు రైల్వే రిజర్వుఫండుకు జమకట్టి తక్కిన మొత్తం రైల్వే అభివృద్ధిఫండుకు చేర్చవలసిందని నిర్ణయించింది. అటుతర్వాత రవాణా, ఖజానాశాఖల మంత్రులు ఈ విషయం పునరాలోచించి, రైల్వేల నికర లాభం రూ 15.83 కోట్లు ఈక్రిందివిధంగా పంచాలని నిర్ణయించారు :-

| | | | |
|---|---|---|---|
| ప్రభుత్వ ఖజానాకు | రూ. | 7.34 | కోట్లు |
| రైల్వే రిజర్వుఫండుకు | ,, | 7.65 | ,, |
| రైల్వే అభివృద్ధిఫండుకు | ,, | 0.84 | ,, |

1949-50 సంవత్సరంలోవచ్చే నికరలాభాన్ని ప్రభుత్వ ఖజానా, రైల్వే రిజర్వుఫండులకు సమానంగా పంచాలనికూడా ఇప్పుడు నిర్ణయించారు.

రైల్వే ప్రయాణీకులకు ఇతోధిక సౌకర్యాలు కలుగజేయటానికిగాను రైల్వే అభివృద్ధిఫండు ఏర్పాటుచేశారు. కాని రైల్వేఉద్యోగులకు సౌకర్యాలు కలగజేయటానికి, లాభసాటిగాని చిన్నచిన్న కట్టడాల కార్యక్రమాలు నిర్వహించటానికీ ఈసొమ్ము ఇన్నాళ్ళనుండి ఉపయోగిస్తున్నారు. ఇప్పుడు ఆపద్ధతి విరమించి, ప్రయాణీకుల సౌకర్యాలకే ఈసొమ్ము ఖర్చుచేయటానికి మంత్రి అంగీకరించాడు. ఈఫండులో ఈసంవత్సరారంభంలో రూ. 14.54 కోట్లు నిలవవుండెను. వడ్డీలు, నికరలాభంలో వాటామొదలైన పద్దులు కలపగా ఫండుమొత్తం రూ. 15.79 కోట్లకు పెరిగి, దీనినుండి ఖర్చు రూ. 3.79 కోట్లు పోగా, సంవత్సరాంతంలో రూ 12 కోట్లు నిలవవుంటున్నది. ఈసొమ్ము ఇకముందైనా ప్రయాణీకుల సౌకర్యాలకే, భారీగా వాడుతూండటము, ఏటేటా ఎక్కువసొమ్ము ఈ ఫండుకు చేరుస్తూండటమూ అవుసరము.

1948-50 సంవత్సరంలో రూ. 71.15 కోట్లు రైల్వేలకు కొత్త ఆస్థులు కొనటానికి ఖర్చు చేయదలచుకున్నారు. ఇందులో రూ. 36.15

కోట్లతో 440 రైల్వేఇంజన్లు ఖరీదుచేస్తారు. ఈసంవత్సరం మొత్తం 172 కొత్తఇంజన్లు కొన్నారు; 1949 సెప్టెంబరులోగా మరొక 224 ఇంజన్లు దిగుమతి కాగలవని ఆశిస్తున్నారు. మన రైల్వేలకు సంవత్సరానికి 10 వేలు కొత్తవాగన్లు కావలెను; కాని ఈసంవత్సరం 2834 వాగన్లు మాత్రమే లభించాయి. 1949 సంవత్సరంలో 4400 వాగన్లు లభిస్తాయని అంచనావేశారు. ప్రయాణీకుల పెట్టెల సరఫరాకూడా అసంతృప్తికరంగానేవుంది. 1948 ఏప్రిల్-నవంబరు నెలల మధ్య 172 కొత్తపెట్టెలు తయారుచేశారు; ఇంకా 272 పెట్టెలు నిర్మాణంలో వున్నాయి. ఇన్ని పెట్టెలు వేసినా ప్రయాణీకులు విశ్రాంతిగా ప్రయాణం చేయటానికి అవకాశంలేకుండావుంది. ఈ సంవత్సరంలో ప్రవేశపెట్టిన రైల్వేతరగతుల పునర్విభజన ప్రకారం ఇంటరు తరగతి పెట్టెలను రెండవతరగతి పెట్టెలుగా మార్చటం చాలఎక్కువ కాలం పట్టుతున్నది. ఇందువల్లకూడా వత్తిడి హెచ్చవుతున్నది. ఈ సంవత్సరంలో రైల్వేప్రయాణీకులకు కొన్ని అవసరపు సౌకర్యాలు కలిగించినమాట వాస్తవమేగాని వాటివల్ల చెప్పుకోదగ్గమేలు ఏమీ జరగటం లేదు.

రైల్వేల పరిపాలనలోను, రైల్వేబోర్డు నిర్మాణంలోను, రైల్వేల నిర్వాహణలోను, అనేక లోటుపాట్లు వున్నాయని మంత్రి అంగీకరిస్తున్నాము. రైల్వేలవిషయం కూలకషంగా పరిశీలించటానికి ఏర్పాటు చేసిన కుంజ్రూకమిటీ ఈమధ్యనే నివేదిక సమర్పించింది. అది ఇంకా ప్రచురణకాలేదు. ఆ కమిటీ సూచనలను అంగీకరించి, తక్షణమే అమలు జరిపి భారత రైల్వేలు ప్రజలకు ఇతోధికంగా సేవచేసేటట్లు కృషిచేయటానికి శ్రీ గోపాలస్వామయ్యంగారు పూనుకోవాలి.

# రాష్ట్రాల బడ్జెట్‌లు

భారతదేశ భవిష్యద్రాజ్యాంగం ఫెడరల్ పద్ధతిపైన ఏర్పాటు చేయ బడుతున్న సంగతి విశదమే. ఫెడరల్ రాజ్యాంగంలో కేంద్ర ప్రభుత్వంకన్న రాష్ట్ర ప్రభుత్వాలకే, ముఖ్యంగా ప్రజాభ్యుదయ కార్య క్రమాల నిర్వాహణ విషయంలో, ఎక్కువ అధికారాలు, బాధ్యతలు, అవకాశాలు వుంటాయి. నిర్మాణాత్మక కార్యక్రమాల నిర్వాహణ అంతా రాష్ట్ర ప్రభుత్వాల బాధ్యతయే; వివిధరాష్ట్రాల కృషిని సమీ క్షిస్తూ, సమన్వయపరుస్తూ, సలహాలిస్తూండటము మాత్రమే కేంద్ర ప్రభుత్వం చేయగలపని. దేశ ఆర్థిక సౌష్టవాన్ని తెలుసుకొనటానికి కేంద్ర ప్రభుత్వం బడ్జెట్‌ను పరిశీలించాలి; వివిధ ప్రాంతాలలో నిర్మా ణాత్మక కార్యక్రమాలు, ప్రజోపకారక కృషి ఏవిధంగా జరుగుతున్నదో తెలుసుకొనడానికి రాష్ట్రప్రభుత్వాల బడ్జెట్‌లు గమనించాలి.

భారత ప్రభుత్వం ప్రస్తుతం ఎదుర్కొంటున్న ముఖ్యమైన ఆర్థిక సమస్య ఇన్‌ఫ్లేషన్. కేంద్రరాష్ట్ర ప్రభుత్వాల బడ్జెట్‌లన్నీకూడా ఇన్ ఫ్లేషన్ నిరోధకాలుగావుండటం ఈ సమయంలో అవుసరం. బడ్జెట్‌లో 'లోటు' లేకుండా వీలైనంత 'మిగులు'ను వుంచటం ఇన్‌ఫ్లేషన్ నిరోధా నికి ప్రథమచర్య. 'వ్యయం' 'ఆదాయా'న్ని మించకుండావుంచి, వీలైనంత ఎక్కువ 'ఆదాయం' 'మిగల్చ' టానికి ప్రతిరాష్ట్ర ప్రభుత్వము కేంద్రప్రభుత్వము ప్రయత్నించాలి. ఈసంవత్సరం మనరాష్ట్ర ప్రభుత్వా లన్నీ ఈ దృష్టితోనే తమబడ్జెట్‌లు తయారుచేశాయి.

స్వాతంత్ర్య పోరాటసమయంలోనే కాంగ్రెస్ ఒక ఆర్థికపంథాను నిర్ణయించుకున్నది. స్వాతంత్ర్యం లభించి అధికారం హస్తగతమైన తర్వాత కాంగ్రెస్ వాదులు తమ పూర్వపంథాను వీలైనంతవరకు అనుసరించ టానికి ప్రయత్నించటం సహజమే. మద్యపాన నిషేధము, జమీందారీల రద్దు కాంగ్రెస్ పంథాలో ఎప్పుడూ ప్రముఖస్థానాన్నే ఆక్రమిస్తూంటేవి.

ఇప్పుడు అవే ముందుగా ఆచరణలోనికి వస్తున్నాయి. ప్రతిరాష్ట్రం లోను మద్యపాననిషేధం ఎంతో కొంతవరకు అమలులోనే వున్నది. జమీందారీలరద్దు ప్రతిరాష్ట్రంలోను తీవ్రఆలోచనలో వున్నది. ఇన్‌ఫ్లేషన్ నివారణకు తీవ్రకృషిచేస్తున్న ఈసమయంలో మద్యపాన నిషేధం అమలుజరిపి ఆదాయాన్ని పోగొట్టుకోవటము, జమీందారీల రద్దుకు వ్యయాన్ని వృద్ధిచేయటము సరేమిరా పనికిరాని పనులని సనాతన ఆర్థిక శాస్త్రవేత్తలు వాదిస్తారు. ఇన్‌ఫ్లేషన్ నివారణకని జమీందారులను పోషించటంగాని, బీదసాదలను మద్య మహామారికి బలియివ్వటంగాని జరగకూడనిపని. ఆర్థికశాస్త్రం సూచించే విధానాలు అన్నివిధాల ప్రజాభ్యుదయకరాలుగా వుండాలి. జమీందారీలరద్దువల్ల జమీందా రుల చేతిలోకిపోయేధనమూ, మద్యపాననిషేధంవల్ల బీదసాదల చేతు లలో మిగిలివుండే ధనమూ, మార్కెట్‌లో కరువుగావున్న వస్తువుల కోసం పోటీపడి, ధరలు పెరిగిపోవటానికి దోహదంచేయకుండా వుండే టట్లు, అవుసరమైన 'స్మాల్ సేవింగ్స్', అప్పుల విధానాలను ప్రభు త్వాలు అనుసరించాలి. జమీందారీలను రద్దుచేస్తే, నష్టపరిహారం ధన రూపేణా మాత్రమే చెల్లించాలని కేంద్రప్రభుత్వం ఆదేశించటం సమం జసమైన చర్యకాదు.

మన రాష్ట్రాల బడ్జెట్‌లు గత రెండుమూడేండ్లవి పరిశీలిస్తే ముఖ్యంగా మన దృష్టి నాకర్షించేది పరిపాలనాయంత్ర నిర్వహణ వ్యయం వృద్ధిపొందుతుండటము, 'ప్రత్యక్ష'పన్నులు తగ్గిపోతూండి, 'అప్రత్యక్ష'పన్నులు వృద్ధిపొందుతుండటము. ప్రతిరాష్ట్రప్రభుత్వము 1949-50 సం॥ బడ్జెట్‌లో నికరం మిగులు చూపించటానికే ప్రయత్నిం చింది; 'అప్రత్యక్ష' పన్నుభారం అతిగా వృద్ధిచేసి,కృత్రిమంగాచూపించిన ఈ 'మిగులు', ఇన్‌ఫ్లేషన్ నివారణకు తోడ్పడకపోగా, జీవనవ్యయాన్ని మరింత వృద్ధిచేసి, ఆందోళనకు, ఇన్‌ఫ్లేషన్ వృద్ధికితోడ్పడుతున్నది.

మద్యపాన నిషేధంవల్ల పోగొట్టుకున్న ఆదాయాన్ని భర్తీచేసుకో టానికి రాష్ట్రప్రభుత్వాలు అనేకరకాల క్రొత్తపన్నులు విధిస్తున్నాయి.

వీటిలో కొన్ని మామూలు వర్తకవ్యాపారాలకు ఆటంకాలుగా, చిరాకు పుట్టిస్తూ, అవివేకాన్ని సూచిస్తున్నాయి. గోడమీది ఎడ్వర్టైజ్ మెంట్ కాగితం మొదలు ప్రతివస్తువుపైనా పన్ను వేయటం న్యాయసమ్మతమే కావచ్చుగాని ప్రజాభిమతంమాత్రం కాదు. ప్రతిరాష్ట్రంలోను ఆహార ధాన్యాలమీదకూడా సేల్సుటాక్సువిధించటము, కాఫీహోటళ్లు, భోజన హోటళ్లు మొదలైన వాటిమీద పన్నువేయటము జీవనవ్యయాన్ని వృద్ధిచేయటానికి తోడ్పడుతున్నది. బొంబాయిప్రభుత్వం ఆ రాష్ట్రం నుంచి జరిగే ఎగుమతులపై నాటికి మూడుపైసలు పన్ను విధిస్తున్నది. ఇది అక్రమము. దేశంలో పరిశ్రమలు వృద్ధిపొందటానికి, వస్తువులు స్వేచ్ఛగా ఒక ప్రాంతంనుంచి ఇంకొక ప్రాంతానికి ఎగుమతిచేసుకొన వీలుండటం అవుసరం. అందువల్లనే అన్నిదేశాలలోను, దేశంలో నిర్ని బంధవ్యాపారం అమలులోవుంది. ఇన్నాళ్ళవరకు బ్రిటిష్ ఇండియా ప్రాంతాలకు, సంస్థానాల ప్రాంతాలకు వ్యాపారం నిర్నిబంధంగా వుండక, ఎగుమతి దిగుమతి పన్నులు విధిస్తుండేవారు. సంస్థానాలు రాష్ట్రాలతో చేరిపోవటము, యూనియన్లుగా ఏర్పడటము జరిగినప్పుడు ఆ ఆటంకాలు తొలగించి, నిర్నిబంధవ్యాపారానికి వీలు కలుగచేస్తున్నారు. అటువంటిసమయంలో రాష్ట్రాలమధ్య వ్యాపారంపై పన్ను వెయ్యటం అభివృద్ధినిరోధకమే అవుతుంది. ఇటువంటిసుంకాలు ఇంకా ఏరాష్ట్రము విధించకమునుపే కేంద్రప్రభుత్వం మేల్కొని, వీటికి ఏమాత్రము అవకాశంలేకుండా చేయాలి.

1938 వ సం॥ లగాయతు పట్టణాలలో ఆస్థుల విలువలు పెరిగాయి; ఆ పెరుగుదలపై పన్ను విధించటానికి నిర్ణయించి మద్రాసు ప్రభుత్వం కేంద్రప్రభుత్వ అధికారాలపై దెబ్బతీస్తున్నది; అట్లాగే మ్యునిసిపాలిటీలలోను, పంచాయితీలోను వున్న ఇండ్లపై పన్నువేయాలని ప్రయత్నించి స్థానికసంస్థల అధికారాలపైకూడా ఈ ప్రభుత్వం దాడి చేస్తున్నది. సి. పి. ప్రభుత్వం వినోదాలపన్నును టిక్కెట్టులో సగం

భాగంవరకు పెంచటానికి తీర్మానించింది; సాలుకు రూ. 10 వేలకన్న తక్కువ ఆదాయం కలవారందరికీ సాలుకు రూ. 28 లు వృత్తిపన్ను వేయటానికికూడా ఈ ప్రభుత్వం నిర్ణయించింది. మొత్తంమీద మన రాష్ట్రప్రభుత్వాల పన్నుల విధానం అనకతవకగా వున్నది.

దేశవిభజనవలన ఆర్థికంగా దెబ్బతిన్నవి తూర్పు పంజాబ్, పశ్చిమ బెంగాల్ రాష్ట్రాలు. ఈరెండు రాష్ట్రప్రభుత్వాలు పూర్తిగా స్థిర పడకముందే, కాందిశీకుల సమస్యను ఎదుర్కొనవలసి వచ్చింది. తూర్పుపంజాబ్ కాందిశీకులఖర్చు దాదాపు పూర్తిగా కేంద్రప్రభుత్వమే భరిస్తూంటే, పశ్చిమ బెంగాల్‌కు కొంతఅదనపు గ్రాంటు యిస్తుండటం వల్ల వీటి బడ్జెట్‌లు కొద్ది 'లోటు'తో తయారుచేయగలిగారు. మన రాష్ట్రాల బడ్జెట్‌లకు సంబంధించిన ముఖ్యవివరాలు ఈక్రింద గమనించండి.

రాష్ట్రాల బడ్జెట్‌లు 1949-50 (అంచనాలు)

| | ఆదాయం. | వ్యయం. | కొత్తపన్నుల వల్లరాబడి. | నికరం +మిగులు —లోటు |
|---|---|---|---|---|
| రాష్ట్రము. | రూ. కోట్లు. | రూ. కోట్లు. | రూ. కోట్లు. | రూ. కోట్లు. |
| మద్రాసు. | 51.75 | 55.66 | 4.00 | +0.09 |
| బొంబాయి. | 48.81 | 52.79 | 4.10 | +0 12 |
| యు. పి. | 55.73 | 55.58 | — | +0.15 |
| సి. పి. | 18.49 | 18.79 | 0.50 | +0.20 |
| బీహార్. | 24 40 | 21.52 | — | +2 88 |
| ప. బెంగాల్. | 31 83 | 32.94 | 1.11 | — |
| ఒరిస్సా. | 8 90 | 8.76 | — | +0.14 |
| తూర్పు పంజాబ్ | 14.37 | 22.52 | 7.00 (కేంద్రం గ్రాంటు) | —1.50 |

ఒరిస్సా, బీహార్, యు. పి. రాష్ట్రాలుతప్ప తక్కిన అన్నిరాష్ట్రాలలోను పన్నులు వృద్ధిచేయటంవల్లనే బడ్జెట్ల లోటులు భర్తీఅయిన వన్న సంగతి ఇందువలన విశదమవుతున్నది. పన్నులు వృద్ధిచేయకుండా ప్రభుత్వవ్యయాన్ని తగ్గించి, బడ్జెట్లో 'మిగులు' చూపించితే, ఆ బడ్జెట్ ఇన్ఫ్లేషన్ నివారణకు కొంత ఉపయోగకారిగా వుంటుంది. గాని ఇటువంటి బడ్జెట్లు ఇన్ఫ్లేషన్ను ఏమాత్రము వారింపలేవు.

విద్య, ఆరోగ్యము, వ్యవసాయము, పరిశ్రమలు మొదలైన ప్రజోపకారక, దేశాభ్యుదయకర శాఖలు రాష్ట్రప్రభుత్వాల అజమాయిషీలో వున్నాయి. దేశాభ్యున్నతి ఈశాఖల అభివృద్ధిపైననే ఆధారపడి వున్నదనటం నిస్సందేహం. ఈ శాఖలపైన మన రాష్ట్రప్రభుత్వాలు ఇప్పుడిప్పుడు ఎక్కువమొత్తాలను ఖర్చుచేస్తున్నవి కాని ఫలితము తగినంతగా కనిపించటములేదు. ధరలు, చలామణిలోనున్న సొమ్ము పెరిగిపోవటంవల్ల ఖర్చుమొత్తము మాత్రము నాలుగైదురెట్లు పెరిగినట్లు కనపడి పైకి సంతృప్తికరంగా వుంటుంది. ఈక్రింది అంకెలు గమనించండి.

## రాష్ట్రాల వ్యయాలు

[జనాభాలో తలకు ఒక్కొంటికి ఖర్చుచేస్తున్న సొమ్ము]

| రాష్ట్రము | సంవత్సరము | విద్య | ఆరోగ్యము | వ్యవసాయం | పరిశ్రమలు |
|---|---|---|---|---|---|
| బొంబాయి | 1938-39 | 0-15-0 | 0- 6-0 | 0- 9-0 | 0- 1-0 |
| | 1949-50 | 3-12-0 | 1- 6-0 | 1-13-0 | 0- 4-0 |
| మద్రాసు | 1938-39 | 0- 9-0 | 0- 4-0 | 0- 4-0 | 0- 1-0 |
| | 1949-50 | 1-12-0 | 0-11-0 | 0-15-0 | 0- 3-0 |
| యు. పి. | 1938-39 | 0- 6-0 | 0- 2-0 | 0- 2-0 | 0- 1-0 |
| | 1949-50 | 1- 5-0 | 0- 9-0 | 1- 1-0 | 0- 8-0 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| సి. పి. | 1938-39 | 0- 5-8 | 0- 2-0 | 0- 2-0 | ఆరుపైసల కన్న తక్కువ |
| | 1949-50 | 1- 9-0 | 0- 8-0 | 0-12-0 | 0- 1-0 |
| బెంగాల్ | 1938-39 | 0- 4-0 | 0- 3-0 | 0- 1-0 | 0- 1-0 |
| | 1949-50 | 1- 5-0 | 1-15-0 | 1- 5-0 | 0- 9-0 |

రాష్ట్రప్రభుత్వాల వ్యయంలో దాదాపు 30-35 వంతులు ఈ నాలుగుశాఖలకు వినియోగిస్తున్నారు. ఈ కార్యక్రమాలు ఇప్పటికన్న త్వరగా జరిగేటట్లు చేయటం అవుసరం.

కొన్ని పద్దుల ఆదాయాలు కేంద్రము, రాష్ట్రాలు పంచుకుంటవి. ఆదాయపు పన్ను ఈతరగతికి చెందినది. ఈపంపకంవిషయమై కేంద్రానికి, రాష్ట్రాలకు ఎప్పుడూ అభిప్రాయభేధాలు వుంటూనేవున్నవి. పైగా ఇప్పుడు సేల్స్‌టాక్స్ సర్వసాధారణమైపోయి, వివిధరాష్ట్రాలలో వివిధ రకాలుగా విధింపబడుతూ వర్తక వ్యాపారాలకు పెద్ద ఆటంకముగా వున్నది. సేల్స్‌టాక్స్‌నుకూడా నేరుగా కేంద్రప్రభుత్వమే, అన్ని రాష్ట్రాలలోను ఒకేరేటుప్రకారం వసూలుచేసి, ఆదాయపుపన్ను వలెనే రాష్ట్రాలకు పంచితే బాగుండును. మన కొత్తరాజ్యాంగం అమలులోకి రాకపూర్వమే, కేంద్ర-రాష్ట్రాల పన్నుల అధికారాలు, స్థానిక సంస్థల అవకాశాలు, పన్నుల స్వరూపము, రాష్ట్రాలపై కేంద్ర ప్రభుత్వ అజమాయిషీ మొదలగు ముఖ్యవిషయాలపై నిర్ణయాలు జరుగవలెను. ఇందుకు కేంద్ర ప్రభుత్వం ఒక కమిటీని నియమించి, మనదేశపన్నుల స్వరూపాన్ని సరిగా చిత్రించుకుని, కేంద్రము, రాష్ట్రాలు ఆ ప్రకారం నడచుకొనుట మంచిది.

# ఆర్థికవ్యవహారాలు - ౧

రెండవ ప్రపంచ సంగ్రామం కాలంలోనే మన ఆర్థికవ్యవస్థ దెబ్బ తిన్నది. మిత్రరాజ్యాలు యుద్ధావసరాలకు మనదేశంలో వస్తువులు వాడుకుని వాటికి ప్రత్యామ్నాయంగా వస్తువులుగాని, బంగారంగాని యివ్వకుండా స్టర్లింగు నిలువలు పెంచి, ఎప్పటికప్పుడు భారతప్రభుత్వం చేత డబ్బు ప్రింటిస్తుండేవారు. క్రమేణా మనదేశంలో చలామణిలోవున్న డబ్బు పెరుగుతూవచ్చింది. 1947 సంవత్సరం ఆగస్టు 15వ తేదీన స్వతంత్రమైనతర్వాత మనదేశం బ్రహ్మాండమైన సమస్యలను ఎదుర్కొన్నది. జనాభామార్పిడి, కాందిశీకులపోషణ, కాశ్మీర్ యుద్ధము, హైదరాబాద్ పోలీస్‌చర్య మొదలైనవాటివల్ల ప్రభుత్వవ్యయం అమితంగా పెరిగింది; యజమాని కార్మికుల తగాదాలవల్ల పారిశ్రామికరంగంలో అశాంతి ఏర్పడి, దేశంలో వస్తువుల ఉత్పత్తి పడిపోయింది. వస్తువుల ఉత్పత్తి తగ్గుతూ, ప్రభుత్వం ఎప్పటికప్పుడు ఎక్కువసొమ్ము చలామణీలో పెడు తుండటంవల్ల చలామణీలో సొమ్ము పెరుగుతూ, మార్కెట్‌లోని వస్తువులు ఆనాటికానాడు తగ్గుతూ ధరలు విపరీతంగా పెరిగిపోయాయి. దేశంలో ఇన్‌ఫ్లేషన్ ఏర్పడింది. ఈనాడు భారతప్రభుత్వం ఎదుర్కొం టున్న ముఖ్యసమస్య ఇన్‌ఫ్లేషన్. దీని సత్వర సముచితపరిష్కారంపైననే మన దేశ ఆర్థిక భవిష్యత్తు ఆధారపడివున్నది.

1939 సంవత్సరంతో పోలిస్తే, మనదేశంలో ధరలు, జీవనవ్యయము ప్రతిప్రాంతంలోను కనీసం మూడురెట్లు పెరిగాయి. భారతప్రభుత్వ ఆర్థికసలహాదారు తయారుచేస్తున్న ఘాతసూచీసంఖ్యలనుబట్టి ఆహార ధాన్యాలధరలు, 1939 సంవత్సరంలో 100 అయితే, ఈనాడు 378పైగా వున్నవి; యంత్రాలతో ఉత్పత్తిచేయబడిన వస్తువులధరలు 332 కుపైగా వున్నవి; జీవనవ్యయం బొంబాయిలో 301 వరకు పెరిగింది. ఈ క్రిందిపట్టిక గమనించండి.

# హోల్‌సేల్ ధరలు - ఘాతసూచీ సంఖ్యలు

1939 ఆగస్టుతో అంతమైన సంవత్సరం॥ 100

| | ఆహార వస్తువులు | యంత్రాలతో ఉత్పత్తి చేయబడిన వస్తువులు | మొత్తం అన్నివస్తువులు | జీవనవ్యయం (బొంబాయి) |
|---|---|---|---|---|
| 1944-45 | 265.4 | 258.3 | 244 2 | 224 a |
| 1945-46 | 272.8 | 240.0 | 244.9 | 246 a |
| 1946-47 | 313.8 | 259.1 | 275.4 | 265 a |
| 1947-48 | 356.9 | 287.8 | 366.9 | 300 b |
| 2-4-49 | 378.8 | 332.6 | 371 2 | 301 |

b 1948 జనవరి; a దాదాపు '46, '45, '47 సంవత్సరాలకు

1948 సంవత్సరం సెప్టెంబరు, అక్టోబరు నెలల నాటికి ధరల పెరుగుదల అత్యున్నతస్థాయికి వచ్చింది. అంతకుముందునుండి కూడా ప్రభుత్వం ఈవిషయం ఆలోచిస్తూనే వున్నది. ఇక వెంటనే ఏదో ఒక చర్య తీసుకొనవలసిన సమయం వచ్చిందని గ్రహించగానే ప్రభుత్వం ఆర్థికశాస్త్రవేత్తలను, పారిశ్రామిక వేత్తలను, బ్యాంకర్లను, కార్మిక ప్రతినిధులను, సోషలిష్టులను, తన ఆర్థిక సలహాదారులను విడివిడిగా సంప్రదించి, వారివారి దృక్పధాలను క్రోడీకరించి, తన ఇన్‌ఫ్లేషన్ నిరోధక విధానాన్ని తయారుచేసింది. వీరిసలహాలను ప్రభుత్వం నిర్ణయించిన విధానాన్ని పరిశీలించేముందు ఇన్‌ఫ్లేషన్ ఇంత పెరగటానికి గల కారణాలను వివరంగా పరిశీలిద్దాము.

మనదేశంలో ఇన్‌ఫ్లేషన్ పెరగటానికి ముఖ్యంగా తోడ్పడిన విషయాలుఇవి. 1 ఉత్పత్తి తగ్గిపోవటము, ఉత్పత్తి అయిన వస్తువులు సమంజసంగా పంపకం జరగకపోవటము 2. చలామణీలోవున్న సొమ్ము

పెరగటం. 3. కేంద్ర, రాష్ట్ర బడ్జెట్‌లు వరసగా 'కొరత'లు చూపించటం. 4. 1947 సంవత్సరం చివర కంట్రోల్ తొలగించటం. 5. వ్యాపారస్థులలోను, ఉద్యోగులలోను అవినీతి, లంచగొండితనం వ్యాపించటం.

పారిశ్రామిక వస్తువుల ఉత్పత్తి యుద్ధకాలంలోకన్న 1948 సెప్టెంబరునాటికి దాదాపు 25-30 వంతులు తగ్గిపోయింది. యంత్ర సామగ్రి సరిగా దొరకకపోవటం, రవాణా ఇబ్బందులు కలగటం, దేశంలో అశాంతి వ్యాపించటం, కార్మికులు సమ్మెలుచేయటం, ముడి పదార్థాలు దొరకకపోవటం, పారిశ్రామికవేత్తల ఉత్సాహం సన్నగిలి పోవటం మొదలైనవన్నీ ఉత్పత్తి పడిపోవటానికి కారణాలు. 1946 సంవత్సరంలో సమ్మెలవల్ల 120 లక్షల మనిషి-పని రోజులు పనినష్టమై పోయింది; 1947 సంవత్సరంలో 170 లక్షల మనిషి-పనిరోజులు పని నష్టమైంది. ఇందుకు కేవలం కార్మికులను నిందించి లాభంలేదు. తప్పు యజమానులదికూడా వుంది. 1948 ఏప్రిల్ నెలలో భారతప్రభుత్వం తన ఆర్థికవిధానం స్పష్టపరిచింది. అది పెట్టుబడిదారులకు రుచించలేదు. మన దేశంలో పారిశ్రామిక వస్తువుల ఉత్పత్తి ఏవిధంగా తగ్గిపోయిందో చూడండి.

(1939 ఆగస్టుతో అంతమైన సం. = 100)

| సంవత్సరం. | ఘాతసూచీ సంఖ్య. | సంవత్సరం. | ఘాతసూచీ సంఖ్య. |
|---|---|---|---|
| 1939-40 | 110.3 | 1944-45 | 121.7 |
| 1940-41 | 114.2 | 1945-46 | 120.0 |
| 1941-42 | 123.2 | 1946-47 | 105.0 |
| | | 19 7-48 | 104.9 |
| 1942-43 | 125.5 | 1948 : ఆగస్టు | 111.1 |
| 1943-44 | 126.8 | 1948 : నవంబరు | 114.8 |

1939-48 సంవత్సరాలమధ్య మనదేశంలో చలామణీలో వున్నధనం దాదాపు 5.6 రెట్లు పెరిగింది. 1938-39 సంవత్సరంలో మనదేశంలో చలామణిలో రూ. 196 కోట్లు వుండేవి; 1946-47 నాటికే ఆమొత్తం రూ. 1251 కోట్లకు పెరిగింది. 1948 జూన్ నాటికి రూ. 1292 కోట్లు చలామణిలోవున్నాయి. ఒక్క 1948 సంవత్సరంలోనే మొదటి ఆరు నెలలలోనే రూ. 80 కోట్లు కొత్తగా చలామణీలోనికి వచ్చాయి. ఈ విధంగా చలామణిలోవున్న సొమ్ము పెరిగి పోవటంవల్ల ధరలు పెరగటానికి అవకాశం కలిగింది.

కేంద్రప్రభుత్వ బడ్జెట్ గత పదిసంవత్సరాలనుంచి, ప్రతిసంవత్సరము కొరత చూపిస్తూనే వుంది. బడ్జెట్‌లో ఏర్పడ్డ లోటును ఎప్పటికప్పుడు కొత్తనోట్లు పుట్టించి ప్రభుత్వం దాటవేసుకువస్తున్నది. అందువల్ల ఆ సంవత్సరాని కాసంవత్సరం ఇన్‌ఫ్లేషన్ పెరిగిపోతూవచ్చింది. ఒక్క కేంద్రప్రభుత్వ బడ్జెట్ గాక అన్నిరాష్ట్రాల బడ్జెట్‌లుకూడా 'కొరతనే' చూపిస్తున్నాయి. 1948-49 సంవత్సరంలో రాష్ట్రాల బడ్జెట్లలో ఈక్రిందికొరతలు ఏర్పడ్డాయి. మద్రాసు రూ. 5.62 కోట్లు; యు. పి. రూ. 4.7 కోట్లు; బొంబాయి రూ. 2.64 కోట్లు; తూర్పు పంజాబ్ రూ. 6 69 కోట్లు; పశ్చిమబెంగాల్ రూ. 0.78 కోట్లు; సి. పి. రూ. 0.45 కోట్లు; అస్సాం రూ. 1.49 కోట్లు; ఒరిస్సా రూ. 0.69 కోట్లు. ఒక్క బీహార్ బడ్జెట్‌మాత్రం రూ. 1.48 కోట్లు మిగులు చూపింది. కేంద్రప్రభుత్వ ఆదాయం 1946-47 లో రూ. 336 కోట్లనుంచి 1947-48 లో రూ. 298 కోట్లకు తగ్గింది. ఆదాయం తగ్గుతూ, వ్యయం పెరుగుతూంటే నోట్లు పుట్టించటము, ఇన్‌ఫ్లేషన్ వృద్ధిపరచటము జరుగుతుంది.

1947 సంవత్సరాంతానికి ప్రభుత్వం అన్నివస్తువులపైనను కంట్రోల్ తొలగించింది. దానివలన వెంటనే వస్తువుల ధరలు విపరీతంగా పెరిగాయి. 1947 నవంబరునుంచి 1948 మేనాటికి ధరల ఘాతసూచీ

సంఖ్య నూటికి 21 వంతులు పెరిగింది. 1947 సంవత్సరంలో పరిస్థితులను తారుమారు చేసిన సంఘటన ఇదే. విదేశనాణెముల నిలవలను వృద్ధి చేయటానికిగాను దిగుమతులపై నిర్బంధాలు వృద్ధిచేయటంవలన దేశంలో మార్కెట్‌లలో వస్తువులు లేక ధరలు మరింత విపరీతంగా పెరగటానికి వీలుఏర్పడింది.

ప్రభుత్వోద్యోగుల, వ్యాపారస్థుల లంచగొండితనం సంగతి వేరే చెప్పనక్కరలేదు. కంట్రోల్స్ విధించి నప్పటినుంచికూడా మామూలు వర్తకంకన్న బ్లాక్‌మార్కెట్ వర్తకమే ఎక్కువ జరుగుతున్నదని చెప్పవచ్చును. దేశం విభజితమైనతర్వాత ఒక అధినివేశంనుంచి ఇంకొక అధినివేశానికి దొంగతనంగా వస్తువులు రవాణా చేయటంకూడా ప్రారంభమై వస్తువులు కొరతగా వుండటం మరీ హెచ్చింది.

ఈ పరిస్థితులను వెంటనే అరికట్టకపోతే, త్వరలోనే దేశంలో ఆర్థికఅరాజకము, తద్వారా రాజకీయఅరాచకము ప్రబలుతవని ప్రభుత్వం గుర్తించింది. అన్నివర్గాలవారిని విడివిడిగా సమావేశపరచి, ప్రస్తుత పరిస్థితిని చక్కబరచటానికి తమ తమ సూచనల నివ్వవలసిందని కోరింది. వారిచ్చిన సూచనలు సూక్ష్మంగా ఈక్రింద గమనిద్దాము.

దేశంలో వెంటనే అధికోత్పత్తిజరగాలని అన్నివర్గాలవారు సూచించారు. పారిశ్రామిక వేత్తలు, బ్యాంకర్లు కొన్నికష్టాలను పేర్కొని వాటిని తొలగించవలసిందని కోరారు. తదితరులు, ప్రతిపరిశ్రమకు ఉత్పత్తికోటా ఏర్పరచి, ఆ కోటాప్రకారం ఉత్పత్తి జరిగి తీరేటట్లు కట్టుదిట్టాలు చేయాలన్నారు. విదేశస్థుల పెట్టుబడిని ఆహ్వానించవలసిందని శ్రీ జైప్రకాశ్ నారాయణ, ప్రభుత్వసలహాదార్లు సూచించారు. దిగుమతుల విధానం సడలించి, ఎక్కువ వస్తువులు—నిత్యజీవనంలో వాడుకకు కావలసినవి—దిగుమతి చేయవలసిందని అందరూ సలహాఇచ్చారు. రాష్ట్రాలకు గ్రాంట్లు యివ్వవద్దనీ, ఖర్చు వీలైనంత తగ్గించమనీ, పెద్ద

ప్రాజెక్టులు వగైరా ఇప్పుడు తలపెట్టకద్దనీ, పన్నులు తగ్గించకుండా వుంచి, బడ్జెట్‌లో 'కొరత' లేకుండాచేసి 'మిగులు' వుంచమనీ చాలమంది సూచించారు. పారిశ్రామిక వేత్తలుమాత్రం పన్ను భారం తగ్గించవలసిందని కోరారు. మద్యపాననిషేధము, జమీందారీల రద్దు వెంటనే పూనుకో రాదని అందరూ హెచ్చరించారు. ప్రభుత్వఋణాలకు ఎక్కువసొమ్ము చేకూర్చాలని, స్మాల్ సేవింగ్స్ స్కీములు ప్రారంభించాలని అందరూ సూచించారు. చలామణీలో వున్న నోట్లకుకూడా ఒక అంకు ఏర్పరచి తీరాలని ఆర్థికశాస్త్రవేత్తలు హెచ్చరించారు. కంట్రోల్స్ తిరిగి విధించి వాటిని సక్రమంగా అమలు జరిపించాలని అందరూ అంగీకరించారు.

అన్నివర్గాలవారి సూచనలు పునరాలోచించి భారతప్రభుత్వం తన విధానం నిర్ణయించింది. ఈవిధానంతో భారతప్రభుత్వం సాధించ దలచిన లక్ష్యాలు ఇవి: 1. ప్రభుత్వాదాయాన్ని వృద్ధిపరచటము, వ్యయంతగ్గించటము. 2. జీవనవ్యయము, ధరలు ఇంకేమాత్రము పెరగ కుండాచేయుటము. 3. వీలైనంతత్వరలో ధరలు క్రమేణా తగ్గేటట్లు చేసి, ఎక్కువమొత్తం వస్తువులు మార్కెట్‌లో లభింపజేయుటము, 4. ప్రజానీకం చేతులలోవున్న కొనుగోలుశక్తిని - డబ్బును-వీలైనన్ని విధాల తగ్గించటము, ఇకముందు అది పెరగకుండా చూడటము.

ఈలక్ష్యాలు సాధించటానికి అనుగుణ్యంగా ప్రభుత్వం ఒక విధా నాన్ని నిర్ణయించి ప్రకటించింది. ఆనిర్ణయాలు ఇవి.

## 1. అధికోత్పత్తికి దోహదాలు :

(అ) యంత్రసామగ్రి మొదలైన వాటిమీద 'అరుగుదల' ఎలవెన్సులు పెంచి, తక్కువమొత్తం లాభంమీదనే పన్ను విధించటం.

(ఇ) క్రొత్త కంపెనీలకు కొన్నాళ్ళపాటు పన్ను విధించకుండా వుండటం.

(ఉ) ముడిసరకు, యంత్రసామగ్రి దిగుమతులపై సుంకాలు తగ్గించటం.

(ఋ) యజమాని కార్మికతగాదాల పరిష్కారానికి దేశమంతట ఒకే శాసనాన్ని అమలు జరపటము, పరిష్కారంగా సూచింపబడిన 'ఎవార్డు'ను ఖచ్చితంగా అమలు జరిపించటము.

## 2. చలామణిలోవున్నధనాన్ని తగ్గించటానికి విధానాలు :

(అ) బడ్జెట్ లోటును పూర్తిగా తగ్గించివేయటము. వడ్డీ గిట్టనిఖర్చు తగ్గించుకోవటము.

(ఇ) స్మాల్ సేవింగ్సుస్కీమును ఇతోధికంగా ప్రచారము చెయ్యటము; పోస్టల్ సేవింగ్సుబాండ్సు, నేషనల్ సేవింగ్సు సర్టిఫికేట్సు, ట్రెజరీ డిపాజిట్ రసీట్స్ వగైరా విరివిగా వాడకంలోకి తేవటము.

(ఉ) కంపెనీలు పంచిపెట్టేలాభాలు, గత రెండు సంవత్సరాలలోను అవి పంచిపెట్టిన సగటు మొత్తానికిగాని, నూటికి 6%కు గాని మించకుండా పరిమితం చేయుటము.

(ఋ) ఇ. పి. టి. డిపాజిట్లు తిరిగి యిచ్చివేయవలసిన కాలమును వాయిదా వేయటము.

(ౠ) వారసత్వములపై పన్నుబిల్లును వెంటనే ప్యాసుచేయటము.

(ఎ) స్పెక్యులేషన్ వ్యాపారాన్ని అరికట్టటానికిగాను, బ్యాంకులు అప్పులుయిచ్చే షరతులను కట్టుదిట్టము చేయుటము.

## 3. ధరలను తగ్గించటానికి మార్గాలు :

(అ) ఆహారధాన్యాలు, పంచదార, గుడ్డలధరలు పంపకముపై కంట్రోల్ విధించటము.

(ఇ) ఇనుము, ఉక్కు, సిమెంటు, కిరసనాయిలు మొదలైనవస్తువులు ఇతోధిక సక్రమంగా పంపకమయ్యేటట్లు చూడటము.

(ఈ) దిగుమతి విధానంసడలించి, ఎక్కువ వస్తువులు దిగుమతిచేయుటము.

ఇది స్థూలరూపంలో భారతప్రభుత్వ ఇన్ఫ్లేషన్ నివారణవిధానం. దీనిని కొంచెం వివరంగా పరిశీలిస్తూ, ఇవి ఇప్పటివరకు ఏవిధంగా ఉపయోగపడుతున్నవో ఆలోచిద్దాము.

ఇన్ఫ్లేషన్ను అరికట్టటానికి అధికోత్పత్తి ఏకైక మార్గమని అందరూ అంగీకరిస్తారు. అధికోత్పత్తికి దోహదంచేయటానికి భారత ప్రభుత్వం అనుసరించిన విధానాలు సంతృప్తికరంగానే వున్నాయి. గత బడ్జెట్లో పారిశ్రామిక వేత్తలకు చూపిన సౌకర్యాలు, ఈవిధానంలో సూచించిన ఇతరసౌకర్యాలు, 1949-50 బడ్జెట్లో చూపిన ఇతరసౌకర్యాలు వాస్తవానికి చాల ఔదర్యంగా వున్నవి. ప్రభుత్వము అన్నిసౌకర్యాలు పారిశ్రామికవేత్తలకు చెస్తున్నదిగాని, అధికోత్పత్తి ఇంతవరకు జరిగితీరాలని షరతు పెట్టడంలేదు. శ్రీ జైప్రకాశ్ నారాయణ సూచించినట్లు, ప్రతి మూడునెలలకు ప్రతి ఫ్యాక్టరీ ఇంతమొత్తము వస్తువులు ఉత్పత్తిచేసితీరాలని ఒకకోటా ఏర్పరచటం ఎంతేని అవుసరం. ఈ విధానంప్రకారం పారిశ్రామిక వేత్తలకు అధికసౌకర్యాలు గత 7,8 నెలలనుంచి ఇస్తున్నారు. వీటికి ఫలితం ఇంతవరకు ఏమీ గోచరించటం లేదు. ఎన్నిసౌకర్యాలు చేసినా ఇంకా ఎక్కువకావాలని కోరటం వారికి పరిపాటి అయిపోయింది. ఈవిషయంలో ఇకముందైనా ప్రభుత్వం ఒక ఖచ్చితమైన షరతు విధించి అది సక్రమంగా అమలుజరిగేటట్లు చూడటం అవుసరం.

చలామణీ నిరోధానికి భారతప్రభుత్వం నిర్ణయించుకున్న పథకం సక్రమంగానే వుందికాని అది ఆచరణలో అనుసరింపబడటంలేదు. ఇప్పుడున్న పన్నులు హెచ్చించటంగాని, తగ్గించటంగాని జరగకుండా

బడ్జెట్‌లో 'మిగులు' చూపించితే, ఇన్‌ఫ్లేషన్ నిరోధకంగావుండేది. కాని ధనవంతులకు పన్నుతగ్గించి, పేదలకు హెచ్చించి బడ్జెట్‌లో ఏర్పడ్డలోటును అదనపుపన్నులతో భర్తీచేయడం ఇన్‌ఫ్లేషన్‌ను ఎదుర్కోవటంకాదు. రాష్ట్రాల బడ్జెట్‌లుకూడా క్రొత్తపన్నులువేసి కొద్దిపాటి 'మిగులు' కనపడేటట్లు తయారుచేశారు. ఈ కన్నుతుడుపు విధానం ఏమాత్రము ఉపయోగకారి కానేరదు. వారసత్వపుపన్ను బిల్లు ఇంకా ఆలోచనకు రాలేదు; స్మాల్ సేవింగ్స్ స్కీములు ఏమీ జనాకర్షకంగా లేవు. అవి ఈ సంవత్సరంకూడా విఫలమౌతున్నాయి. కంపెనీలు పంచిపెట్టే లాభాలపై కంట్రోల్‌కూడా నామమాత్రమే అయింది. గతరెండుసంవత్సరాలలోను కంపెనీలు చాల ఎక్కువ శాతము లాభాలు పంచాయి, ఈ సంవత్సరం వాటిలాభాలు తగ్గుతుండటంవల్ల అంతకంటె ఎక్కువ శాతం లాభాలు. ఇవ్వమన్నా ఇచ్చేటట్లు లేవు; క్రొత్తకంపెనీలు 4, 5 ఏండ్లవరకు నూటికి 6 కన్న ఎక్కువశాతంలాభం ఎప్పుడూ పంచలేవు. కాబట్టి ఈ కంట్రోల్‌వల్ల ఏకంపెనీలు ఏవిధమైన ఆటంకము అనుకోకుండా యధాప్రకారంగా లాభాలు పంచగల్గుతున్నాయి.

కంట్రోల్స్ విధించినంతమాత్రాన ధరలు తగ్గవు. కంట్రోల్స్ అమలుజరిపే ఉద్యోగులు లంచగొండులని, కంట్రోల్ సరిగా అమలు జరగటంలేదని భావించియేకదా కంట్రోల్స్ తొలగించటానికి నిర్ణయించింది. ఇప్పుడు కంట్రోల్ నిర్వహణ వారికే తిరిగి వప్పజెప్పితే, ఏమిజరుగుతుందో మనకు తెలియదా? ధరలు, పంపకము కంట్రోల్ నిబంధనలపైనగాక వాటిని అమలుజరిపే విధానంపై ఆధారపడుతవి. అవినీతిని అరికట్టటానికి ఇప్పుడు జరుపుతున్న చర్యలు ఏమాత్రము సంతృప్తికరంగా లేవు; వాటివల్ల సత్ఫలితం ఏమీకలగదు. ఈ సంవత్సరమైనా ఈవిధానం అతికఠినంగా అమలు జరిగేటట్లుచూడాలి.

1948 సంవత్సరాంతంలో దిగుమతులవిధానం సడలించటంవల్ల వస్తువుల దిగుమతువృద్ధిఅయి మార్కెట్‌లో ఎక్కువ వస్తువులువుండి, ధరలు తగ్గకపోయినా, కొరతలేకుండావున్నది. ఇప్పుడు దిగుమతి విధానం మరల కఠినంచేసి దిగుమతులు తగ్గిస్తున్నారు. ఇందువల్ల వస్తువులు మళ్లీ కరువయిపోయేటట్లున్నవి. దీనితో ప్రజలు మరింత కష్టపడతారు.

భారత ప్రభుత్వ ఇన్‌ఫ్లేషన్ నిరోధక విధానంపైకి సమంజసంగా సంతృప్తికరంగానే వుంటిగాని వాస్తవ ఆచరణలోనికి వచ్చేటప్పటికి అసమగ్రంగాను, అసంతృప్తికరంగానువుండి, అవకతవకగా అమలుజరుగుతూ ఏమాత్రము ప్రయోజనకారిగాలేదు.

# ఆర్థిక వ్యవహారాలు - ౨

భారతదేశం రాజకీయంగా స్వాతంత్ర్యం పొందిన తర్వాత ఆర్థిక స్వాతంత్ర్యం విషయం అతిప్రాముఖ్యంలోనికి వచ్చింది. మన ప్రజలకు కావలసిన వస్తువులన్నీ మనదేశంలోనే ఉత్పత్తి చేసుకుని, ముఖ్యమైన భారీపరిశ్రమలను మనదేశంలో స్థాపించుకుని ఇతరదేశాలనుండి దిగుమతులపై ఆధారపడకుండా, మనదేశాన్ని ఆర్థికంగా స్వయంపోషకం చేయాలని ప్రభుత్వం ప్రయత్నిస్తున్నది. దేశంలోని అన్నివర్గాలవారిని కూడగట్టుకునివచ్చి అందరిసహకారము సంపాదించి తద్వారా దేశ పారిశ్రామికాభ్యున్నతి సాధించాలని ప్రభుత్వం ప్రయత్నిస్తున్నది. 1948 ఏప్రిల్ నెలలో భారతప్రభుత్వ పారిశ్రామికవిధాన ప్రకటన ఇట్టి ఆశయాలతోనే తయారుచేశారు. పారిశ్రామికాభ్యున్నతి విషయంలో ఈ సంవత్సరంలో జరిగిన కార్యక్రమాన్ని ఇక్కడ సమీక్షిద్దాము.

1948 ఏప్రిల్‌లో ప్రకటించిన భారతప్రభుత్వ పారిశ్రామిక విధానంలో ఇకముందు కొన్ని పరిశ్రమలలో కొత్తఫ్యాక్టరీలను ప్రభుత్వమే స్థాపించాలని నిర్ణయించారు. మరికొన్నిపరిశ్రమలు ప్రైవేట్ వ్యక్తులు—కాపిటలిస్టులు, కాపిటలిస్టు సంస్థలు—స్థాపించటానికి వదలివేశారు. దేశాభ్యుదయానికి, ప్రజాక్షేమానికి అవుసరమైన కీలకపరిశ్రమలు, ఇంతవరకు మనదేశంలోలేని ముఖ్యపరిశ్రమలు అన్నీ ప్రభుత్వపరంగానే స్థాపించాలని నిశ్చయించారు. ఈ నిర్ణయం ఈసంవత్సరంలో కొంతవరకు—వీలైనంతవరకు—కార్యరూపం దాలుస్తున్నదని చెప్పవచ్చును. చాల కొత్తపరిశ్రమలను స్థాపించటానికి భారతప్రభుత్వం ప్లానులు తయారుచేసింది; ఫ్యాక్టరీలు ఏ యే చోట్ల కట్టాలో నిశ్చయించారు, కావలసిన యంత్రసామగ్రికి ఆర్డర్లు ఇచ్చారు, ఈ పరిశ్రమలు నిర్వహించటానికి అవుసరమైన సాంకేతిక నిపుణులను కొందరిని ఏరుకుని

విదేశాలకుపంపి తర్ఫీదుయిప్పిస్తున్నారు; కొన్ని ఫ్యాక్టరీలు కట్టటం ప్రారంభంకూడా అయింది. ఒక్కొక్క పరిశ్రమను స్థాపించదలచుకున్నప్పుడు ఆపరిశ్రమలో నిపుణులైన విదేశస్థులను మన దేశానికి ఆహ్వానించి, మన ప్లానులు వారికిచూపించి, సలహాలు, ఆమోదాలు పొందుతూ, క్రొత్తగా స్థాపింపబడే పరిశ్రమలు సరియైన, లాభసాటియైన విధానంలో వుంటవోలేవో ప్రభుత్వం ఆలోచిస్తున్నది.

సాలుకు 10 లక్షల టన్నులు ఉక్కును ఉత్పత్తిచేసే ఇనుము, ఉక్కు ఫ్యాక్టరీలు ఒకటి, రెండు స్థాపించాలని ప్రభుత్వం నిశ్చయించింది. ఇవిరెండూ బహుశః ఉత్తరదేశంలోనే, బీహార్, ఒరిస్సాలలో వుండవచ్చును. వీటి నిర్మాణం రానున్న సంవత్సరంలో ప్రారంభం కాగలదు. పెద్దపెద్ద విద్యుత్ పరికరాలు, రేడియోపరికరాలు, రాడార్, ట్రాక్టర్లు, బొగ్గునుండి నూనెపింపటము, మెషిన్‌టూల్స్ మొదలైన పరిశ్రమలు స్థాపించాలని నిర్ణయించారు. వీటి నిర్మాణంకూడా రానున్న సంవత్సరం ప్రారంభమౌతుంది. సాలుకు 3½ లక్షల టన్నుల ఎరువును ఉత్పత్తిచేసి ఫ్యాక్టరీ సింద్రీలో నిర్మిస్తున్నారు. దీని నిర్మాణం ఈ సంవత్సరం పూర్తిఅవుతుంది. 1950 సంవత్సరం మధ్యలో ఈఫ్యాక్టరీలో ఉత్పత్తి ప్రారంభమౌతుంది. సాలుకు 2½ లక్షల టన్నులు సిమెంటు ఉత్పత్తిచేసే సిమెంటు ఫ్యాక్టరీకూడా సింద్రీలోనే నిర్మించబోతున్నారు. బెంగుళూరులోని హిందుస్థాన్ ఎయిర్‌క్రాఫ్ట్ ఫ్యాక్టరీలో, భారతీయులచే డిజైన్ వేయబడి భారతీయ కార్మికులచే, భారతీయ ఇంజనీర్ల పర్యవేక్షణక్రింద విమానం త్వరలోనే తయారుకానున్నది. ఇది కేవలం మొదలుమాత్రమే. విమానాలు డిజైన్ చేసే ఇంజనీర్లు ఎక్కువ అనుభవం పొందినకొద్దీ కొత్తరకాల విమానాలు ఉత్పత్తిచేయుటము, కొత్త ఫ్యాక్టరీలు కట్టటము జరుగుతుంది. టెలిఫోన్ పరికరాలు ఉత్పత్తిచేసే ఫ్యాక్టరీ ఒకటి బెంగుళూరులో స్థాపించారు. ఇది ఇప్పుడు విదేశాల నుంచి విడిసామానులు దిగుమతిచేసుకుని, టెలిఫోన్‌లు సమకూరు

స్తున్నది. గుడిసామాను ఉత్పత్తికూడా త్వరలోనే ప్రారంభమౌతుంది. ప్రభుత్వం వెంటనే చేయబూనుకున్న ముఖ్య కార్యక్రమం ఇది.

పారిశ్రామిక వేత్తలతో ఇతోధికసన్నిహితత్వంతో వ్యవహరిస్తూ, వారి కష్టనష్టాలు, సాధకబాధకాలు అవగాహనచేసుకుని వాటిని నివారించటానికి తగుఏర్పాట్లుచేసి, పారిశ్రామికాభ్యున్నతికి వారు తీవ్రకృషి చేసేటట్లు ప్రోత్సాహపరచవలెనని ప్రభుత్వం నిశ్చయించింది. ఈ ఉద్దేశ్యంతోనే ఒక 'ఇండస్ట్రియల్ ఎడ్వైజరీకౌన్సిల్' ఏర్పాటుచేయబడింది. ప్రతిముఖ్యపరిశ్రమ సమస్యలను పరిశీలించి, అభ్యున్నతిమార్గాలను ప్రభుత్వానికి సిఫార్సులుచేయటానికిగాను 25 ప్రత్యేక ఉపసంఘాలు కూడా ఏర్పాటుచేశారు. ప్రతిపరిశ్రమ ఉత్పత్తిచేయవలసిన మొత్తాన్ని, అన్నివర్గాలను సంప్రదించినతర్వాత నిర్ణయించి ఆమొత్తం ఉత్పత్తి జరిగేటట్లు చేయాలని ప్రయత్నాలు జరుగుతున్నవి. ఆర్థికవ్యవహారాలను చర్చించటానికి ఖజానామంత్రి ఆధ్వర్యాన వాణిజ్యమంత్రి, రవాణా మంత్రి, పరిశ్రమలమంత్రి తరచు సమావేశమౌతుంటారు. కేంద్రప్లానింగ్ కమిషన్ ఇంకా నియమింపబడలేదు. గత సంవత్సరం ప్రభుత్వం స్థాపించిన 'పరిశ్రమలకు ప్రభుత్వఋణసహాయసంస్థ' ఈ సంవత్సరంలో 12 కంపెనీలకు రూ. 2.25 కోట్లు అప్పులు యిచ్చి సహాయపడింది. గృహ పరిశ్రమల విషయంకూడా ప్రభుత్వం శ్రద్ధగా ఆలోచిస్తూనేవున్నది. 'అఖిలభారత గృహపరిశ్రమలసంఘము' ఏర్పాటుచేయబడింది కాని కార్యక్రమం చురుకుగా సాగటంలేదు.

పారిశ్రామికాభ్యున్నతికి ప్రభుత్వం చేయవలసినంతసహాయం చేస్తున్నది. పెట్టుబడిదారులపై పన్ను భారంకూడా-బడ్జెట్ ప్రకరణంలో గమనించినట్లు చాల తగ్గించారు. ఇన్ఫ్లేషన్ నివారణపథకంలో పారిశ్రామికవేత్తలకు అదనపుసౌకర్యాలు ఇచ్చారు. పరిశ్రమలకు కాదు ఎప్పటికీకూడా ప్రైవేట్ వ్యక్తుల చేతులలోవున్న పరిశ్రమలు ప్రభుత్వం వశపరచుకోబోవటం లేదని ప్రధాని, ఉపప్రధాని, పరిశ్రమలమంత్రి,

ఖజానామంత్రి మొదలైన పెద్దలందరు హామీయిచ్చారు. ఇన్ని చేసినప్పటికీ పరిశ్రమాభివృద్ధి చెప్పుకోదగినంతగా జరగటంలేదు. పెట్టుబడిదారులు ఎప్పటికప్పుడు ఏదో ఒక సాకును, ఏదోఒక అడ్డంకును పేర్కొంటూనే వున్నారు కాని తమ బాధ్యత నిర్వహించటలేను. ఈ సంవత్సరంలో పెట్టుబడిదారులు ఇన్ని పరిశ్రమలు, ఇన్ని ఫ్యాక్టరీలు స్థాపించారని చెప్పుకోటానికి ఏమీ కనపడటంలేదు. భారత ప్రభుత్వం తమ్ము కాదని, స్వతంత్రించి, పారిశ్రామికాభ్యున్నతికి పూనుకోదని వీరు గ్రహించారు. ప్రభుత్వం తమ సహాయాన్ని అర్థిస్తున్నది కాబట్టి తమ స్థానమునిప్పుడే బలపరచుకోవాలని వీరిఆశ. ఎప్పటికప్పుడు ప్రభుత్వాన్ని ఒత్తిడిచేసి, కొన్ని అదనపు సౌకర్యాలు సంపాదించుటమే వీరిఆశయం. వీరుకోరే కోర్కెలన్ని ప్రభుత్వం నెరవేర్చినా వీరివల్లజరిగే ఉపకారం చాల తక్కువ. ఆసంగతి తెలిసికూడా ప్రభుత్వం వీరని అదుపులోనికి తేలేకుండా వున్నది.

పారిశ్రామికాభివృద్ధికి తమకు పెద్ద ఆటంకముగా వున్నదని పెట్టుబడిదారులు, ఈ సంవత్సరం, చెప్తున్నది పరిశ్రమల కంట్రోల్ బిల్లు. ఈ బిల్లు మున్నటి మార్చి నెలలోనే పార్లమెంటులో ఆమోదింపబడింది. అప్పటినుంచీ పారిశ్రామిక వేత్తలు దీనిని పలువిధాల విమర్శిస్తున్నారు. ఈబిల్లు ముఖ్యఅంశాలు గమనిద్దాము. ఈబిల్లుప్రకారం 25 పరిశ్రమలు ప్రభుత్వ కంట్రోల్ కిందకు వస్తాయి. బిల్లు ప్యాసైన మూడు నెలలలోగా ఈ 25 పరిశ్రమలలోను ఇప్పుడువున్న ఫ్యాక్టరీలన్ని ప్రభుత్వంవద్ద 'రిజిస్టరు' చేసుకోవాలి; ఇకముందు వీటిని వృద్ధిచేయటానికిగాని, కొత్తఫ్యాక్టరీలు కట్టటానికిగాని ప్రభుత్వలైసెన్సు ముందుగా పొందివుండాలి. ఆపరిశ్రమ స్థాపించవలసినచోటు, దాని ఉత్పత్తిశక్తి మొదలైన విషయాలు ప్రభుత్వం విధించినట్లుగా అంగీకరించాలి. ఈ షరతులు ఉల్లంఘించినప్పుడుగాని, ఇతర కారణాలవల్ల అవసరమని తోచినప్పుడుగాని ఆ ఫ్యాక్టరీని ప్రభుత్వం వశపరచుకుని, తానుగాని, తనకునచ్చిన ఇతరుల

చేతగాని నడిపించవచ్చును. ఈ అధికారాలు, యుద్ధకాలంలో 'డిఫెన్స్ ఆఫ్ ఇండియా' ఆర్డినెన్సుల క్రింద తీసుకున్న అధికారాలవలె వున్నాయని పారిశ్రామికవేత్తలు విమర్శించారు. దేశానికంతకు ముఖ్యమైన ఇనుము, ఉక్కు, సిమెంటు మొదలైన పరిశ్రమల విషయంలో ఇటువంటి విశేషాధికారాలు అవుసరంకావచ్చును గాని జనపనార, ప్రత్తి, గుడ్డ మొదలైన పరిశ్రమలలో ఇటువంటి 'డిక్టేటర్' అధికారాలు ఎందుకని, పారిశ్రామికవేత్తలు సరిగా నిర్వహించలేకపోతే ప్రభుత్వం నిర్వహించగలదా అని, ఇటువంటి కఠినమైనబిల్లులు తయారుచేస్తూ విదేశస్థులు మనదేశంలో పెట్టుబడి పెట్టాలని అడగటం ఎందుకని ఎవరికి తోచినట్లు వారు విమర్శిస్తున్నారు. ఈ బిల్లువల్ల పారిశ్రామికవేత్తలందరు భయభీతులై, కొత్త పరిశ్రమలను స్థాపించటానికి ముందుకురావటంలేదనీ, ఈబిల్లు తొలగించకుండా ఇతరసౌకర్యాలు కలిగించి, పారిశ్రామికాభివృద్ధి కావాలనటం అనవుసరమని నెమ్మదిగా తేలుస్తారు. వాస్తవానికి ఈబిల్లు ఏమీకఠినంగా లేదు. అయినదానికీ, కానిదానికీ, పరిశ్రమల ఉత్పత్తి పడిపోతూ, ఇన్‌ఫ్లేషన్ ప్రమాదం హెచ్చిపోతూంటే, ప్రభుత్వం చూస్తూఊరుకో గలదా? పెట్టుబడిదారులు కోరే హిరణ్యాక్షువరాలన్నీ యివ్వగలదా?

మన పెట్టుబడిదారుల చేతులలో ధనం పుష్కలంగావున్నది కాని బ్లాక్‌మార్కెట్ సొమ్ముకావటంవల్ల, దానిని బయటకుతెచ్చి పరిశ్రమలలో పెట్టుబడి పెట్టటానికి వారు భయపడుతున్నారు. వీరిలో కొంతమందిపై ఆదాయపుపన్ను ఎగవేతకేసులు వున్నాయి. ఇంకెంత మందిపై ఆకేసులు వస్తాయో తెలియదు. ఆకేసులలో ప్రభుత్వానికి ఏమీ ఆచోకీ తెలియకుండా వుంచేటందుకు జమా ఖర్చుల పుస్తకాలు నాశనంచేస్తున్నారు. వీరితో ఏవిధంగానైనా రాజీకి రావాలని ప్రభుత్వం ప్రయత్నిస్తున్నకొద్దీ వీరు ఓ(ర)బిగుస్తున్నారు. అంతేగాని వాస్తవానికి వీరిదగ్గరవున్న నిలవలు చాల తక్కువ. వీరిమీదనే ఆధారపడివుంటే మన పారిశ్రామికాభివృద్ధి చాల నెమ్మదిగా జరుగుతుందని మన ప్రభుత్వం గ్రహించింది. పారిశ్రామికాభివృద్ధి మనం ఆశిస్తున్నంత

త్వరగా జరగాలంటే, ప్రభుత్వమూ, భారతపారిశ్రామిక వేత్తలు పెట్ట గల పెట్టుబడి చాలదు. మనదేశంలో సొమ్మునిలవలు చాలతక్కువగా వుండటమేగాకుండా, ఇప్పుడు ప్రతిఏటా నిలవచేయబడుతున్న సొమ్ము కూడా శూన్యమేనని ఈమధ్య 'ఈస్టర్న్ ఎకొనమిస్టు' పత్రిక లెక్క వేసింది. ఈపత్రిక లెక్కలప్రకారం మనదేశంలో నిలవచేయబడుతున్న సొమ్ము ఇది :—

| | నిలవచేయబడుతున్న సొమ్ము రూ. కోట్లు. | దేశీయాదాయము రూ. కోట్లు. | దేశీయాదాయంలో ఎన్నిపాళ్లు నిలువ చేయబడుతున్నది. |
|---|---|---|---|
| 1939-40 | 180.4 | 1,934.3 | 9.3 |
| 1940-41 | 232.5 | 2,058.3 | 11.3 |
| 1941-42 | 429.2 | 2,326.0 | 18.5 |
| 1942-43 | 405.2 | 3,37[illegible].4 | 12.0 |
| 1943-44 | 585.6 | 4,233.2 | 13.8 |
| 1944-45 | 331.8 | 4,270.9 | 7.8 |
| 1945-46 | 293.9 | 4,238.2 | 6.8 |
| 1946-47 | —199.5 | 4,507.2 | — |
| 1947-48 * | —43.8 | 3,942.1 | — |

* ఇండియన్ యూనియన్ మాత్రమే.

మనదేశం ఇప్పుడున్న ఆర్థికస్థాయిని నిలుపుకోటానికి, నెమ్మదిగా అభివృద్ధి చెందటానికి ఏటేటా కనీసం రూ 500 కోట్లయినా సొమ్ము నిలువచేయబడి, తిరిగి పెట్టుబడి పెట్టబడుతుండాలని అంచనా వేశారు. ఈ లెక్కప్రకారం గత 4,5 ఏండ్లనుంచికూడా మనం అసలుసొమ్ము మింగివేస్తున్నాము.

పరిశ్రమాభివృద్ధికి కావలసినసొమ్ము పారిశ్రామికవేత్తలవద్ద లేక, పారిశ్రామికాభివృద్ధికి వారు ఉత్సాహంతో ముందుకురాక, దేశాభ్యు

న్నతి కుంటుపడుతున్నసమయంలో ప్రభుత్వం ఇంకేమార్గం లేకక గత్యంతరంలేదు. తనకు తానై సొమ్ముపెచ్చించి పరిశ్రమలు నెలకొల్ప టానికి తగినంతసొమ్ము, సామర్థ్యము భారతప్రభుత్వానికి లేవు. అందు వల్ల మనదేశానికి విదేశస్థుల పెట్టుబడి ఆహ్వానించవలసివచ్చింది. ఒక్క పెట్టుబడివిషయమున నేగాక, యంత్రసామగ్రి సాంకేతిక నిపుణులవిషయ మునకూడ మనము చాల వెనుకబడివున్నాము. ఒకవేళ మనదేశంలో తగి నంతసొమ్ము లభించినా యంత్రాలకు, నిపుణులకు విదేశాలకువెళ్ళి నానా బాధలు పడవలసిందే. విదేశస్థులే తమ సొమ్ముతోనే మనదేశంలో పరిశ్రమలు స్థాపించితే, వారికి కావలసిన యంత్రసామగ్రి, సాంకేతిక నిపుణులు వారే తెచ్చుకుంటారు. వారు చురుకుగా పరిశ్రమలు స్థాపించుతుంటే మన పారిశ్రామికవేత్తలుకూడా విధిలేకఅయినా కలిసి వస్తారు. ఈ ఉద్దేశ్యంతోనే మనప్రభుత్వం విదేశస్థులపెట్టుబడిని ఆహ్వా నించింది. అయితే విదేశస్థులకు అధిక సౌకర్యాలు ఇచ్చింది ఏమీ లేదు. భారతపారిశ్రామికవేత్తలపై విధించేషరతులకన్న కఠినమైన నిర్బంధాలు విదేశపారిశ్రామికవేత్తలపైన విధించమని ప్రభుత్వం వాగ్దానంచేసింది. ఏవిషయంలోను, భారత, విదేశపారిశ్రామికవేత్తలని పక్షపాతము, అభి మానములేకుండా వ్యవహరించటమే భారతప్రభుత్వలక్ష్యం. విదేశస్థులు తమ పెట్టుబడిపై కొంతలాభాన్ని స్వదేశానికి తీసుకుపోవటానికి, అవ సరమైనప్పుడు అసలు సొమ్ము తీసుకుపోవటానికి సౌకర్యాలు ఏర్పాటు చేస్తారు.

భారతప్రభుత్వం ప్రకటించిన ఈవిధానం విదేశస్థులకు చాల సంతృప్తి కలిగించింది. భారతదేశంలో పెట్టుబడిపెట్టటానికి విదేశపారి శ్రామికవేత్తలు చాలమంది ముందుకు వస్తున్నారు. భారతపారిశ్రామిక వేత్తలు కొందరు విదేశాలకువెళ్ళి అక్కడివారితో సంప్రదింపులు జరిపి, వారిని భాగస్వాములుగా చేర్చుకుని, పరిశ్రమలు స్థాపించాలని కృషి చేస్తున్నారు. విదేశాలలోని మన రాయబారులు ఆయా దేశాలలోని పారిశ్రామికవేత్తలతో సంబంధాలు కలుపుకుని వారిని మనదేశం ఆహ్వా

నించి, ఉత్సాహపరచి వుండవలసింది. కాని ఈకృషి ఏమాత్రము జరగటంలేదు.

పారిశ్రామికరంగంలో ఈ సంవత్సరం గమనించవలసిన మరొక ముఖ్యవిషయము 'ఫిస్కల్ కమిషన్' నియామకం. మన ఎగుమతి దిగుమతులపై ముఖ్యంగా దిగుమతులపై సుంకాలవిధానం ఏవిధంగావుండాలో, ఏయే పరిశ్రమలకు ప్రభుత్వం ఏయే మగతులపై ఎట్టిపరిస్థితులలో ('ప్రొటెక్షన్') రక్షణయివ్వాలో సూచించటం ఈ కమిషన్ ముఖ్య కర్తవ్యం. ఇంతకుముందు 1922 సంవత్సరంలో ఒకఫిస్కల్ కమిషన్ నియమించబడింది. ఆ కమిషన్ సూచించిన 'రక్షణ'విధానమే ఇప్పటి వరకు అమలులో వున్నది. ఆ విధానంలోని లోటుపాట్లు ఆలోచించ వలసిందనికూడా ఇప్పుడు నియమించిన ఫిస్కల్ కమిషన్‌ను కోరారు. అంతర్జాతీయ వర్తకవిషయాలసంఘం తయారుచేసిన ప్రణాళికను భారత ప్రభుత్వం ఆమోదించింది. ఆ ప్రణాళికప్రకారం ఎక్కువరకాల వస్తువులలో అన్నిదేశాలలోను సుంకాల ఆటంకంలేకుండా స్వేచ్ఛావ్యాపారం జరుపుకోటానికి అవకాశం వుండాలి. అట్లా ఏయే వస్తువులవిషయంలో స్వేచ్ఛావ్యాపారం జరుగనివ్వవచ్చునో, ఏయే వస్తువులపై మనం సుంకాలు విధించవలెనో సూచించవలసిందనికూడా ఈ కమిషన్‌ను కోరారు. దీనికి శ్రీ వి. టి. కృష్ణమాచారిగారు అధ్యక్షులు.

మనం వెంటనే సాధించవలెననుకుంటున్న ఆర్థిక లక్ష్యము పారిశ్రామికాభ్యున్నతి. ఆఆశయాన్ని జ్ఞాపకంపెట్టుకుని, దానిని సాధించటానికి అనుగుణమైన సుంకాలవిధానాన్ని ఈ కమిషన్ సూచించాలి. విదేశాలనుంచి దిగుమతులపై ఎక్కువ పన్నువేస్తే, మన దేశపు పరిశ్రమల వస్తువులు తేలికగా, త్వరగా అమ్ముడుపోతూ, ప్రోత్సాహకరంగా వుంటుంది. మన ప్రభుత్వానికి ఎక్కువపన్నులు చెల్లించవలసివచ్చిన విదేశ పారిశ్రామికవేత్తలు, తమ ఫ్యాక్టరీలను మన దేశంలోనే కట్టటానికి తమసొమ్మును మనదేశంలో పెట్టుబడి పెట్టటానికి ముందుకువస్తారు. కాబట్టి ఎక్కువరేటు సుంకాలు విధించటం, దీర్ఘ

కాలపు దృక్పథంలో, అవుసరమే. ఈరోజు మనదేశంలో వస్తువులు కరువుగావున్నవి; అందువల్లనే బ్లాక్ మార్కెటింగ్ లంచగొండితనము, ధరలు పెరిగిపోతూ ప్రజలు ఇబ్బందిపడుతున్నారు. విదేశాలనుంచి ఎక్కువవస్తువులు దిగుమతిచేసి, మార్కెట్‌లో అమ్ముతుంటే ధరలు తగ్గుతవి; అవినీతిపరులకు అవకాశం దొరకదు. ఎక్కువ దిగుమతులపై మనం ఆధారపడివున్నప్పుడు దిగుమతిసుంకాలు వృద్ధిచేస్తే, ఆపన్ను అంతా అధికధరలరూపంలో మనప్రజలే చెల్లించవలసి వుంటుంది. మన పారిశ్రామికవేత్తలమీద ఇతోధికంగా ఆధారపడి, వారు చెప్పినదాని కల్లా అంగీకరించవలసి వస్తుంది. తాత్కాలిక దృక్పథంతో చూస్తే దిగుమతిసుంకాలు మనపరిశ్రమల అభివృద్ధికి, ఉత్పత్తికి దోహదంచేయక పోగా, ప్రజానీకానికి ఎక్కువ ఇబ్బంది కలిగిస్తవి. ఈరెండు దృక్పథాలను సమగ్రంగా ఆలోచించి, సమన్వయపరచి, మనదేశానికి సక్రమమైన విధానాన్ని సూచించవలసిన బాధ్యత ఈకమిషన్‌పైన వున్నది.

పారిశ్రామికాభ్యున్నతి విషయంలో మన పెట్టుబడిదారులు సమ్మెచేస్తూ, ప్రభుత్వంతో బలాబలాలు చూచుకుంటున్నారు. ప్రభుత్వం వీరిసవాలును అంగీకరించి, తగినశాస్తి చేయటానికి ఏమీ సిద్ధపడడం లేదు. ఈవిషయంగ్రహించి పెట్టుబడిదారులు మరింత బిరబిగుస్తున్నారు. దేశాభ్యున్నతినిగురించి ఇన్నాళ్లనుంచి కంటున్నకలలు పగటికలలకన్న హీనమైపోతున్నవి. ఇకముందైనా, తన విధానము, కార్యక్రమము పెట్టుబడిదారులు సక్రమంగా అమలుజరిపేటట్లు కఠినచర్యలు తీసుకోక పోతే, భారతప్రభుత్వం అటు పారిశ్రామికవేత్తలకు తేలికైపోవటము. ఇటు సామాన్యప్రజానీకానికి తన అసమర్థతతో విసుగుపుట్టించటము జరుగుతుంది. పారిశ్రామికాభ్యున్నతికన్న ముఖ్యమైన విషయము, ఒకటి రెండు దశాబ్దాలవరకూ, మనదేశంలో ఏదీవుండదు. అంతటి ముఖ్యవిషయంలోనే భారతప్రభుత్వం ఇంత అశ్రద్ధ, అసమర్థత, ప్రదర్శిస్తూండటము శోచనీయము.

# ఆహార వ్యవహారాలు

భారతప్రభుత్వం గతసంవత్సరం ఎదుర్కొన్న ఆర్థిక సమస్యలన్నిటికి ఆహారసమస్యయే మూలకారణం. ఆహారం ఒక సమస్యగా వుండకపోతే మన విదేశ నాణెములనిలువలు ఎక్కువగావుండి యంత్రసామగ్రి దిగుమతి చేసుకోటానికి వీలయ్యేది; ఇన్‌ఫ్లేషన్ ఇప్పటికన్న ఎన్నోరెట్లు తక్కువగావుండి, ఈపాటికి నివారింపబడివుంటేది; ధరలు—ముఖ్యంగా జీవితావసర వస్తువుల ధరలు—చాలవరకు తగ్గి, దేశంలో జీవనవ్యయం సమంజసమైన స్థాయికి తగ్గివచ్చి, ప్రజల అసంతృప్తి, కార్మికుల ఆందోళన తగ్గివుంటేవి; బ్లాక్‌మార్కెట్, లంచగొండితనము, మొదలైన సామాజికవ్యతిరేక కార్యాలు చాలవరకు తగ్గిపోయేవి; రేషనింగ్, కంట్రోల్, రవాణానిర్బంధాలు తొలగిపోవటంతో ప్రభుత్వానికి ఖర్చు తగ్గుతుంటేది; రవాణాసౌకర్యాలు పరిశ్రమలకు ఇతోధికంగాలభిస్తూ, అధికోత్పత్తికి తోడ్పడేవి; అన్నిటికిమించి అర్థాకలితో మలమల మాడుతున్న ప్రజలకు పొట్టనిండా తిండి లభించి ప్రజల ఆరోగ్యము వృద్ధిపొంది, దేశము కలకలలాడుతూ, సుభిక్షంగా వర్ధిల్లుతుంటేది. ఇన్ని విధాల ముఖ్యమైనది కావటంవల్లనే ఆహారసమస్యను భారతప్రభుత్వము, రాష్ట్రప్రభుత్వాలు, ప్రజలుకూడా శ్రద్ధగా ఆలోచిస్తున్నారు.

ఇంతవరకు భారతప్రభుత్వం ఆహార దిగుమతులు, ఆహారధాన్య సేకరణ, పంపకము మొదలైన విషయాలపైననే తనదృష్టి కేంద్రీకరించేది. అధికాహారోత్పత్తి రాష్ట్రప్రభుత్వాల అధికారంలోదని చెప్పి, ఆవిషయం అంత పట్టించుకునేదికాదు. మన ఆహారసమస్య లాభకరంగా, సంతృప్తికరంగా, శాశ్వతంగా పరిష్కరింపబడాలంటే, దేశంలో అధికాహారోత్పత్తి జరపటంకన్న వేరొకమార్గంలేదు. ఇన్నాళ్ళనుంచి భారత ప్రభుత్వం ఆహారసమస్యను ఒక తాత్కాలిక సమస్యగా పరిగణిస్తుం

లేది; విదేశాలనుంచి ఎక్కువ దిగుమతులుజరిపి, రేషన్ తగ్గించి, పంప కంపై అజమాయిషీచేస్తే, ఆసంవత్సరానికి ఆహారంకొరత ఏర్పడదనీ, మరుసంవత్సరం పంటలు బాగా పండుతవనీ భావిస్తుండేది. ఆహారాన్ని తాత్కాలిక సమస్యగా పరిగణించటం అవివేకమని గత 3,4 ఏండ్ల అనుభవంవల్ల భారతప్రభుత్వం గుర్తించింది. ప్రతిఏటా దేశంలో ఏదో ఒక ప్రాంతంలో వానలు సరిగా కురవకపోవటం, పంటలు చెడిపోవటం, చీడపట్టటం మొదలైన అవాంతరాలు జరుగుతూనే వుంటున్నవి. ప్రతి ఏటా జనాభాకూడా దాదాపు 50 లక్షలు పెరుగుతున్నది. అందువలన ఏ సంవత్సరాని కాసంవత్సరం ఇంకా ఎక్కువ మొత్తం ఆహార ధాన్యాలు దిగుమతి చేయవలసివస్తున్నది. 1938 సంవత్సరంలో మన ఆహార దిగుమతులవిలువ రూ 13·8 కోట్లు మాత్రమే. ఈ చిన్న మొత్తపు వ్యాపారంకూడా ప్రైవేట్ వర్తకులద్వారా జరుగుతుండేది. ఇక ఇప్పుడు ఆహారధాన్యాల దిగుమతులు ఏవిధంగా పెరిగిపోతున్నదీ చూడండి.

| | ఆహారధాన్యాల దిగుమతులు<br>టన్నులు |
|---|---|
| 1943-44 | 2,98,000 |
| 1944-45 | 6,93,000 |
| 1945-46 | 9 31,000 |
| 1946-47 | 26,58,000 |
| 1947-48 | 2,40,00,000 |
| 1948-49 (అంచనా) | 4,00,00,000 |

ఇదేకాలంలో మన జనాభా 32·5 కోట్లనుంచి 33·9 కోట్లవరకు పెరిగింది. విదేశాలలో కొనే ఆహారధాన్యాలకు మనదేశంలో ధాన్యం కన్న టన్నుకు దాదాపు నూరురూపాయలు ఎక్కువధర చెల్లించాలి, రవాణాఖర్చులు భరించాలి. ఈధనంకూడా విదేశనాణాలరూపంలో

చెల్లించాలి. మనకున్న విదేశ నాణాల నిలువలు— అందులోను డాలరు నిలువలు—చాలతక్కువ. విదేశాలలో ఎక్కువధరకు కొన్నధాన్యం మనదేశంలో మనదేశధాన్యం ధరకే అమ్మి, ఆనష్టం కేంద్రప్రభుత్వం భరించాలి. 1948-49 సంవత్సరంలో విదేశాలలో ఆహారధాన్యాలు కొనటానికి రూ. 180 కోట్లు విదేశనాణాలు ఖర్చుపెట్టవలసి వచ్చింది, ఆహార సబ్సిడీలకు కేంద్రప్రభుత్వం రూ. 19.91 కోట్లు ప్రత్యేకిస్తే, వాస్తవంగా, రూ. 32.97 కోట్లు ఖర్చయింది. 1949-50 సంవత్సరంలో రూ. 32 కోట్లు సబ్సిడీలకు ఖర్చవుతుందని అంచనావేశారు.

ఆహారసమస్యను తాత్కాలిక సమస్యగా పరిగణించటం అవివేకమని భారత ప్రభుత్వం గ్రహించింది. ఈ సమస్యను శాశ్వతంగా పరిష్కరించాలంటే అధికాహారోత్పత్తి ఒక్కటే మార్గమనికూడా ప్రభుత్వం గుర్తించింది. 1948వ సంవత్సరం సెప్టెంబరు 8వ తేదీన న్యూఢిల్లీలో సమావేశమైన రాష్ట్ర ఆహారమంత్రులకు కేంద్ర ఆహార మంత్రి శ్రీ జైరామ్‌దాస్ దౌలత్‌రామ్ ఈవిషయమే నొక్కి వక్కాణించారు. వాస్తవానికి, ఆసమావేశంలో అధికాహారోత్పత్తిని గురించి మాత్రమే ఆయన మాట్లాడారు. భారతదేశం స్వతంత్రమైనతర్వాత జరిగిన ఆహారమంత్రుల ప్రథమసమావేశం ఇది. అధికారేతరుల సహాయాన్ని గ్రామపంచాయితీల, సహకార సంఘాల సహాయాన్ని తీసుకుని, 1952 సంవత్సరం నాటికైనా మనదేశాన్ని ఆహారవిషయంలో స్వయంపోషకం చేయాలని ఈ సమావేశంలో ఆలోచించారు. అధికాహారోత్పత్తి ఉద్యమాన్ని గురించి, ధరలనుగురించి, విత్తనాల సప్లయినిగురించి, ఇతర వ్యక్తుల సంస్థల సహకారాన్ని పొందటాన్నిగురించి ఈ సమావేశంలో అనేక తీర్మానాలు చేశారు.

1948 సెప్టెంబరు నాటికే దేశ ఆహారపరిస్థితి, ఇన్‌ఫ్లేషన్ పరిస్థితి ఆందోళన జనకమైనవి. ఆహార పదార్థాలపై కంట్రోల్ తొలగించిన

తర్వాత ధరలు విపరీతంగా పెరిగి, తద్వారా జీవనవ్యయం పెరిగి, జీతాలు పెంచవలసిందని ఆందోళన ప్రారంభమైంది. ఇంకొకవైపున ఆనాటికానాడు ఇన్‌ఫ్లేషన్ ప్రమాదం వృద్ధిపొందుతున్నది. ఆహారసమస్యను తాత్కాలిక సమస్యగాభావించి లాభంలేదని ప్రభుత్వం ఈ పరిస్థితులలో గ్రహించింది. ఆహారసమస్య శాశ్వతంగా పరిష్కారించటానికి దీర్ఘకాలం పడుతుంది; అంతవరకు కంట్రోల్స్, రేషనింగ్ లేకపోతే ధరలు, జీవనవ్యయము ఇంకా విపరీతంగా పెరిగిపోగలవు. అందువలన ఆహారధాన్యాల ధరలపైన, పంపకంపైన కంట్రోల్, నెమ్మదిగా తిరిగి విధించాలని సెప్టెంబరునెల మూడవవారంలో ప్రభుత్వం నిర్ణయించింది. ఆహారధాన్యాలపై కంట్రోల్ కుముందే ప్రత్తి, గుడ్డలపై కంట్రోల్ విధించారు. బియ్యము, గోధుమలు, జొన్నలు, బార్లీ, మొక్కజొన్న, రాగులు మొదలైన ముఖ్య ఆహారధాన్యాలపైన మాత్రమే కంట్రోల్ తిరిగి విధించారు. వ్యవసాయదారులనుండి ధాన్యం సేకరించేబాధ్యత రాష్ట్రప్రభుత్వాలదే; ధాన్యంధర పెంచకుండావుంచమని మాత్రం కేంద్ర ప్రభుత్వం సలహాయిచ్చింది. రాష్ట్రాలలో సేకరించిన ధాన్యానికి మణుగుకు 8 అణాలచొప్పునా, ఒక రాష్ట్రనుంచి ఇంకొక రాష్ట్రం ఎగుమతిచేసిన ధాన్యానికి మణుగుకు మరొక 8 అణాలచొప్పునా బోనస్ యివ్వటానికి కేంద్రప్రభుత్వం అంగీకరించింది.

ఇదివరకు రేషన్ తొలగించిన ప్రాంతాలలో క్రమేణా రేషనింగ్ తిరిగి ప్రారంభించటానికికూడా నిశ్చయించారు. ఈవిధంగా 1949 సంవత్సరాంతంలోగా 7 కోట్ల ప్రజలకు రేషన్ ఆహారం యివ్వవలసి వస్తుందని అంచనావేశారుగాని చివరకు దాదాపు 15 కోట్లమందిని రేషనింగ్ క్రిందకు తెచ్చారు. వీరికి సంవత్సరానికి 80 లక్షల టన్నుల ఆహారధాన్యం సప్లయిచేసేబాధ్యత ప్రభుత్వం తనపై వేసుకున్నది. వ్యాపారస్థులను, పారిశ్రామికవేత్తలను నమ్మి కంట్రోల్ తొలగించి,

వారినిజాయితీని, సహకారభావాన్ని పరీక్షించి ఆ అనుభవం పొందిన తర్వాత భారతప్రభుత్వం తిరిగి కంట్రోల్స్ విధించటం ప్రారంభించింది. కంట్రోల్స్ తొలగించకూడదని దేశంలో అనేకులు మొదటినుంచీ చెపుతూ వేస్తున్నారు. వారివాదన సరియైనదేనని చివరకు రుజువైంది.

మనదేశంలో ఆహారధాన్యాల ఉత్పత్తి, ఆహారధాన్యాలు పండిస్తున్న భూమి గత ఐదారేండ్లక్రితంనుంచికూడా ఏమంత తగ్గుదల చూపించటంలేదు. జనాభా పెరుగుదలకూడ చాల తక్కువే. అయినా ఆహారధాన్యాలకొరతమాత్రం ఆనాటికానాడు పెరిగిపోతున్నది. మనదేశంలో ఆహార ధాన్యాలపంట వివరాలు ఈక్రింద గమనించండి:

| సంవత్సరం | ఆహారధాన్యాలు పండించిన భూమి వేలఎకరాలు | ఆహారధాన్యాల పంట వేలుటన్నులు |
|---|---|---|
| 1939-40 | 166,994 | 46,038 |
| 1940-41 | 167,371 | 45,051 |
| 1941-42 | 167,049 | 43,655 |
| 1942-43 | 175,948 | 48,063 |
| 1943-44 | 178,572 | 46,622 |
| 1944-45 | 196,101 | 47,637 |
| 1945-46 | 190,939 | 43,814 |
| 1946-47 | 194,457 | 44,959 |
| 1947-48 | 185,794 | 45,643 |

ఆహారధాన్యాల ఉత్పత్తి దాదాపు ఒకేస్థాయిలో వేవున్నా, దిగుమతుల హెచ్చుతగ్గులవలనా, జనాభా పెరుగుదలవలనా సగటున వ్యక్తికి లభించే ఆహారధాన్యాలు క్రమేణా తగ్గుతున్నాయి.

| | సగటున సం. నకు వ్యక్తికి లభిస్తున్న ఆహారధాన్యాలు పౌనులు | | సగటున సం. నకు వ్యక్తికి లభిస్తున్న ఆహారధాన్యాలు పౌనులు |
|---|---|---|---|
| 1939-40 | 388 | 1943-44 | 379 |
| 1940-41 | 366 | 1944-45 | 370 |
| 1941-42 | 348 | 1945-46 | 340 |
| 1942-43 | 378 | 1946-47 | 358 |
| | | 1947-48 | 357 |

ప్రపంచంలో మరేదేశంలోకూడా ఈనాడు ప్రజలు భారతీయులంత తక్కువ ఆహారం తినటంలేదు. యుద్ధానికిపూర్వమే భారతప్రజలు రోజుకు 2 వేల కాలరీల శక్తినిచ్చే ఆహారంకన్న తక్కువ ఆహారంపై జీవిస్తుండేవారు. ఇప్పుడంతకన్న నాటికి 10-20 వంతులు తక్కువ ఆహారం వారికి లభిస్తున్నది. అంటే ఈనాడు మనప్రజలు రోజుకు 1800 కాలరీల పుష్టినిచ్చే ఆహారం మాత్రమే తింటున్నారన్నమాట. ప్రపంచంలో ప్రతిముఖ్యదేశంలోను ప్రజలు 2500 కాలరీలకుపైన పుష్టినిచ్చే ఆహారాన్ని తినగల్గుతున్నారు. చివరకు ఆక్రమిత జర్మనీ, జపాన్, ఆస్ట్రియాదేశాలుకూడా ఈవిషయంలో మనకన్న చాల మెరుగు. ఇతర దేశాలప్రజలతో పోలిస్తే భారతీయులు చాల బలహీనంగా కనపడటంలో ఆశ్చర్యమేమున్నది? మనదేశంలో జబ్బులు, అకాలమరణాలు పెరుగుతుండటంలో అస్వాభావికం ఏమున్నది?

ఇన్ఫ్లేషన్ తీవ్రసమస్యగా ఆలోచింపబడటం మొదలైనప్పటి నుంచీ ఆహారపుదిగుమతులను తగ్గించవలెననే విషయం తీవ్రంగా చర్చింపబడుతూనేవున్నది. ఆహారపరిస్థితిపై కేంద్ర పార్లమెంటులో అనేక పర్యాయాలు చర్చలుజరిగాయి. మనదేశంలో పండే ఆహారధాన్యాలు మొత్తం 450-480 లక్షలటన్నులు. మనకు ప్రతిఏటా కొరతపడుతున్నది 20-30 లక్షల టన్నులు మాత్రమే. ఈసంవత్సరం 40 లక్షల

టన్నులు దిగుమతిచేయాలని ఆలోచిస్తున్నారు. అయినా ఇది పంటే పంటలో 10-వ వంతుకూడా లేదు. దేశంలో 450 లక్షల టన్నులు ఆహారధాన్యం పండిస్తున్నప్పుడు ఇంకొక 40-50 లక్షల టన్నులు పండించలేమా? ఒకవేళ పండించగల్గితే విదేశనాణాల నిలువలు, ఇన్ ఫ్లేషన్, ధరలు మొదలైన విషయాలు మనకు ఎంత తేలిక పడిపోతవి! ఈవిషయం గ్రహించినప్పటినుంచీ, ప్రతివారు ఆహారధాన్యాల అధికోత్పత్తికి నడుంకట్టి కృషిచేయాలని ప్రచారం ప్రారంభమైంది.

భారతప్రభుత్వ ఆహారవిధానాన్ని పునర్విమర్శించి నూతన విధానాన్ని మార్చి 19-వ తేదీన పార్లమెంటులో ఆహారశాఖమంత్రి ప్రకటించాడు. 1951 సంవత్సరం నాటికి ఆహారధాన్యాలు దిగుమతులు పూర్తిగా మానివేయాలనటమే ఈనూతన విధానం సారాంశం. ఆహారధాన్యాల దిగుమతులకు విదేశనాణాలు మనం ఎక్కువ ఖర్చుపెడుతున్నాము. ఒక్క యునైటెడ్ స్టేట్స్‌నుంచి, 1948 సంవత్సరం ఏప్రిల్-డిసెంబరు నెలలమధ్య ఏడున్నరకోట్ల డాలర్లు ఖరీదుచేసే ఆహారధాన్యాలు మనం కొన్నాము. ఈసొమ్ము యంత్రసామగ్రి కొనుగోలుకు వినియోగిస్తే, మనదేశంలో పరిశ్రమలు ఇప్పటికన్న ఎంతో ముందంజ వేస్తాయి. విదేశాలలో ఆహారధాన్యాలు కొనటం ఎంతత్వరలో మానివేస్తే మనకు అంతమంచిది. తమతమ రాష్ట్రాలలో అధికాహారోత్పత్తి ఉద్యమం విరివిగా, జోరుగా సాగించి, 1951 సంవత్సరంనాటికి ఆహారధాన్యాల దిగుమతులు అవసరంలేకుండా చేయటానికి అన్ని రాష్ట్రాల ప్రతినిధులు అంగీకరించారు. దేశంలో సేకరణవృద్ధిచేసి, రేషనింగ్ ఎక్కువ ప్రాంతంలో ప్రవేశపెట్టి, ఆహారధాన్యాలు సరిగా పంపిణీచేసి, తద్వారా కొరతను రూపుమాపాలని ప్రభుత్వం సంకల్పించింది. భారత ప్రభుత్వము, రాష్ట్రప్రభుత్వాలుకూడ ఆహారం అతి ముఖ్యవిషయంగా పరిగణించి ఈ రెండు సంవత్సరాలు తీవ్రంగా కృషిచేయాలని సంకల్పించుకున్నవి.

మన దేశంలో ఇప్పుడు కొరతపడుతున్న 40 లక్షల ఆహార ధాన్యాన్ని భర్తీచేయుటానికి అధికాహారోత్పత్తి జరపాలి. ప్రస్తుతం ఆహారధాన్యాలు పండిస్తున్న భూములలో ప్రతిఎకరానికి, ఎంత ఎరువు వేసినా, ఇప్పటికన్న ఎక్కువధాన్యం పండించగలగటం కష్టం. ప్రస్తుత వ్యవసాయవిధానంతో పండించగలిగినంత పంట మనరైతు ఇప్పుడు పండిస్తూనేవున్నాడు. కాబట్టి ఇంకా ఎక్కువ ఆహారధాన్యం కావాలంటే అదనపు పొలాన్ని ఆహారధాన్యాలపంట క్రిందకు తేవాలి; ఇప్పుడు నీటి పారుదల సౌకర్యంలేని భూములకు ఆ సౌకర్యం కల్గించాలి. ఈ విషయాలలో భారతప్రభుత్వస్థానులు పరిశీలిద్దాం.

యుద్ధకాలంనుంచీకూడా అధికాహారోత్పత్తి ఉద్యమంఅంటూ ఒకటి భారతప్రభుత్వం నిర్వహిస్తూనేవున్నది. ఇందుకోసం ఇప్పటివరకు దాదాపు 16 కోట్ల రూపాయలు ఋణాలుగాను, గ్రాంట్లుగాను కేంద్రప్రభుత్వం మంజూరుచేసింది. ఈ సొమ్ముతో 50 వేల క్రొత్తబావులు త్రవ్వించారు; 70 లక్షల టన్నులు ఎరువులు, 13 లక్షల టన్నుల విత్తనాలు రైతులకు పంచారు. ఈ ఉద్యమంవల్ల 6 లక్షల ఎకరాలు కొత్తగా సాగులోనికివచ్చిందని అంచనావేస్తారుగాని అధికోత్పత్తి జరుగుతున్నట్లు కనపడదు. మొత్తంగాద ఈ ఉద్యమం విఫలమైందని అందరూ అంగీకరిస్తున్నారు.

సాగుబడికి పనికివచ్చే బంజరుభూమి అరున్నరకోట్ల ఎకరాలు మన దేశంలోవున్నదని ప్రభుత్వం అంచనావేస్తున్నది. ఇందులో 60 లక్షల ఎకరాలు 10,15 ఏండ్లలో సాగుబడిలోనికి తేవాలని ప్రభుత్వం ఆలోచిస్తున్నది. బంజరుభూమిని, మురుగుభూమిని బాగుచేసి, సాగుబడికి పనికి వచ్చేటట్లు చేయుటానికి 'సెంట్రల్ ట్రాక్టర్ ఆర్గనైజేషన్' అను ఒక సంస్థను రెండేండ్లక్రితం ప్రభుత్వం స్థాపించింది. ఈసంస్థకు కావలసినన్ని ట్రాక్టర్లు లేవు. విదేశాలలో ట్రాక్టర్లు భారీగా కొనటానికి డబ్బులేదు. ట్రాక్టర్లుకొన్నా వాటిని నడిపే నిపుణులులేరు. మిలిటరీ సహాయంతో

మొత్తంమీద ఈ నిపుణుల కొరతను గడవవచ్చును. ఈసంస్థ యాజమాన్యాన 300 పెద్ద ట్రాక్టర్లు, 250 చిన్న ట్రాక్టర్లు పనిచేస్తున్నవి. గత రెండేండ్లలోను ఈసంస్థ 2 లక్షల ఎకరాలను సాగుబడిలోనికి తెచ్చింది; 1951 సంవత్సరానికి మొత్తం 8 లక్షల ఎకరాలు సాగుబడి లోనికి తేవాలని ప్రయత్నిస్తున్నారు. ఈప్రయత్నం సఫలమై, 8 లక్షల ఎకరాల భూమి సాగుబడి అయినా, అందులో నాలుగులక్షల టన్నులు-అంటే మనకు ఏర్పడుతున్న కొరతలో 10 వ వంతుమాత్రమే— ఆహార ధాన్యం పండుతుంది. కాబట్టి ట్రాక్టర్ల కొరతను ఏవిధంగానైనా గడిచి, 1951 సంవత్సరంనాటికి కనీసం 30,40 లక్షల ఎకరాలు సాగుబడిలోనికి తెస్తేగాని, మనదేశం కావలసినంత ఆహారధాన్యం పండించలేదు.

నీరు భూమిలో లోతుగావుండి, సామాన్యబావులు పనికిరాని చోట్ల, గొట్టపు బావులద్వారా నీరు సప్లయిచేసి, ఆహారధాన్యాలు పండించవచ్చును. ఇట్టి గొట్టపు బావులు త్రవ్వటానికి 'సెంట్రల్ గ్రాండ్ వాటర్ ఆర్గనైజేషన్' ఒకటి ఏర్పాటు చేయబడింది. తూర్పు-పంజాబ్, బీహార్, యు. పి. రాష్ట్రాలలో గత మూడు సంవత్సరాలనుంచి ఈసంస్థ సాదాపు 4600 బావులు త్రవ్వినది. ఇంకా ఎక్కువబావులు త్రవ్వించటానికి కావలసిన సామగ్రి వగైరా అమెరికాలో కొనటానికి అప్పుయివ్వవలసిందని అంతర్జాతీయ బ్యాంకును ఈమధ్యనే మనప్రభుత్వం కోరింది. ఇప్పటికి ఈ నూతులవిషయంలో జరుగుతున్న కృషికూడాస్వల్పమే.

రైతులు పండించిన ఆహారధాన్యాన్ని సరిగా సేకరించి, పంపకము చేయుటముకూడా ముఖ్యమైనవిషయమే. మనదేశంలో పంపకము సరియైన పంథాలోనే జరుగుతున్నదిగాని, సేకరణ సరిగా జరగటంలేదు. ఒక్కొక్కరాష్ట్రంలో పంటలో ఎక్కువభాగం ధాన్యం సేకరింపబడుతున్నది; ఒక్కొక్కరాష్ట్రంలో చాల తక్కువభాగం సేకరింపబడుతున్నది.

| రాష్ట్రం. | పంటలో నూటికి ఎన్నివంతులు సేకరింపబడుతున్నది. |
|---|---|
| మద్రాసు | 20.8 |
| అస్సాం. | 15.0 |
| బెంగాల్. | 14.9 |
| సి. పి. | 8.7 |
| బొంబాయి. | 6.5 |
| ఒరిస్సా. | 6.4 |
| యు. పి. | 4.8 |
| బీహార్. | 2.9 |

మిగులు రాష్ట్రాలైన సి. పి., ఒరిస్సా, బీహార్‌లలో సేకరణను ఇంకా చురుకుగా జరగాలి. సేకరణ సరిగాజరిగితే యు. పి. కూడా మిగులురాష్ట్రమే అవుతుంది. అన్నిరాష్ట్రాల సేకరణ విధానాలను సమన్వయపరచి, సక్రమమార్గంలో నడిపించేటందుకు కేంద్రప్రభుత్వం పూనుకోవాలి.

రెండేండ్లలో అధికాహారోత్పత్తివిషయం ఆలోచిస్తున్నాము కాబట్టి 10,15 ఏండ్లలో పూర్తిఅయ్యే ప్రాజెక్టులవిషయం ఇక్కడ ఆలోచించడం అనవసరం. స్వల్పకాలంలో, ఒకటి రెండు సంవత్సరాలలో ఫలప్రదమయ్యే మైనర్ ప్రాజెక్టులకు అతిప్రాముఖ్యమివ్వాలి. దీర్ఘకాలపు ప్రాజెక్టులను నిర్లక్ష్యంచేయకుండా వాటిపనికూడా చురుకుగా జరిపించడం అవసరమే.

ఆహారరంగంలో 'యుద్ధం' మాటలతో ప్రకటించినంతమాత్రాన లాభంలేదు. ప్రచారంతోను, విజ్ఞప్తులతోను అవసరపుధాన్యం పండదు. భారత ప్రభుత్వం ప్రస్తుతం ఆలోచిస్తున్న ప్లానులవల్ల 1951 నాటికి కాదుకదా 1959 నాటికైనా మనం కావలసినంత ఆహారం పండించే అవకాశంలేదు. అధికోత్పత్తి కార్యక్రమం చురుకుగా, భారీగా అమలు జరగాలి. రానున్న సంవత్సరంలోనైనా భారత ప్రభుత్వం అవసరమైనంత శ్రద్ధతో ఈరంగంలో కార్యక్రమం నిర్వహిస్తుందని ఆశిద్దాము.

# కార్మిక వ్యవహారాలు

భారత కార్మికోద్యమంలో ఈ సంవత్సరం అతిముఖ్యమైన సంఘటనలు జరిగాయి. గతసంవత్సరం మన కార్మికోద్యమం ఎదుర్కొంటున్న విషమపరిస్థితి ఈ సంవత్సరం కొంతవరకు చక్కబడింది. కార్మికుల విద్యావిహీనతను, కష్టాలను అదనుగా తీసుకుని, దేశంలో కల్లోలం వ్యాపింపజేయటానికి, ప్రభుత్వాన్ని ఇరకాటంలో పెట్టి ఇబ్బంది పెట్టటానికి ప్రయత్నించిన కమ్యూనిస్టుల పలుకుబడి, కార్మికవర్గంలో దాదాపు పూర్తిగా నశించిపోయిందని చెప్పవచ్చును. భారతకార్మికోద్యమాన్ని కార్మికుల శ్రేయోభివృద్ధికి అనుగుణంగా, దేశంలో ప్రజాస్వామ్య పరిపాలన స్థాపనకు దోహదంచేసేవిధంగా నిర్వహించ దలచుకున్న కార్మికసంస్థలు ఇప్పుడిప్పుడే పైకివస్తున్నాయి. భారత కార్మికోద్యమం చరిత్రలో ఈసంవత్సరం ఒక నూతన అధ్యాయం ప్రారంభమైందని చెప్పవచ్చును. మొన్న మొన్నటివరకు భారత కార్మికులకు ఏకైకప్రతినిధి సంస్థగావున్న అఖిలభారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ దాదాపు పూర్తిగా పాతిపెట్టబడింది. భవిష్యత్తులో కార్మికుల జీవితాలలోను, రాజకీయరంగాలలోను అతిప్రాముఖ్యం వహించగల సంస్థలు ఈసంవత్సరమే స్థాపించబడి, ఇప్పుడిప్పుడే బలం చేకూర్చుకుంటున్నాయి. అంతర్జాతీయ రంగంలోకూడా ఈ సంవత్సరం మన కార్మికోద్యమం ప్రాముఖ్యత పొందింది.

భారతదేశంలో ఏడెనిమిది కోట్లమంది కార్మికులువున్నా వీరిలో ఒకకోటికి లోపుమాత్రమే పట్టణాలలో పనిచేసే ఫ్యాక్టరీ కార్మికులు. తక్కినవారందరు గ్రామాలలో చెల్లాచెదురుగావున్న వ్యవసాయ కార్మికులు. ఆధునిక పెట్టుబడి దారీతత్వము వీరిపై తన ప్రభావాన్ని ఎక్కువగా చూపించటంలేదు. గ్రామాల కట్టుబాట్లుకూడ పూర్తిగా

నడలేకపోలేదు. అందువలన వ్యవసాయకార్మికులను సంఘటితపరచి, వీరిలో ట్రేడ్ యూనియన్ భావాలు వ్యాపింపజేయవలసిన అవసరం గాని, అవకాశంగాని ఇంతవరకు సరిగా గుర్తింపబడలేదు. ఇకముందు ఈవిషయం అతిజాగ్రత్తగా ఆలోచింపవలసివుంటుంది. పట్టణాలలోని కార్మికులుకూడా నిరక్షరాస్యులే అయినా కాపిటలిజం స్వభావాన్ని ప్రత్యక్షంగా, తమ అనుభవంద్వారా వారు తెలుసుకుంటున్నారు. అందువల్ల వారిలో ట్రేడ్ యూనియన్ భావాలు త్వరగా, తేలికగా వ్యాపింపచేయవచ్చును; సుసంఘటిత పరచవచ్చును. కాని వారు నిరక్షరాస్యులు కావటంవలన తాము సుసంఘటితులై ఏపంథాననుసరించవలసిందీ స్వయంగా నిర్ణయించుకోలేని నిస్సహాయస్థితిలో వుండి, స్వలాభాపేక్షపరుల మాయావాగురిలో చిక్కుకుపోయి తాము కష్టాలు పడి, దేశానికి కష్టంకలిగిస్తారు. మనదేశం స్వతంత్రమైన తర్వాత ఈ ప్రమాదం మరింత హెచ్చిపోయింది. కాంగ్రెస్, సోషలిస్టు నాయకులు జైలులోవుండగా ట్రేడ్ యూనియన్ ఉద్యమాన్ని కమ్యూనిస్టులు వశపరచుకున్నారు. అప్పుడు కమ్యూనిస్టులు ఆ ప్రభుత్వాన్ని బలపరుస్తున్నారు కాబట్టి ట్రేడ్ యూనియన నాయకత్వం కమ్యూనిస్టులు పొందటాన్ని ప్రభుత్వం హర్షించింది. ఆప్రభుత్వంమారి, స్వతంత్రభారత ప్రజాప్రభుత్వం ఏర్పడటంతో కమ్యూనిస్టుల వైఖరి మారింది. కాంగ్రెస్ ప్రభుత్వాలపట్ల ప్రజలలో అగౌరవము, అసంతృప్తి వ్యాపింపచేసి తద్వారా తమ ప్రాబల్యం వృద్ధిచేసుకోవాలని వీరు ప్లానువేసి, తమ చేతిలోవున్న ట్రేడ్ యూనియన్ ఆయుధాన్ని ప్రయోగించి, దేశమంతట సమ్మెలు జరిపించారు. అప్పటినుంచి, అప్పటివరకు ఏకముఖంగా నడుస్తున్న కార్మికోద్యమం విచ్ఛిన్నంకావటం ప్రారంభమైంది.

అఖిలభారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ బలము, పలుకుబడి క్రమేణా తగ్గిపోతూ, అఖిలభారత జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ ఆ స్థానాన్ని ఆక్రమిస్తున్నది. అ. భా. జా. ట్రే. కాంగ్రెస్

భారత ప్రభుత్వ అనుయాయసంస్థగా పనిచేస్తూ, కార్మికుల శ్రేయస్సు కొరకు శక్తివంచనలేకుండా పనిచేయటంలేదని కొందరు భావిస్తున్నారు. భారత ప్రభుత్వం ఎక్కువగా పెట్టుబడిదారీవర్గాన్ని అనుసరిస్తున్నది కాబట్టి కార్మికవర్గం ప్రయోజనాలు కొంతవరకు, కొన్ని సమయాలలో అడుగున పడిపోతున్నవి. ఇందుకు కార్మిక నాయకులందరు అంగీకరించరు. కాంగ్రెస్ విధానాలతో అంగీకరంపని కార్మిక నాయకులు చాల మంది వున్నారు. వారు అ. భా. జా. ట్రే. కాంగ్రెస్‌లో చేరలేక పోతున్నారు. అ. భా. ట్రే. కాంగ్రెస్ నుండి, దాని కమ్యూనిస్టు విధానాలవల్ల విసుగుకొంది బయటికి వచ్చివేసి, అ. భా. జా. ట్రే. కాంగ్రెస్‌లో చేరటం ఇష్టంలేని కార్మిక నాయకులందరు కలసి వేరొక 'యునైటెడ్ ట్రేడ్స్ యూనియన్' ను ఏర్పరచాలని ప్రయత్నించారు. కాంగ్రెస్ నుండి అప్పుడే బయటకువచ్చిన సోషలిస్టులుకూడా ఈసంస్థలో చేరుతారేమోనని సమాలోచనలు జరిగినవి కాని అవి జయప్రదంకాలేదు. అందువల్ల అప్పటికి ఆ ప్రయత్నం విరమించవలసి వచ్చింది.

కాంగ్రెస్ నుండి బయటకు వచ్చివేసిన సోషలిస్టులు తామొక కార్మిక సంస్థను ప్రత్యేకంగా ఏర్పరచుకోవాలని గతసంవత్సరంనుంచి ప్రయత్నిస్తూనే వున్నారు. సోషలిస్టుపార్టీకి చెందనివారితో కలిసి కార్మికసంస్థను స్థాపించటానికి వీరు ఆదినుంచి అంగీకరించటం లేదు. కాంగ్రెస్‌కు అనుబంధ సంస్థగా, మొదటినుంచీ, ఒక కార్మిక సంస్థ లేకపోవటంవలన కార్మిక రంగంలో కాంగ్రెస్‌కు మొన్న మొన్నటివరకు ఎంత తక్కువ పలుకుబడి వుండేదో సోషలిస్టులకు తెలుసును. భవిష్యత్తులో భారత రాజకీయాలలో కార్మికులు చాల ప్రాముఖ్యత వహిస్తారు. రాజకీయపార్టీగా పైకిరావలెనని ప్రయత్నిస్తున్న సోషలిస్టులు కార్మికవర్గాలను ఇప్పటినుంచి తమపంథాలో నడిపించవలెనని ప్రయత్నించటం సమంజసం. సోషలిస్టులకు ప్రత్యేక కార్మికసంస్థ లేనిదే, కార్మిక వర్గాలలో సోషలిస్టుపార్టీ ప్రచారం జరగదు. కాబట్టి ఇతరులతో కలసి కార్మికోద్యమంలో పనిచేయ

టానికి సోషలిస్టులు ఎన్నడూ అంగీకరించటంలేదు. ఈ భావాలుగల కార్మిక నాయకులు కలకత్తాలో డిసెంబరు 26 వ తేదీన సమావేశమై హింద్ మజ్‌దూర్ సభ అను పేరుతో ఒక కార్మికసంస్థను స్థాపించారు. జయప్రకాశ్ నారాయణ్, అరుణ అసఫ్ అలీ, అశోక్ మెహతా, పురుషోత్తందాస్ త్రికందాస్ మొదలైన సోషలిస్టునాయకులు ఈసభకు వచ్చారు. కార్మిక జనశ్రేయోభివృద్ధికి పాటుపడటానికి, ముఖ్యంగా, కార్మికులందరికి జీవితభృతికి సరిపోయే కూలి లభింపజేయటానికి, ప్రతి పౌరుడికి పని లభింపజేయటానికి, సామాజిక రక్షణలు, వైద్య సౌకర్యము మొదలగు 'సోషల్ సెక్యూరిటీ' సౌకర్యాలు లభింపజేయటానికి, కార్మికులకు విశ్రాంతి, సెలవలు, మంచి వసతులు, ఇండ్లు, కార్మికుల పిల్లలకు విద్యాసౌకర్యాలు మొదలైనవి లభింపజేయటానికి, ట్రేడ్ యూనియన్ హక్కులు కాపాడటానికి ఈసంస్థ కృషిచేస్తుందని ఒక ప్లాను తయారుచేశారు.

కమ్యూనిస్టు నాయకత్వాన నడుస్తున్న అ. భా. ట్రే. కాంగ్రెస్ దేశవ్యతిరేక విధానా లనుసరించటంతో, అ. భా. జా. ట్రే కాంగ్రెస్ ప్రభుత్వ అనుబంధసంస్థగానడుస్తూ కార్మికుల అవుసరాలకన్న ప్రభుత్వ విధానాలకు ఎక్కువ ప్రాముఖ్యత యిస్తుండటంతో కార్మికులకు నాయకత్వంవహించి, సరియైనత్రోవలో నడిపించి, ప్రజాస్వామ్యానికి దేశ శ్రేయోభివృద్ధికి కృషిచేసే కార్మికసంస్థ ఒకటి అవుసరమైంది. కొత్తగా సోషలిస్టులచే స్థాపించబడిన హింద్ మజ్‌దూర్ సభ ఈఅవుసరాన్ని తీర్చగలుగుతుందని ఆశించవచ్చును. అట్లయితే, భవిష్యత్తులో అ. భా. జా. ట్రే. కాంగ్రెస్, హింద్ మజ్‌దూర్ సభలకు కార్మికనాయకత్వంవిషయంలో తీవ్రమైన పోటీ ఏర్పడుతుంది. అ. భా. జా. ట్రే. కాంగ్రెస్ తన విధానాలను కొంతవరకైనా సవరించుకుని అతివాదధోరణి నవలంబించి, కాంగ్రెస్ ప్రభుత్వాలచే కార్మికశ్రేయస్కరకార్యాలు ఇతోధికంగా చేయించలేకపోతే దానిప్రతిష్ట తగ్గిపోతుంది.

అసలే నశించిపోతున్న అ. భా. ట్రే. కాంగ్రెస్ సంస్థ దాని కార్యదర్శి యన్. యం. జోషీ రాజీనామాతో పూర్తిగా కూలిపోయింది. భారతకార్మికోద్యమానికి జీవితం ధారపోసిన వారిలో శ్రీ జోషీ ముఖ్యుడు. ఆయన వ్యక్తిగత ప్రతిభ, పలుకుబడివల్లనే ఆసంస్థ ఇప్పటివరకు నిలబడివుండగల్గినది. అ. భా. ట్రే. కాంగ్రెస్ కమ్యూనిస్టుల ఆధ్వర్యాన వుండి, దేశవిద్రోహాకరచర్యలు జరుపుతుంటే కమ్యూనిస్టులుగాని కార్మిక నాయకులు ఒక్కొక్కరు అందునుంచి తప్పుకున్నారు. శ్రీ రూయికర్, శ్రీ మృణాలకాంతిబోస్, శ్రీ కె. టి. షా, శ్రీ జోషీ మొదలైనవారు ఈవిధంగానే ఆసంస్థనుంచి రాజీనామా లిచ్చారు. కాని తమ జీవిత మంతా కార్మికజనశ్రేయోభివృద్ధికి కృషిచేస్తున్న వీరు, అటు అ. భా. జా. ట్రే. కాంగ్రెస్‌లోగాని ఇటు హింద్ మజ్దూర్ సభలోగాని చేర టానికి ఇష్టపడలేదు. రాజకీయాలకు అతీతంగా వుండి, కేవలం కార్మికుల శ్రేయోభివృద్ధికే పాటుబడే కార్మికసంస్థను స్థాపించాలని వీరు చాల రోజులనుండి ప్రయత్నిస్తున్నారు. సోషలిస్టులు తమతో కలసిరాదని తెలిసిపోయినతర్వాత ఇట్టి నాయకులందరు ఆలోచించి, మేనెల రెండవ వారంలో కలకత్తాలో సమావేశమై ఒక ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్‌ను స్థాపించారు. ఈ సమావేశానికి కిసాన్ నాయకుడు స్వామి సహజానందసరస్వతి అధ్యక్షత వహించాడు. నూతన కార్మికసంస్థ అధ్యక్షుడుగా శ్రీ కె. టి. షా, కార్యదర్శిగా శ్రీ మృణాలకాంతి బోస్‌గారలు ఎన్నుకోబడ్డారు. రాజకీయాలకు అతీతంగా వుండి కృషిచే యాలని వీరు తీర్మానించుకున్నారు గాని ఆసమావేశంలో ముఖ్యంగా రాజకీయాలే చర్చించారు. ఈ సంస్థకు ఎంతపలుకుబడి లభిస్తుందో, కార్యరూపంలో ఇది ఏ విధానాన్ని అనుసరిస్తుందో చూడవలసివున్నది.

అఖిలభారతజాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ వార్షిక సమావేశం ఇండోర్‌లో మే రెండవవారంలో జరిగింది. భారతప్రభు త్వాన్ని, ప్రభుత్వవిధానాలను సమర్థిస్తూ, జయపూర్ కాంగ్రెస్‌లో చేసిన తీర్మానాలవంటివే, దాదాపు 17 తీర్మానాలు చేశారు,

అఖిలఆసియా కార్మికసమాఖ్యను ఏర్పరచటానికి అ. భా. జా. ట్రే. కాంగ్రెస్ ముందంజవేసింది. పాకిస్థాన్, బర్మా, చైనా, ఇండో నీసియా, ఫిలిప్పైన్స్, పశ్చిమాసియా దేశాల కార్మిక ప్రతినిధులను ఆహ్వానించి, సమావేశపరచి, అఖిల ఆసియా కార్మికసమాఖ్యను ఏర్పరచేవిషయమై, ఈసంస్థ ఆధ్వర్యాన, సంప్రదింపులు జరిగాయి. అఖిల ఆసియా కార్మిక సమాఖ్య ఏర్పరచటానికి నిర్ణయము జరిగింది.

అంతర్జాతీయ కార్మికసంస్థ అధ్యక్షునిగా భారతప్రతినిధి శ్రీ శ్యాంధరీలాల్ ఎన్నుకోబడినాడు. ఈయన భారతప్రభుత్వ కార్మిక శాఖకు కార్యదర్శి. అంతర్జాతీయ కార్మికసంస్థ ఆసియారాజ్యాల కార్మిక సమస్యలపట్ల చాల శ్రద్ధవహిస్తున్నదనుటకు ఇది మరొక నిదర్శనము. అంతర్జాతీయ కార్మికసంస్థ, ఆసియా ప్రాంతీయసభ వచ్చేసంవత్సరం తిరిగి మనదేశంలో సమావేశమవుతుంది.

కార్మికుల శ్రేయోభివృద్ధికి గతసంవత్సరం జరిగిన చట్టాలు ఈ సంవత్సరం కొంతవరకు అమలులోనికి వచ్చాయి. కార్మికులకు ప్రభుత్వ భీమాసంస్థకు గవర్నర్ జనరల్ రాజాజీ అక్టోబరు 6 వ తేదీన ప్రారంభోత్సవం జరిపాడు. ఈసంస్థవల్ల 20 లక్షలమంది కార్మికులకు సౌకర్యాలు లభిస్తవని అంచనావేస్తున్నారు. ఈసంస్థ స్కీములు, ముందుగా అజ్మీర్, మార్వారాలలో ప్రవేశపెట్టి, ఆ అనుభవాన్ని పురస్కరించుకుని మార్పులు జరుపుకుంటూ క్రమేణా, దేశమంతటికి వ్యాపింపజేయాలని నిశ్చయించారు.

బొగ్గుగనులలో పనిచేసే కార్మికులకు ప్రావిడెంట్ ఫండ్ ద్వారా సౌకర్యాలు కలుగజేసే చట్టం ఈ ఏడు అమలులోనికి వచ్చింది. ఫ్యాక్టరీల చట్టం (సవరణచట్టం) కూడా ఏప్రిల్ 1 వ తేదీన అమలులోనికి వచ్చింది. ఇదివరకటినుంచి అమలులోవున్న ఫ్యాక్టరీ చట్టాలనన్నిటిని సమీకరించి, ఒక చట్టముగా తయారుచేసి, కొన్ని ముఖ్యమైన కొత్త

మార్పులుచేసి. ఈచట్టం తయారు చేశారు. 10 మందికన్న ఎక్కువ కార్మికులు పనిచేసే ప్రతిఫ్యాక్టరీకి ఈచట్టం వర్తిస్తుంది. ఫ్యాక్టరీ నిర్మాణము, కార్మికులకు సౌకర్యాలు ఏర్పరచటము, పిల్లలను ఫ్యాక్టరీలలో పనికిపెట్టుకోకుండా నిరోధించటము మొదలైన విషయాలలో యజమానులపై ఇతోధికంగా బాధ్యతలు పెట్టబడినవి.

పరిశ్రమల లాభాలు కార్మికులు యజమానులు పంచుకునే విషయం ఆలోచించటానికి ఏర్పరచినసంఘం, ప్రత్తిబట్ట, జనపనార, ఇనుము, ఉక్కు, సిమెంటు రబ్బరుటైర్లు, సిగరెట్లు పరిశ్రమలలో ఈ స్కీము ప్రవేశపెట్టాలని సూచించారు. ఉత్పత్తి అధికంచేయటానికి, పారిశ్రామిక రంగంలో తగాదాలు రాకుండా చేయటానికి, కార్మికులకు న్యాయం చేయటానికి ఇటువంటి స్కీము అవసరమనీ, తేలికగా అమలు జరుప వచ్చుననీ ఈసంఘం సూచించింది. ఈసంఘ అధ్యక్షుడు భారత ప్రభుత్వ పరిశ్రమలశాఖ కార్యదర్శియే అయినప్పటికీ ఈ నివేదికను ప్రభుత్వం ఆమోదించి, వెంటనే ఆచరణలో పెట్టేటట్లు కనపడటంలేదు.

యజమానులు-కార్మికులకు సామరస్య మొనకూర్చి, వారు పరస్పర సహకారముతో అధికోత్పత్తికి కృషిచేయటానికిగాను దోహదం చేసేటందుకు కేంద్రసలహా సంఘమొకటి ఈఏడు స్థాపించారు. పరిశ్రమలలో కార్మికులకు జీతాలు నిర్ణయించటంలోను, పెట్టుబడిపై సమంజసమైన లాభములను నిర్ణయించటంలోను, అధిక లాభాలలో 'రిజర్వు' నిధిగా వుంచవలసిన మొత్తము, కార్మికులకు యివ్వవలసిన మొత్తము నిర్ణయించటంలోను, కార్మికులు-యజమానులు పరస్పర సహకారంతో వ్యవహరింగటానికి వీలుగా వారి సంబంధాలు నిర్ణయించటంలోను ప్రభుత్వానికి ఈసంఘం సలహాయిస్తుంది. ఈ సంఘంలో కార్మికుల ప్రతినిధులు, పెట్టుబడి దారుల ప్రతినిధులు, ప్రభుత్వ ప్రతినిధులు పాల్గొంటారు.

ముఖ్యమైన, కీలక పరిశ్రమలలో కమ్యూనిస్టు ప్రేరిత కార్మికులు ఒక్కమారుగా సమ్మెలు ప్రారంభించనున్నారని ఫిబ్రవరి నెలలో ప్రభుత్వానికి తెలిసింది. ఆ పరిశ్రమలలో సమ్మెలుచేయరాదని శాసిస్తూ ఒక చట్టం చేయాలని భావించి ప్రభుత్వం ఒకబిల్లును తయారుచేసింది. ఈబిల్లు శాసనసభలో చాల విమర్శకు గురిఅయింది. ఇది శాసనమైవుంటే భారతప్రభుత్వపు ప్రతిష్ట చాల దెబ్బతినేది. దేశంలో ఒక్కమాటుగా సర్వవ్యాప్త సమ్మె ప్రారంభించి, కమ్యూనిస్టులు విధ్వంసచర్యలకు పూనుకుంటే అది ఏమాత్రము సాగనివ్వమని కార్మిక నాయకులు ప్రభుత్వానికి నచ్చచెప్పినతర్వాత ఈబిల్లు ఉపసంహరించుకున్నారు.

ఈ సంవత్సరం భారత ప్రభుత్వ కార్మికశాఖ చెప్పుకోతగ్గంతగా ఏమీ సాధించకపోయినా, కార్మిక వ్యవహారాలు మాత్రం గతసంవత్సరంకన్న ఆశాజనకంగా వున్నాయి.

# దేశరక్షణ

భారతదేశ సరిహద్దుల రక్షణ, అంతరంగిక శాంతి భద్రతలరక్షణ ఈ నాడు ఇదివరకెన్నడు లేనట్టి ప్రాముఖ్యత వహిస్తున్నవి. భారతదేశ నైసర్గిక సరిహద్దులలో ఒక పరాయిరాజ్యం—భారతదేశంపట్ల ద్వేష భావంతో వ్యవహరించటమే తన విధానంగా పెట్టుకున్నదేశం—నూతనంగా సృష్టింపబడటంవలననూ, దేశ పూర్వోత్తర సరిహద్దులలోనున్న చైనా కొత్తగా కమ్యూనిస్టుల చేతులలోకి మారుతూ, మనదేశంలోనికి వారిప్రాబల్యం చొచ్చుకువచ్చే అవకాశము వుండటంవల్లనూ దేశసరిహద్దుల రక్షణనుగురించి మనం తీవ్రంగా ఆలోచించవలసి వస్తున్నది. దేశంలో ఏకపక్ష ప్రజాప్రభుత్వం ఏర్పడటంతో దానిని కూలదోసి, అధికారాన్ని హస్తగతం చేసుకోవాలని కొందరూ, దానిని చికాకుపెట్టి తమ ప్రయోజనాలు సాధించుకుంటూ తమబలం, ప్రాబల్యం వృద్ధిచేసుకోవాలని కొందరు ప్రయత్నిస్తూ, దేశశాంతికి మాటిమాటికి భంగం కలిగిస్తూండటంవల్ల దేశ అంతరంగికశాంతి విషయంకూడా శ్రద్ధగా ఆలోచించవలసి వస్తున్నది. దేశ రక్షణకు బాధ్యత వహించవలసిన దేశసైన్యము కొత్తగా ఏర్పడుతున్న ఈ ప్రమాదాలను జయప్రదంగా ఎదుర్కొని మనదేశ స్వాతంత్ర్యాన్ని రక్షించగల స్థితిలోవున్నదా అనే విషయం ప్రతి భారతీయుడు ఇప్పుడు తీవ్రంగా ఆలోచించవలసి వస్తున్నది.

ప్రస్తుతం దేశరక్షణ విషయంలో మనం ఎదుర్కొనవలసిన ప్రమాదాలను, మనదేశ నైసర్గిక స్థానాన్ని, ప్రపంచరాజ్యాలలో మన దేశం ఆక్రమిస్తున్న స్థానాన్ని, ప్రస్తుత ప్రపంచపరిస్థితులను దృష్టిలో వుంచుకుని మనదేశసైన్యం మన అవుసరాలకు తగినట్లుగా—సంఖ్యాబలంలోగాని, శస్త్రబలంలోగాని—వున్నదా అని ఆలోచిస్తే, లేదనే

జవాబు చెప్పవలసివుంటుంది. మనదేశ సైనికశక్తి ఇప్పటికన్న ఎన్నో రెట్లు వృద్ధిపొందితేగాని ప్రపంచరాజ్యాలు మనదేశాన్ని గౌరవించవు; మన విధానాలను ఆదరించవు. మన సైనికశక్తి చాల బలహీనంగావుండ టంవల్లనే మనకు ప్రపంచంలో లభించవలసిన స్థానాన్ని పొందలేకుండా వున్నాము.

మనదేశ సైనికశక్తిని—సంఖ్యాబలాన్ని, శస్త్రబలాన్ని—వృద్ధి చేయటానికి మన ప్రభుత్వం గతసంవత్సరం చాల ఎక్కువ ప్లానులు తయారుచేసింది. ఈ ప్లానులు ఇంతవరకు కార్యరూపంలో చెప్పకో తగినంతగా అమలు జరగటంలేదు. 'నేషనల్ వార్ ఎకాడమీ'ని స్థాపించారు. అది సరియైనస్థితిలోనికి వచ్చేటప్పటికి ఇంకా కొంతకాలం పట్టుతుంది. ఇదివరకు యూనివర్సిటీ ఆఫీసర్స్ ట్రైనింగ్ కోర్ గావున్న దానిని 'నేషనల్ కాడెట్ కోర్'గా మార్చారు. అంతకన్న అంతులో అభివృద్ధిగాని మార్పుగాని ఏమీ జరగలేదు. ప్రాంతీయ పౌరసైన్యాల నిర్మాణం ఇంకా ఆలోచనలోనే వున్నది. దేశ ఆంతరంగిక శాంతి రక్షణకు ఈ సమయంలో ప్రాంతీయ పౌరసైన్యం ఎంతో సహాయకారంగా వుంటేది. ఈవిషయం గుర్తించి కూడా ప్రభుత్వం ఈ సైన్యాన్ని త్వర త్వరగా నిర్మించటానికి వృద్ధిచేయటానికి ఏర్పాట్లు చేయటంలేదు.

భారతసేనను జాతీయంచేసి, సైనికాధికారులుగా భారతీయులనే నియమించే కార్యక్రమం దాదాపు పూర్తిఅయింది. 1947 ఆగస్టు 15 వ తేదీకి పూర్వం మన సైన్యంలో దాదాపు 8 వేలమంది బ్రిటిష్ ఉద్యోగులు ఉంటేవారు; ఇప్పుడు 200 మంది కూడాలేరు. భారతదేశ చరిత్రలో తొలిపర్యాయం భారతీయుడు సేనాధిపతి అయ్యాడు. భారత సర్వసేనాధిపతిగా జనవరి 15 వ తేదీన జనరల్ కరియప్ప అధికారం స్వీకరించాడు.

భారత సైన్యానికి కొత్తజెట్ విమానాలు, డెస్ట్రాయర్లు, క్రూయిజర్లు మొదలైన ఆధునిక పరికరాలు కొంటున్నారు. మనదేశంలోనే

వాటిని తయారుచేసే ఫ్యాక్టరీలు నిర్మించే ఏర్పాట్లు ఏమీ జరగటంలేదు. ఇప్పుడున్న ఒక్క నౌకానిర్మాణ కేంద్రంకూడా ప్రభుత్వ సహాయాన్ని పొందలేక పోతున్నది. ఇంకా చాల నౌకానిర్మాణ కేంద్రాలు నిర్మిస్తే గాని మనదేశ వ్యాపారానికి, నౌకాదళానికి కావలసిన నౌకలు మన దేశంలో నే నిర్మించుకోలేము. బెంగుళూరులోని హిందుస్థాన్ ఎయిర్ క్రాఫ్ట్ ఫ్యాక్టరీలో పూర్తివిమానం త్వరలో నే తయారవుతుంది. ఇటు వంటి ఫ్యాక్టరీలు ఇంకా చాలా నిర్మిస్తే నేగాని మన సైన్యానికి కావల సినన్ని విమానాలు మన దేశంలో ఉత్పత్తికావు.

వైమానికులకు, నావికులకు బ్రిటన్‌లో తర్ఫీదు యిప్పించి వివిధరకముల విమానాలను, నౌకలను నడుపుటకు వారిని సమర్థు లను చేస్తున్నారు. విమానములు, నౌకలు నిర్మించే ఇంజనీర్లుగా కూడా కొద్దిమంది భారతీయులు తర్ఫీదు పొందుతున్నారు. ఇంకా చాల ఎక్కువమందికి ఇటువంటి తర్ఫీదు యిప్పించితేగాని మన అవసరాలకు తగినంతమంది భారతీయ ఇంజనీర్లు దొరకరు. మిలిటరీ ఇంజనీరింగ్ స్కూలు ఒకటి, మిలిటరీ మెడికల్ స్కూల్ ఒకటి, డిఫెన్సు సైన్సు ఆర్గనైజేషన్ ఒకటి, ఎయిర్ ఫోర్సు అండ్ నావల్ టెక్నికల్ స్కూల్ ఒకటి మనదేశంలో నే స్థాపించటానికి ఏర్పాట్లు, చాల నెమ్మదిగా, జరుగుతున్నాయి. ఆయుధసామగ్రి ఉత్పత్తికి కొత్తఫ్యాక్టరీలు ఏవీ స్థాపించబడటంలేదు. ఆయుధసామగ్రికి, ఇదివరకటివలెనే, మనం విదే శాలపైననే ఆధారపడి వుండవలసివస్తున్నది.

భారత ప్రభుత్వాదాయంలో నూటికి 48·7 వంతులు దేశ రక్షణకు వినియోగిస్తున్నారు. ఇంత ఎక్కువ మొత్తము ఖర్చుచేస్తున్నా సంఖ్య విషయంలో గాని, సంపత్తి విషయంలోగాని మనసైన్యం మనదేశ అవసరాలకు తగినట్లుగా లేదు. సైనికశాఖ ఖర్చుకుతగ్గ ఫలితం కనపడే ట్లుగా వ్యవహరించటం ఇకముందైనా నేర్చుకోవాలి.

# రాజ్యాంగ పరిషత్తు

భారతదేశమంతట ప్రజలందరు నూతన రాజ్యాంగచట్టం ఎప్పుడు అమలులోకి వస్తుందా, వయోజన వోటింగ్ పద్ధతులపై కొత్తఎన్నికలు జరిగి, ప్రజాప్రభుత్వాలు ఎప్పుడు ఏర్పడుతవా అని ఆతృతతో ఎదురు చూస్తున్నారు. స్వతంత్ర భారతదేశం తనకొక రాజ్యాంగచట్టం తయారుచేసుకుని, రిపబ్లికన్ దేశమై ప్రపంచ సభలలో సర్వస్వతంత్ర హోదాతో వ్యవహరించటం ఇంకెన్నాళ్ళకు చూడగలమాఅని అందరూ వేచివున్నారు. నూతనరాజ్యాంగచట్ట నిర్మాణం పూర్తిగాని, భారతదేశం రిపబ్లిక్ అయితేగాని బ్రిటిష్ సామ్రాజ్య బానిసబంధాలు పూర్తిగా తెగిపోయినట్లు కాదని, కాంగ్రెస్ గత 60 ఏండ్లనుండి చేసినకృషి సార్థకమైనట్లు కాదనీ మనం భావిస్తున్నాము. రాజ్యాంగచట్ట ముసాయిదా గతసంవత్సరమే తయారైనా, దానిని రాజ్యాంగ పరిషత్తు ఇంకా ఆమోదించలేదు; ఆచట్టం ఆమోదించిన తర్వాత దానిప్రకారం ఎన్నికలు జరిగి నిజమైన ప్రజాప్రభుత్వాలు అధికారానికి వచ్చేటప్పటికి ఇంకా కనీసం రెండేళ్ళయినా జరిగిపోయేటట్లున్నది.

రాజ్యాంగపరిషత్తు 1948 నవంబరు 4 వతేదీన సమావేశమైనప్పుడు రాజ్యాంగ చట్టముసాయిదా చర్చకు దాఖలుచేయబడినది. ఈ సమావేశము జరపవలెనని ఏప్రిల్ నెలనుండి ప్రయత్నిస్తూ, ఎప్పటికప్పుడు వాయిదావేస్తూ వచ్చారు. అప్పటికే దాదాపు 10 నెలలనుంచి రాజ్యాంగచట్టం ప్రజలఎదుట వున్నది. ఆ చట్టాన్ని విమర్శించటము, సమర్థించటము ఎన్నాళ్ళక్రితమో జరిగిపోయింది. అప్పుడు రాజ్యాంగ పరిషత్తు సమావేశమై, ఆ ముసాయిదాను చర్చించటం మొదలుపెట్టింది. ముసాయిదా చట్టానికి వేలసంఖ్యలో సవరణలు ప్రతిపాదించబడినవి. వీటిలో ప్రతిసవరణను రాజ్యాంగపరిషత్తు చర్చించ పూనుకుంటే, ఇంకొక

దశాబ్దంవరకు మన రాజ్యాంగచట్టం పూర్తికాదు. కాబట్టి ఈ సవరణల నన్నిటిని క్రోడీకరించి, ముఖ్యమైన కొద్ది సవరణలు మాత్రమే పరిషత్తు సభలో చర్చించి, త్వరత్వరగా చర్చముగించి, 1948 సంవత్సరం ఆఖరు నైనా రాజ్యాంగచట్టం పూర్తిగా ఆమోదించాలని భావించారు. కాని అది సాగలేదు. ఎన్నిసవరణలు చర్చించబడకపోయినా 815 నిబంధనలు రెండునెలలలో ఆమోదించటం సాధ్యంకాదు. అదినివేళ పార్లమెంటు బడ్జెట్ సమావేశం పూర్తిఅయినతర్వాత మే 16 వతేదీన రాజ్యాంగపరిషత్తు తిరిగి సమావేశమైంది. కాని ఈ సమావేశంలోకూడా రాజ్యాంగ చట్టంపై చర్చలు పూర్తికాలేదు. ఇప్పుడు రాజ్యాంగ పరిషత్తు మరల సమావేశమై చర్చలు జరుపుతున్నది. 1949 ఆగస్టు 15 వతేదీనాటికి రాజ్యాంగచట్టం పూర్తిగా ఆమోదం పొందదు. ఈ సంవత్సరాంతం లోగానే ఈచట్టం పూర్తిగా ఆమోదింపబడి, అటుతర్వాత వెంటనే అమలులోనికి రాగలదని ఆశించవచ్చును. అప్పటితో రాజ్యాంగ పరిషత్తు కార్యక్రమము పూర్తిఅయి పరిషత్తు తన్నుతానే రద్దుచేసుకొనవచ్చును.

భారతదేశంలో జేరేసంస్థానాలన్నీ విదేశాంగవ్యవహారాలు,రక్షణ రాకపోకలు అనుమూడు విషయాలపైననే భారత ప్రభుత్వానికి అధికారం దఖలుపరచాలని ముందు అంగీకృతమైంది. సంస్థాన ఏకీకరణ ప్రారంభమై, చిన్న సంస్థానాలు రాష్ట్రాలలో కలిసిపోవటము, సంస్థాన యూనియన్ లుగా ఏర్పడటము ప్రారంభమైన తర్వాత సంస్థానాలు అన్నివిషయాలలోను రాష్ట్రాల స్థాయికి రావలెననే వాదము ప్రారంభమైంది. సంస్థాన యూనియన్‌లు, ఒక్క పన్నుల విధానంలో తప్ప తదితర అన్ని విషయాలలోను రాష్ట్రాలస్థాయికి రావటానికి అంగీకరిస్తూ ఒడంబడికలపై సంతకాలుచేశాయి. పెద్ద సంస్థానాలు కూడా ఇటువంటి ఒడంబడికలకు అంగీకరించాయి. అన్ని సంస్థాన యూనియన్ లలోను, పెద్ద సంస్థానాలలోను అధికారం ప్రజాప్రతినిధుల పరం చేసితీరవలెనని భారతప్రభుత్వం పట్టుపట్టి సాధించింది. సంస్థానాల పన్నుల విధానాలు కూడా రాష్ట్రాలస్థాయికి తేవటానికి సిఫార్సులు,

సూచనలు చెయ్యటానికి ఒక ప్రత్యేకసంఘం నియమించారు. ఈవిధంగా సంస్థానాలు రాష్ట్రాలస్థాయికి వస్తుంటే, వాటికి రాజ్యాంగాలు నిర్మించటానికి ప్రత్యేక ప్రజాపరిషత్తులు అనవసరము, వ్యయకరమునని గుర్తించి భారత రాజ్యాంగ పరిషత్తే సంస్థానరాజ్యాంగ నమూనాను కూడా తయారుచేస్తే బాగుంటుందని తలచారు. సర్. బి. యన్. రావ్ అధ్యక్షతన ఒక కమిటీని ఏర్పరచి ఈ కార్యభారం వారికి వప్పగించారు. ఆకమిటీ నివేదిక త్వరలోనే పూర్తియై రాజ్యాంగపరిషత్తు చర్చకు వస్తుంది. అది ఆమోదించినతర్వాత, సంస్థానాలు శాశ్వతంగా, పూర్తిగా భారత దేశంలో భాగాలైపోయి, ఇకముందు సంస్థానలస్థాయి ఒక ప్రశ్నగా వుండదు.

భారతదేశ కేంద్రప్రభుత్వం బలవత్తరంగా వుండాలనే మనం మొదటినుంచి వాంఛిస్తున్నాము. భారత రాజ్యాంగ స్వరూపం ఫెడరల్ విధానంలో వుండాలని అందరూ అంగీకరిస్తారు. ఫెడరల్ రాజ్యాంగంలో, రాష్ట్ర, కేంద్రప్రభుత్వాలకు అధికారాలను పంచి ఇచ్చి, వాటిని సామరస్యంతో, సమన్వయించి నిర్వహిస్తుండటమే కష్టమని. రాష్ట్రాలకు ఎక్కువ అధికారాలువుంటే కేంద్ర దుర్బలమైపోతుంది; కేంద్రానికి ఎక్కువ అధికారాలుంటే రాష్ట్రాలు కేవలం మ్యునిసిపాలిటీల, జిల్లా బోర్డుల స్థాయికివచ్చి, రాష్ట్ర స్వపరిపాలన అర్థరహితమౌతుంది. సామాన్యంగా ఫెడరల్ రాజ్యాంగాలన్నిటిలోను శేషాధికారాలు రాష్ట్రాలకే యిస్తారు; మన రాజ్యాంగచట్ట ముసాయిదాప్రకారం శేషాధికారాలు కేంద్రానికే యిచ్చారు; అంటే కేంద్రం చాల బలవత్తరం చేయాలని భావించారన్నమాట. కేంద్ర, రాష్ట్రాలమధ్య అధికారాలు ముసాయిదాలో సూచించినట్లుగా పంపకంజరిగితే, అధికారాలు కేంద్రానికి, రాష్ట్రాలకు సమంజసంగా పంపిణీ అయినట్లుగా వుండేది. కాని రాష్ట్రాల జాబితాలోని అధికారాలను కేంద్ర అధికారాల జాబితాలో చేర్చి, రాష్ట్రాలఅధికారాలను సంకుచితంచేస్తున్నారు. ఇటువంటివి ఈసంవత్సరం

చాల జరిగాయి. ఇట్లాజరిగితే, మనరాష్ట్రాలు కేవలం జిల్లాబోర్డుల స్థాయికివచ్చి, రాష్ట్రస్వపరిపాలన అర్థరహితమై, రాష్ట్ర శాసనసభలు నిరర్థకమౌతవి. ఈరాజ్యాంగచట్టం ఇప్పటికన్న చాల అసంతృప్తికరంగా వుంటుంది.

రాజ్యాంగచట్ట ముసాయిదాలో అల్పసంఖ్యాకులకు—ముస్లిములకు క్రీస్టియనులకు—చాల రక్షణలు యిచ్చారు. భారతదేశంలో మతప్రసక్తి లేని 'సెక్యులర్' రాజ్యం ఏర్పరచాలని భావించేటప్పుడు, మత విషయిక అల్పసంఖ్యాకులకు ప్రత్యేక హక్కులు, రక్షణలు ఎందుకు? స్వాతంత్ర్య పోరాటంసమయంలో మనకు అవరోధాలు కల్పించిన ఈ వర్గాలకు ప్రత్యేక హక్కులు యివ్వటం చాలమందికి నచ్చలేదు. అందువల్ల ఈ సంవత్సరం ఇవిలొలగించి, ఒక్క నిమ్నజాతులకు మాత్రం కొద్దికాలం వరకు ప్రత్యేక హక్కులు,రక్షణలు యివ్వటానికి నిర్ణయించారు. ఇదిచాల సమంజసముగావున్నది. రాష్ట్ర, కేంద్రప్రభుత్వాలు కుల, మతప్రసక్తులను పెట్టకోరాదని గట్టి తీరువు రాజ్యాంగ చట్టంలో వుండాలి.

రాజ్యాంగ చట్టం అమలులోనికి రాకపూర్వమే భారతదేశ రాజ భాషనుకూడా నిర్ణయించవలసివున్నది. భారతదేశ రాజభాష కావగి వున్నది ఒక్క హిందీమాత్రమే. హిందీ, ఉర్దూలసంకరమైన హిందు స్థానీగాని, ఉర్దూలిపికాని రాజభాషగా నిర్ణయింపబడుటకు అవకాశం లేదు దేవనాగరలిపిలో హిందీభాషను రాజభాషగా నిర్ణయించేటట్లు సూచనలు కనపడుతున్నవి. ఇందుకు అందరూ అంగీకరిస్తారు.

ఇప్పటి రాజ్యాంగచట్టం చాలమందికి అసంతృప్తికరంగావున్న విషయం తెలిసినదే. భారతదేశంలో ఇంకా విప్లవాత్మక మార్పులు, రాజ్యాంగంగా, రాజ్యాంగ చట్టంద్వారా జరగాలని చాలమంది కోరు తున్నారు. నూతన రాజ్యాంగ చట్టం అమలులోనికివచ్చినా, కాంగ్రెస్ ప్రభుత్వాలు అధికారంలోవున్నంత కాలమే ఈ రాజ్యాంగచట్టం యథాతథంగా వుంటుంది. ఇంకే ప్రజాప్రభుత్వంవచ్చినా రాజ్యాంగ

చట్టం మార్పుచేయాలని ప్రయత్నిస్తారు. పార్లమెంటులో మూడిటం రెండువంతుల మెజారిటీతో ఈచట్టాన్ని మార్పుచేయవచ్చును.

భారత రాజ్యాంగచట్టం త్వరలోనే అమలులోనికివచ్చి, దాని ప్రకారం వయోజన వోటింగ్‌పద్ధతిపై ఎన్నికలు జరిగి, ప్రజా ప్రభుత్వాలు—అవి కాంగ్రెస్ ప్రభుత్వాలు కావచ్చు, కాకపోవచ్చు-అధికారంలోకి రావటానికి అవకాశం త్వరలోనే లభిస్తుందని మనం ఆశించవచ్చును.

# భాషా రాష్ట్రాలు

భారత ప్రభుత్వంపట్ల పెక్కుమంది విద్యాధికులకు అసంతృప్తి, నిర్లిప్తత కలగటానికి ముఖ్యకారణం భాషారాష్ట్రాల సమస్యయే. కాంగ్రెస్ ప్రభుత్వము ప్రజలకు ఎక్కువ ఆశాభంగము కలిగించినదికూడ ఈవిషయమునసే. ఈనాడు, భారత ప్రభుత్వం పరిష్కరించటానికి సంకోచిస్తూ మరింత విషమం చేస్తున్నది ఈసమస్యనే. ఒకవేళ ప్రస్తుత మంత్రివర్గము, ఏవిధంగానైనా, పైదొలగవలసివస్తే అందుకుగల ముఖ్యకారణములలో భాషారాష్ట్రములపట్ల వారవలంబించిన వక్రవైఖరి ఒకటిగా చెప్పుకోవలసి వస్తుంది. ఈనాడు, దేశంలో కాంగ్రెస్ ప్రతిష్ట తగ్గిపోతుండటానికికూడా భాషారాష్ట్రములను ఏర్పరచటంలో కాంగ్రెస్ ప్రభుత్వం చేస్తున్న విలంబనము ఒక ముఖ్యకారణం.

భారతదేశమంతా బ్రిటిషు పరిపాలనక్రిందకు ఒక్కనాడు రాలేదు; క్రమేణా ఒకొక్కప్రాంతము, ఒకొక్క సంస్థానము తమక్రిందకు వచ్చినప్పుడు, తమకుగల ఇతర సౌకర్యాలనుబట్టి వాటిని ఆయారాష్ట్రములలో చేర్చివేస్తుండేవారు. ఈవిధంగా ప్రయత్నరహితంగా, ఆలోచనారహితంగా భారతదేశం అనేక రాష్ట్రాలుగా ఏర్పడ్డది. దేశాన్ని రాష్ట్రాలుగా విభజించటం సక్రమమైన పద్ధతులపైన జరగలేదని బ్రిటిషుపాలకులకు తెలుసును. కాని ఆ అవకతవకలను సరిచేసి, చక్కని, సక్రమమైన రాష్ట్రాలను ఏర్పరచడానికి వారు ప్రయత్నించలేదు. అందుకు వారి సామ్రాజ్యవాద సిద్ధాంతాలే కారణము. ప్రతిఒక్క భాషాప్రాంతమును ఒకొక్క రాష్ట్రముగ ఏర్పరచి, హిందీభాషాప్రాంతమును రెండు మూడు రాష్ట్రములుగా విభజించినచో పరిపాలన సుకరముగావుండి, రాష్ట్రాలు చక్కగా అభివృద్ధిచెందటానికి వీలుండేది. ఏరాష్ట్రము మరీ పెద్దదిగాను, మరీ చిన్నదిగాను వుండకుండా, అన్నీ ఇంచుమించు

-బాల్కస్థానాలలో పురమేవి. కాని బ్రిటిష్‌వారి విధానమును అనుసరించలేదు. అనేక భాషలవారిని ఒకేరాష్ట్రములో ఇముడించి, వారి నొకరిపై ఒకరిని ఉసిగొల్పి, విభేదాలు, విద్వేషాలు పెంచి, ఒకభాషవారంటే ఇంకొక భాషవారికి అసహ్యము కల్గించి, వారిలో అనైక్యతను స్థిరమొనర్చి, తమ మనుగడను శాశ్వతమొనర్చుకొనుటే—విభజించి, పాలించుటే—వారి విధానము. తమ 'విభజించు పాలించు' విధానమునకు అనుగుణ్యముగా ఒక్కొక్కటి మరీ పెద్దరాష్ట్రముగను, ఒక్కొక్కటి మరీ చిన్నరాష్ట్రముగను ఏర్పరచుకొనిరి. అవసరమునుబట్టి ఒరిస్సా, సింధు మొదలైన చిన్న చిన్న రాష్ట్రములను—ఇవి వాస్తవానికి ఒకటి రెండు పెద్దజిల్లాలంత రాష్ట్రాలుమాత్రమే—ఏర్పరచి, కేంద్రగ్రాంటులద్వారా వాటిని పోషించారు కూడాను.

భారతజాతీయ కాంగ్రెస్ దేశస్వాతంత్ర్య పోరాటం జరుపుతుండగా ఈ విధానాన్ని తీవ్రంగా విమర్శిస్తుండేది; దేశంలో భాషల ప్రాతిపదికలపైన రాష్ట్రాలు ఏర్పరచాలని తీర్మానాలు చేస్తుండేది. భాషాప్రయుక్తంగా రాష్ట్రాలు పునర్విభజించాలని కాంగ్రెస్ నాగపూర్‌లో 1920 లో తీర్మానించింది; అప్పటినుంచికూడా కాంగ్రెస్ వ్యవహారాల నిర్వహణకు భాషప్రాతిపదికపైననే రాష్ట్రాలు ఏర్పరచబడినవి. బ్రిటిష్ పాలకులుకూడా భాషారాష్ట్రాల అవసరము గుర్తించటము, అంగీకరించటము జరుగుతూనే వుండేదికాని ఆచరణమాత్రం జరగలేదు.

దేశం స్వాతంత్ర్యం పొందగానే భాషాప్రయుక్తంగా రాష్ట్ర విభజన జరిగితీరగలదని నాయకులు ఎప్పుడూ చెపుతూండేవారు. కేంద్రంలో ప్రజాప్రభుత్వం ఏర్పడినతర్వాత రాష్ట్ర పునర్విభజనవాంఛ తీవ్రమైనది; భాషారాష్ట్రవాదము బలపడి, స్థిరపడి, బహుళవ్యాప్తమైనది. ఈవిషయమును భారతప్రభుత్వము గుర్తించినది; అంగీకరించినది గాని ఆచరణలో పెట్టటానిక మాత్రం సంకోచిస్తున్నది. అందువల్లనే ప్రభుత్వంపట్ల అసంతృప్తి, విసుగుపుట్టుచున్నది.

భాషారాష్ట్ర నిర్మాణాన్ని సూత్రప్రాయంగా అంగీకరిస్తూ, వీలైనంత త్వరలో ఆసూత్రాన్ని ఆచరణలో పెట్టగలమని—ముఖ్యంగా ఆంధ్రరాష్ట్ర విషయంలో—హామీయిస్తూ, మన ప్రధానమంత్రి ఎన్నోసార్లు వాగ్దానాలు చేశాడు. నూతన రాజ్యాంగ చట్టంలో రాష్ట్రాల జాబితాలో నూతన రాష్ట్రాల పేర్లు చేర్చాలని అప్పట్లో భావించారు; ఆంధ్రరాష్ట్రం తప్పక చేర్చబడుతుందని వాగ్దానంకూడా చేశారు. కాని ఇంతలో నే భారత ప్రభుత్వ వైఖరి మారిపోయింది. భాషారాష్ట్రాలు ప్రస్తుతానికే గాక ఎన్నిటికైనా గాని అనవుసరము, హానికరము అని నాయకులు భావించటం మొదలుపెట్టారు. ఇది దురదృష్టకరమైనవిషయము.

నూతన రాజ్యాంగ చట్టంలో చేర్చవలసిన కొత్తరాష్ట్రాలు ఏవో ప్రతివారికి తెలుసును. అవి స్వయంపోషకంగా వుంటవో లేదో, వాటి విస్తీర్ణము, జనాభా, వాటిని ఏర్పరచటానికి వున్న సాధకబాధకాలు కాంగ్రెస్ నాయకులు ఎరిగియేవున్నారు. దానినిగురించి, 30 ఏండ్లు భాషారాష్ట్ర వాదము ప్రచారములోను, కొంతవరకు అమలులోనువున్న తర్వాత, ఇప్పుడు ఒక కమిటీ విచారింపవలసిన అవుసరము ఏమీ లేదు. ఒకవేళ, ఒక కమిటీ అవుసరమైనా, రాజ్యాంగపరిషత్తు సభ్యులే, ఒక ఉపసంఘముగా ఏర్పడి, ఒకటి రెండు నెలలకాలములో ఒక సమగ్ర నివేదిక తయారుచేసి వుండగల్గివారు. భాషారాష్ట్రములు కావలెనని వాదించెడువారు రాజ్యాంగ పరిషత్తులో నే వుండగా, ఇంకా ఏమో విచారించుటకు ఒక కొత్తకమిటీని నియమించవలసిన అవుసరం లేదు. అయినా, ఈ అనవుసరవిధానాన్నే అనుసరించటానికి రాజ్యాంగ పరిషత్తు అధ్యక్షుడు నిర్ణయించాడు. రాజ్యాంగ పరిషత్తు సభ్యులుగాని—ఒక్కరుతప్ప—భాషారాష్ట్ర వాదులుగాని, అథవా భాషారాష్ట్రవాద ప్రాంతములలోని వారుగాని కాని ముగ్గురు సభ్యులతో ఒక సంఘాన్ని 1947 సంవత్సరం నవంబరులో డా. రాజేంద్రప్రసాద్ నియమించాడు. దీనినే ధార్ కమిషన అంటారు. నూతన రాజ్యాంగచట్టంలో ఏమే

కొత్తరాష్ట్రాలపేర్లు చేర్చవలెనో, చేర్చవచ్చునో సూచించటమే ఈసంఘ కర్తవ్యము. భాషారాష్ట్రాలు పనికిరావనిపించటానికే ఈ సంఘాన్ని నియమించారని అప్పుడే అందరూ భావించారు.

1948 మేనెలలో ధార్ కమిటీ 23 ప్రశ్నలతో ఒకపెద్ద ప్రశ్న పత్రము తయారుచేసి, దానికి సమాధానాలు పంపవలసిందని భాషా రాష్ట్రవాదులందరినీ కోరింది. అంతతో సంతృప్తిపడక, ఈ కమిటీ అన్నిరాష్ట్రాలు తిరిగి, పలువురు వ్యక్తులతో ముఖాముఖిని చర్చించి, సాక్ష్యాలు పుచ్చుకుని, పరిస్థితులు అవగాహన చేసుకున్నది. ఆ సందర్భంలో గత సెప్టెంబరులో వీరు మద్రాసుకూడా విచ్చేశారు. దేశమంతటా 6700 మంది వ్యక్తులనుండి భాషారాష్ట్రాల విషయమై వీరు సాక్ష్యాలు స్వీకరించారు. వీరికి కావలసిన ఇతర వివరాలన్నీ ఆయా రాష్ట్రప్రభుత్వాలు సప్లయిచేసినవి.

ఇంత విచారణజరిపి, నివేదిక తయారుచేసి 1948 డిసెంబరు 10వ తేదీన రాజ్యాంగ పరిషత్తు అధ్యక్షునకు తమనివేదికను ఈసంఘం సమర్పించింది. భారతదేశం స్వతంత్రమైనతర్వాత ఏసంఘ నివేదిక ఇంత తీవ్రంగా విమర్శకు రాలేదు; ఇంత ఆశాభంగకరంగాలేదు.

భాషారాష్ట్ర సిద్ధాంతం ఇప్పుడుకాదు మరెప్పుడూకూడా అనుసరించకూడదని ఈసంఘం సిఫార్సుచేసింది. ఒక్కొక్క భాషాప్రాంతాన్ని ఒక ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పరిస్తే, ఆరాష్ట్ర ప్రజలు తమభాష, తమ సంస్కృతి, తమ అభివృద్ధినే కోరుతూ, భారతదేశ ఐక్యతకు, దేశ అభ్యున్నతికి నిరోధం కలిగిస్తారని ఈసంఘం భావిస్తున్నది. ఇట్లాజరగదనీ, ప్రత్యేకభాషలవారు, ప్రత్యేక రాష్ట్రాలవారు తాము అభివృద్ధి జెందుతూ, దేశాభ్యున్నతికి తోడ్పడతారని ఇతరులు ఎంతవాదించినా అది తప్పుడు దృక్పథము మాత్రమేనని ఈసంఘం నిశ్చితాభిప్రాయము. స్వతంత్ర భారతదేశం ఏకదేశంగా, బలిష్టంగా వుండాలంటే భాషా రాష్ట్రాల ప్రసక్తి తేనేకూడదని ఈసంఘం భావిస్తున్నది. ప్రస్తుతం వున్న రాష్ట్రాలలో భాషాద్వేషాలు, భాషావిషయికంగా అధిక సంఖ్యా

కులుగావున్నవారు అల్పసంఖ్యాకులకు తగుహక్కులు, రక్షణ యివ్వటం లేదని ఈసంఘం గుర్తిస్తున్నది. భాషావిషయిక అల్పసంఖ్యాకులకు ఎట్టి అన్యాయము జరుగకుండా తగుకట్టుదిట్టములు వెంటనే చేయవలసిందని కేంద్రప్రభుత్వానికి ఈసంఘం సిఫార్సుచేస్తున్నది. ఇప్పుడు కొన్ని రాష్ట్రాలు మరీ పెద్దవిగాను, కొన్ని మరీ చిన్నవిగాను ఉన్నవిషయం వాస్తవమే. కొన్నాళ్ళు పోయినతర్వాత, దేశంలో ఇతరపరిస్థితులన్నీ చక్కబడినతర్వాత ఇప్పటి రాష్ట్రాలను పునర్విభజించి, భాషాప్రాతి పదికపైగాక,పరిపాలన సౌకర్యమునకు తగినట్లుగా రాష్ట్రములు ఏర్పాటు చేయవలెనని ఈ సంఘం సిఫార్సు చేస్తున్నది. ఒకవేళ భాషారాష్ట్రాలు ఏర్పడితే, మద్రాసు, బొంబాయి పట్టణాలుమాత్రం ఏరాష్ట్రంలోను చేర్చకుండా, ప్రత్యేకంగా, కేంద్రప్రభుత్వ పాలనలో వుంచివేయాలి. ఇవి ఈసంఘ ముఖ్యసూచనలు. ఇవిగాక, భాషారాష్ట్రములు ఇప్పుడు ఏర్పరిస్తే కొత్తగా ఆరు రాజధానీ పట్టణాలు నిర్మించటానికి డబ్బు చాల ఖర్చయి, ఇన్ఫ్లేషన్ పెరుగుతుందనీ, కొత్తరాష్ట్రాలు స్వయంపోష కాలుగా వుండక, పోలీసురాష్ట్రాలుగా వుంటాయనీ మొదలైన మామూలు, అర్థరహితమైన, ఇతర అడ్డంకులుకూడా ఈ కమిషన్ చూపెట్టింది.

భాషాప్రయుక్తంగా రాష్ట్రాలు ఏర్పడితే దేశ ఐక్యతకు భంగం కలుగుతుందా అన్నది ఒక్కటే ఈసంఘ నివేదికలో మనం ఆలోచించ వలసినది. భాషారాష్ట్రాలు దేశఐక్యతకు భంగం కలిగించవని రుజువైతే ఈసంఘం చేసిన సిఫార్సులన్నీ నిరుపయోగమైపోతాయి. భాషారాష్ట్రాలు దేశఐక్యతను విచ్ఛిన్నంచేస్తే, అవి కోరదగినవికావు. భాషారాష్ట్రాలు దేశఐక్యతను విచ్ఛిన్నం చేయకపోగా, పెంపొందిస్తాయని కాంగ్రెస్ ఎన్నాళ్ళనుంచో వాదిస్తున్నది. ఆచరిత్రను ఇప్పుడు కాదనటం అసం భవం. కాంగ్రెస్ గతంలో తప్పుచేసిందని ఇప్పుడు చెపుదామా?

భాషారాష్ట్రాలు ఏర్పడవలసింది ముఖ్యంగా దక్షిణదేశంలోనే. ఉత్తరదేశంలో ఒక్క బెంగాల్‌లోతప్ప ఇంకెక్కడా ఈ అవుసరం

లేదు. దక్షిణదేశంలో భాషారాష్ట్రాలు ఏర్పడి, అవి సక్రమంగాసాగుతూ అభివృద్ధిచెందుతూంటే ఉత్తరదేశ ప్రాముఖ్యము, హిందీభాష ప్రాధాన్యత నశించవచ్చునని ఉత్తరదేశస్థులకు భయము. దక్షిణదేశంలో ప్రజలలో భాషావిద్వేషాలు పెరుగుతూంటే క్రమేణా ఇంగ్లీషుస్థానే హిందీని పెట్టి, వారిని హిందీసేవకులుగా తయారుచేసుకోవచ్చును. క్రమేణా హిందీకి ఇంగ్లీషుకన్న ఎక్కువ ఆదరణ తేవచ్చును. రాజకీయంగాకూడా దక్షిణదేశం స్పర్థలలో నిండివుంటే, ఉత్తరదేశం అధికారం నిర్వహించవచ్చును. కాబట్టి భాషారాష్ట్రాలు ఏర్పడటం ఉత్తరదేశస్థులకు ఇష్టంవుండదు. ధార్‌కమిటీ నివేదికకు మూలకారణం ఇదే.

ధార్‌కమిటీ నివేదిక ప్రకటింపబడిన వెంటనే జయపూర్ కాంగ్రెస్ సభజరిగింది. ధార్‌కమిటీ నివేదిక ఈసమావేశంలో చాలతీవ్రంగా విమర్శింపబడింది. ఏదో ఒకవిధంగా ఈసమస్యను ఇప్పటికి వాయిదా వేయించకపోతే అగ్రనాయకుల ప్రతిష్ఠ నిలిచేటట్లులేదు. అందువల్ల, నెహ్రూ - పటేల్ - పట్టాభిగార్లతో ఒక సంఘం ఏర్పడి, భాషారాష్ట్రాల అవశ్యకతనుగురించి మరొక్కమారు ఆలోచించాలని సూచనలు వచ్చాయి. నాయకుల వాంఛలకు ఎదురుచెప్పలేక కాంగ్రెస్ సభ ఈ సూచన అంగీకరించింది. వెంటనే చేయటానికి ఇష్టంలేక, చేయబోవటం లేదని చెప్పటానికి ఇష్టంలేక, మర్యాదగా తప్పించుకుని, కాలహరణం చేయటానికి కమిటీ నియామకమంత అనువైనది మరి ఇంకొకటిలేదు. ఏప్రభుత్వమైనా సరే, వెంటనే పూనుకోదలచుకోనిపనులను విచారించటానికి కమిటీలు—అవి అవుసరమైనా కాకపోయినా నియమించి, ప్రజల కళ్ళనీళ్ళు తుడుస్తుంది. ధార్‌కమిటీ నియామకం అటువంటిదే. 1947 నవంబరునుంచి 1948 డిశెంబరువరకు ఆకమిటీ పేరుతో భాషారాష్ట్ర వాదులఒత్తిడి తగ్గిపోయింది. తాత్కాలికంగా మరల ప్రారంభమైన ఈ అలజడిని ఉపశమింపజేయటానికి, ఇంకొక్క కమిషన్ వెంటనే ఏర్పాటు చేశారు.

భారతదేశంలోని అగ్రనాయకత్రయం ఈకమిషన్‌గా ఏర్పడి నారు కొబట్టి భాషారాష్ట్రాల విషయం త్వరలోనే తేలిపోవచ్చునని, భాషారాష్ట్రాలు ఏర్పాటుచటానికే వీరు నిర్ణయిస్తారని అందరూ ఆశించారు. 30 ఏండ్లకు పైగా భాషారాష్ట్ర ఉద్యమాన్ని నడుపుతున్న డా పట్టాభి ఈ కమిషన్‌లోవుండటం ఈ ఆశను మరింత ప్రోత్సాహం చేసింది. నాయకత్రయ కమిషన్ ఏప్రిల్‌లో తన నివేదిక కాంగ్రెస్ కార్యవర్గ మునకు దాఖలు చేసి, ఆమోదముపొంది ప్రచురించింది.

భాషారాష్ట్రాలు సూత్రప్రాయంగా ఎంత వాంఛనీయమైనప్పటికీ, భారతప్రభుత్వం ప్రస్తుతం ఎదుర్కొంటున్న విపత్కర పరిస్థితులలో వెంటనే భాషాప్రయుక్తంగా రాష్ట్ర పునర్విభజన జరగాలని కోరటం సమంజసం కాదు కొబట్టి కొన్నాళ్ళవరకు ఈవిషయం వాయిదా వెయ్యా లని ఈ కమిషన్ భావించింది. ఒక్క ఆంధ్రరాష్ట్రం విషయంలోమాటుకు ఆంధ్రులు మద్రాసునగరాన్ని వదలుకునేటట్లయితే, త్వరలో ఆంధ్ర రాష్ట్రాన్ని ఏర్పాటు చేయవచ్చునని కూడా ఈనివేదిక సూచించింది.

భాషారాష్ట్రాలు దేశఐక్యతకే భంగకరమనే ధార్ కమిటీ సూచన అంగీకరించకపోయినా, దేశంలో ఇప్పుడు ఏర్పడివున్న ఇన్ఫ్లేషన్, కమ్యూనిస్టు అలజడి మొదలైన ప్రమాదకరపరిస్థితులు సాకుగాచెప్పి, మొత్తంమీద ధార్ కమిటీ కోరిన ఫలితాన్నే నాయకత్రయం చూపిస్తు న్నారు. కాని వీరిసాకు కేవలం కుంటిసాకు. దేశవిభజనతో స్వతంత్ర మైపోవటానికి హక్కుకలిగి, దేశఐక్యతనుకోరి భారతప్రభుత్వంలో చేరిన దాదాపు 400 మంది సంస్థానాధీశ్వరులను తొలగించి, వారి రాజ్యాలు రాష్ట్రాలలోను, యూనియన్‌లలోను కలిసివేయటం జరిగింది; దేశంలోని విపత్కర పరిస్థితులు అందుకు అడ్డంరాలేదు. కొని తమపాలనక్రిందనే వున్న రాష్ట్రాలను కేవలం పునర్విభజించటానికే—ఇది చాల స్వల్పమైన మార్పు మాత్రమే—విపత్కర పరిస్థితులు అడ్డంవస్తున్నాయి. తాము చూపించిన ఈసాకు వాస్తవమైనదని ఎవ్వరైనా అంగీకరిస్తారని

యకత్రయం భావిస్తుంటే అది గొప్పభ్రమ మాత్రమే అని చెప్పాలి. ధికారం తమ చేతిలోవున్నంత మాత్రాన, ఇష్టంవచ్చినట్లు వ్యవహరించ చ్చు ననుకోవటం కొరివితో తలగోకికొనటమే కదా!

ఆంధ్రరాష్ట్ర విషయంలో మద్రాసు నగరంపై హక్కును ఆం నులు వదులుకోవాలని సూచించవలసిన పాక్షికత అగ్రనాయకత్రయానికి ందువల్ల కలిగిందో తెలియదు. రాష్ట్రం కోరుతున్నారు కాబట్టి, ఏవో ంగీకరించలేని షరతులు పెట్టితే, అప్పటికి చల్లబడి వూరుకుంటారనే రణిలోవున్నదీ షరతు. తీర్పు చెప్పవలసిన న్యాయమూర్తి, ప్రతివాదుల రఫున వాదించటం మొదలుపెడితే, ఎటువంటి న్యాయం జరుగుతుందో నకు తెలుసును, ఇటువంటి పక్షపాత సూచన చేసేకంటె, ఆంధ్రరాష్ట్రం ూడా ఇప్పుడు పనికిరాదని అంటే బాగుండేది.

ధార్‌కమిటీ, అగ్రనాయకత్రయాల నివేదికలు కాంగ్రెస్ ప్రతిష్టను నాశనంచేశాయి; గత 30 ఏండ్లుగా నడుస్తున్న భాషారాష్ట్రోద్యమంపై న్నీళ్ళుచల్లాయి; ఉత్తరదేశంవారు దక్షిణ దేశానికి హానిచేస్తారనే ాదానికి చాల బలంచేకూర్చాయి. ప్రజలందరు భాషారాష్ట్రాలు కావా ంటున్నారో లేదో తెలుసుకోవాలంటే ఆవిషయమై ప్రభుత్వం ప్లెబి సైట్ జరపవచ్చును; అంతేగాని ఈసమస్యను ఇంకా వాయిదావేసి, అనవుసరంగా ఉత్తర - దక్షిణ స్పర్ధలు, భాషావిద్వేషాలు పెంచి, కాంగ్రెస్‌ను నాశనంచేసి, తమ మనుగడకే ముప్పుతెచ్చుకోవటం అవివేకము.

# కాంగ్రెస్ రాజకీయాలు

భారత జాతీయ కాంగ్రెస్ ప్రతిష్ట ఈనాడు దాని చరిత్రలో ఇదివర కెన్నడు లేనంత అధమస్థాయిలోవున్నది. దేశంలో ఏప్రాంతంలో చూచినా, ఏవిషయంలో చూచినా కాంగ్రెస్ ప్రజానీకంలో పొగడ్త కంటె విమర్శనే ఎక్కువ భరించవలసివస్తున్నది. కాంగ్రెస్ విచ్ఛిన్నమై పోతున్నదని, కాంగ్రెస్ ప్రభుత్వాల విధానాలు దేశాభ్యుదయకరాలుగా లేవనీ జనసామాన్యం భావిస్తున్నారు. రెండేండ్లక్రితం 1947 ఆగస్టు 15 వ తేదీన భారత దేశానికి స్వాతంత్ర్యం సంపాదించిన సంస్థగా కాంగ్రెస్ ప్రపంచమన్ననలు పొందింది. స్వాతంత్ర్య సముపార్జనతో కాంగ్రెస్ ప్రతిష్ట మిన్నుముట్టింది. రాష్ట్రాలలోను, కేంద్రంలోను కాంగ్రెస్ ప్రభుత్వాలు అధికారంలోవుండి, దేశంలో కాంగ్రెస్‌తో సరిపోల్చదగిన పార్టీ కాదుకదా, అసలు చెప్పుకోదగినపార్టీ ఒక్కటి కూడా లేక, కాంగ్రెస్ స్థిరపడిపోవటానికి మంచి అవకాశం లభించింది. కాని రెండేండ్లలో పరిస్థితులు తారుమారైనాయి. కాంగ్రెస్ ప్రతిష్టా ప్రాధమ్యం కూలిపోయింది. కాంగ్రెస్ సాధించిన మహత్తర విజయము, దేశంలో ఇతర పార్టీలు లేకపోవటముకూడా కాంగ్రెస్ పలుకుబడిని నిలబెట్టలేక పోతున్నాయి. కాంగ్రెస్ స్థానాన్ని ఆక్రమించటానికి ఇతర కొత్తపార్టీలు సంయుక్తంగా సన్నాహాలు జరుపుతున్నాయి. వీటి ప్రయత్నాలు ఎంతవరకు జయప్రదమౌతవో ఆతురతతో వేచిచూడాలి.

రెండేండ్లలో కాంగ్రెస్ ప్రతిష్ట ఇంతగా పడిపోవటానికి కారణం ఒక్కటని చెప్పటానికి వీలులేదు. కాంగ్రెస్ వాదుల, కాంగ్రెస్ ప్రభుత్వాల అసమగ్రత, అవినీతి, స్వార్థపరత్వము, పరస్పర విద్వేషాలు మొదలైనవేకాకుండా కాంగ్రెస్ ప్రభుత్వాలకు వారసత్వంగావచ్చిన క్లిష్ట సమస్యలు, దేశవిభజన సమస్యలు, అంతర్జాతీయ పరిస్థితులుకూడా ఇందుకు కొంతవరకు కారణాలని చెప్పవచ్చును.

కాంగ్రెస్ నూతన నిబంధనావళి ఈసంవత్సరం అమలులోనికి వచ్చింది. దీనివల్ల కాంగ్రెస్ సంస్థలోగాని, కాంగ్రెస్‌వాదులలోగాని మార్పు ఏమీరాలేదు. కాంగ్రెస్ నాల్గణాల సభ్యత్వం నూతన నిబంధనావళి ప్రకారం రద్దయిపోయిందిగాని దానిని పునరుద్ధరించాలని ప్రయత్నాలు జరుగుతున్నవి. నూతన నిబంధనావళి పూర్తిగా అమలులోనికి వచ్చినతర్వాత కాంగ్రెస్ సమావేశం విషయం ఆలోచనలోనికివచ్చింది. 1946లో మీరట్‌లో కాంగ్రెస్ సమావేశం జరిగినతర్వాత ఇంతవరకు కాంగ్రెస్ సమావేశం జరిగివుండలేదు. మీరట్ సమావేశంతర్వాత మనదేశంలో బ్రహ్మాండమైన మార్పులు జరిగాయి. దేశం స్వతంత్రమైనది; సంస్థానాలు తుడుచుకుపోయి, సంస్థాన ప్రజామండలి కాంగ్రెస్‌లో చేరిపోయింది; దేశం విభాగితమై ఆప్రాంతంలో కాంగ్రెస్ రద్దుచేయబడింది; కేంద్రంలోను రాష్ట్రాలలోను ప్రభుత్వాధికారం కాంగ్రెస్ చేతులలో వున్నది; వాస్తవానికి మీరట్ సమావేశంనాటి పరిస్థితులకు ఇప్పటి పరిస్థితులకు ఏమాత్రము పోలికలేనేలేదు. మీరట్ సమావేశం తర్వాత జరిగిన సంఘటనలను సమీక్షించుకుని, నూతనపరిస్థితులకు అనుగుణంగా నూతన పంథాను ఏర్పరచుకొనవలసిన అవసరం ఏర్పడింది. దేశం స్వాతంత్ర్యమైనతర్వాత, సంస్థానాల సమస్య పరిష్కారమైనతర్వాత కాంగ్రెస్ ప్రథమసమావేశం కావటంవల్ల దీనికి చాలా ప్రాముఖ్యతవున్నది. కాంగ్రెస్ మొట్టమొదటి పర్యాయం భారత సంస్థానంలో సమావేశమై ఈ సమావేశానికి మరింత ప్రాముఖ్యత నాపాదించినది.

కాంగ్రెస్ అధ్యక్షుపదవికి తీవ్రమైన పోటీ జరిగింది. కేవలం 150 వోట్ల మెజారిటీతో డా. పట్టాభి సీతారామయ్య అధ్యక్షుడుగా ఎన్నుకోబడినాడు. ఈయనతో పోటీచేసిన బాబు పురుషోత్తందాస్ టాండన్ యు. పి. శాసనసభ స్పీకర్. కాంగ్రెస్‌లో ముస్లిం వ్యతిరేకవర్గానికి శ్రీ టాండన్ నాయకుడని చెప్పవచ్చును. అయితే ఈ విషయమై

కాంగ్రెస్‌లో తీవ్ర విభేధాలున్నవని చెప్పటానికి వీలులేదు. కాంగ్రెస్ సాధారణంగా ముస్లిం పక్షపాతసంస్థయే; ముస్లిం ప్రతికూల, అనుకూల వర్గాలకు పోటీ పడింపని చెప్పటానికి ఏమాత్రము వీలులేదు. ఈ పోటీ అభ్యుదయ, అభ్యుదయ నిరోధకవర్గాలకు జరిగిందని చెప్పటంకూడా అసమంజసమే; ఈ ఎన్నికవల్ల కాంగ్రెస్ ప్రభుత్వాల విధానాలలో ఎట్టి మార్పులు జరిగివుండేవికావు. కొంతవరకు ఉత్తర, దక్షిణ భాగాలతో జరిగిన పోటీని, కొత్తగా కాంగ్రెస్‌లో లీనమైన సంస్థాన ప్రజామండలి వోట్లు తేల్చివేశాయి. కేంద్రంలో కాంగ్రెస్ ప్రభుత్వం ఏర్పడిన తర్వాత కాంగ్రెస్ అధ్యక్షపదవి గౌరవప్రతిష్టలు సన్నగిలినాయి. అగ్రనాయకులైన నెహ్రూ-పటేల్‌లే వాస్తవంగా కాంగ్రెస్; వారు కాదన్నది చేయటానికి, అవునన్నది కాదనటానికి ఏ కాంగ్రెస్ వాదికి తాహతులేదు. కాంగ్రెస్ అధ్యక్షుడు వారివిధానాలను హర్షించి తీరవలసిందే; లేకపోతే ఆచార్య కృపాలనీత్రోవనే అనుసరించవలసి వుంటుంది. కాంగ్రెస్ అధ్యక్షపదవికి ఈ సంవత్సరం తీవ్రమైన పోటీ జరిగినా, అది అంత పట్టించుకోదగిన విషయంకాదు. ఆంధ్రుడైన డా. పట్టాభి అధ్యక్షుడైనాడనికన్న సంతోషించవలసినది ఇంకేమీలేదు.

అఖిలభారత జాతీయ కాంగ్రెస్ 55 వ సమావేశం జయపూర్‌లో డిశెంబరు మూడవవారంలో జరిగింది. ఈ చారిత్రక సమావేశం దాని ప్రాముఖ్యతకు తగినంత శోభాయమానంగా జరిగిందని, 18 వ తేదీన జరిగిన బహిరంగసమావేశానికి 2 లక్షలకుపైగా జనం వచ్చారనీ చూచిన వారు చెపుతున్నారు.

మీరట్‌నుంచి అఖండజ్యోతి రావటము, అధ్యక్షుడు ఢిల్లీనుంచి రావటముతో కాంగ్రెస్ సమావేశం ప్రారంభమైందని చెప్పవచ్చును. డిశెంబరు 16 వ తేదీన ఎ. ఐ. సి. సి. సమావేశమై, డా. పట్టాభి అధ్యక్షతన సబ్జెక్ట్సు కమిటీగా మారి, అప్పటికి వారం రోజులక్రితమే కాంగ్రెస్ కార్యవర్గం తయారుచేసిన తీర్మానాలను చర్చించి, ఆమో

దించింది. సబ్జెక్ట్సు కమిటీ ఆమోదించిన తీర్మానలనే బహిరంగ సమావేశం తిరిగి చర్చించి ఆమోదించింది. కాంగ్రెస్ ఆశయాలు, వైదేశిక విధానము, కామన్వెల్తు సంబంధాలు, భాషారాష్ట్రాలు, కాంగ్రెస్ వాదుల నైతికపతనము మొదలైన ముఖ్యవిషయాలపై 12 తీర్మానాలు ఈ సమావేశంలో జరిగాయి.

జయపూర్ కాంగ్రెస్ తీర్మానాలన్నీ భారతప్రభుత్వ చర్యలను, విధానాలను సమర్థిస్తూనేవున్నవి. కాంగ్రెస్ వాదుల ప్రవర్తనకు సంబంధించిన తీర్మానం ఒక్కటీగాక తక్కినవన్నీ ఏవిమర్శకు రాకుండా, తేలికగానే ఆమోదింపబడినవి. ఈ ఒక్క తీర్మానము విషయంలోను అగ్రనాయకులు, కాంగ్రెస్ అగ్రనాయకులదేనని రుజువుచేసుకున్నారు. కాంగ్రెస్‌వాదుల నైతికపతనాన్ని విమర్శిస్తూ, కాంగ్రెస్ వాదులందరూ, ముఖ్యంగా శాసనసభ్యులు, ఆదర్శప్రాయంగా నడుచుకోవలసిందని హెచ్చరిస్తూ ఒక తీర్మానాన్ని కాంగ్రెస్ హైకమాండ్ తరఫున శ్రీ శంకరరావ్ దేవ్ ప్రవేశపెట్టాడు. ఈ తీర్మానానికి మహేశ్ మిశ్రా ఒక సవరణ ప్రతిపాదించి కేంద్ర, రాష్ట్రాలలోని కాంగ్రెస్ మంత్రులు, ముఖ్యంగా, ఆదర్శప్రాయంగా నడుచుకోవలసిందనే హెచ్చరికనుకూడా ఈ తీర్మానంలో చేర్చాలని సూచించాడు. ఈ సవరణకు అనుకూలంగా 107 ప్రతికూలంగా 52 వోట్లువచ్చి, ఆమోదింపబడి, తీర్మానంలో చేర్చబడింది. ఆసమయంలో పండిట్ నెహ్రూ, సర్దార్ పటేల్ సభలోలేరట. మంత్రుల ప్రవర్తనవిషయం తీర్మానంలో కెక్కిందని తెలియగానే వారికి చాల కోపంవచ్చింది. ఈ తీర్మానాన్ని పునరాలోచించి, ఆపదాలు తొలగించకుండావుంటే తాను రాజీనామా నిస్తానని పండిట్ నెహ్రూ బెదిరించాడు. ఆ తీర్మానాన్ని పునరాలోచించటానికి ఆ మరునాడు సబ్జెక్ట్సు కమిటీ తిరిగి సమావేశమైంది. సవరణను ప్రతిపాదించిన మహేశ్ మిశ్రాకు మాట్లాడేటందుకు అవకాశం కూడా యివ్వకుండా, పండిట్ నెహ్రూ రాజీనామా బెదిరింపుతో ఈ

సవరణను త్రోసివెయ్యటానికి నిర్ణయంజరిగింది. ఇది చాల క్రమవిరుద్ధమైన విషయం. కాంగ్రెస్ అగ్రనాయకుల కోర్కెలకు వ్యతిరేకంగా కాంగ్రెస్ ఏపనీచేయలేదని ఈసంఘటన పూర్తిగా రుజువుచేసింది.

ఆచార్యకృపాలనీ రాజీనామా నిచ్చినప్పటినుంచి, ముఖ్యంగా డా. పట్టాభి అధ్యక్షుడైనప్పటినుంచి కాంగ్రెస్‌సంస్థ—కాంగ్రెస్ ప్రభుత్వాల సంబంధాలవిషయం అనేక రకాల ఊహాగానాలకు దారి తీసింది. డా. పట్టాభి హయాములోనైనా ఈవిషయమై ఏదో ఒక శాశ్వతనిర్ణయం జరుగుతుందేమోనని ఆశించారు. కాని అటువంటిదేమీ జరగలేదు. అగ్రనాయకుల వైఖరికి అనుగుణ్యంగా నడుచుకోవటమే మంచిదని డా. పట్టాభి నిర్ణయించుకున్నట్లున్నది. కాంగ్రెస్ ప్రభుత్వాలు-కాంగ్రెస్‌సంస్థ సంబంధాలనుగూర్చి మాట్లాడుతూ "కాంగ్రెస్ సంఘము ప్రభుత్వమునకు మేధానిధిగాను, ప్రజల సంరక్షకురాలుగాను ఉండవలెను. అటు ఆదర్శములను, ఇటు ఆచరణయుత మార్గములను సమన్వయంచేయవలెను. కాంగ్రెస్ వాదులు ప్రభుత్వమైనందిన వ్యవహారాలలో సౌఖ్యము కల్గించుకుని, పరిపాలనా యంత్రము సాక్షిగా ముందుకు నడచుటలేదు. కాంగ్రెస్ సంస్థకూడా ఇందువల్ల ఛిన్నాభిన్నమైపోగలదు." అని ఆయన ఒకమారు సెలవిచ్చెను. కాంగ్రెస్ అధ్యక్షోపన్యాసములోకూడ, అనేక ఉపమానోపమేయములతో ఇట్టి భావాలనే ఆయన వెలిబుచ్చెను. కేంద్రంలోను, అన్ని రాష్ట్రాలలోను అడుగడుగున ఉత్పన్నమవుతున్న ఈ ముఖ్యసమస్యను గురించి ఇంత అనిశ్చయభావాలు వుండి, ఏనిర్ణయము జరగకపోతే, కాంగ్రెస్‌సంస్థ ఛిన్నాభిన్నమైపోవటంలో ఆశ్చర్యం ఏమీలేదు. ప్రతి రాష్ట్ర కాంగ్రెస్ సంఘము తన రాష్ట్ర మంత్రులపై ఫిర్యాదుచేస్తున్నది; ప్రతి రాష్ట్రమంత్రులు తమ రాష్ట్ర కాంగ్రెస్‌పై ఫిర్యాదులు చేస్తూనేవున్నారు. ప్రతిరాష్ట్ర కాంగ్రెస్ సంఘంలోను, శాసనసభలోను కనీసం రెండు వర్గాలైనా వుంటున్నవి. రాష్ట్రపరిపాలన, రాష్ట్ర కాంగ్రెస్‌లు కేవలం గ్రూప్

రాజకీయాలుగా పరిణమిస్తున్నవి. కాంగ్రెస్‌లో అనైక్యతకు దారితీసి, దాని ప్రతిష్టనంతను నాశనముచేస్తున్నది ఈసమస్యయే. దీనివిషయమై ఇంతవరకుకూడా ఒక ఆచరణీయమైన ఏర్పాటు జరగకపోవటం శోచనీయం.

కాంగ్రెస్ ఆనాటికానాడు ప్రజలకు దూరమవుతున్నది. స్థానిక కాంగ్రెస్‌వాదుల ప్రవర్తన అసంతృప్తికరంగా వుండి, ప్రభుత్వంలో వున్నవారు ప్రజానీకపు కష్టనష్టాలను గమనించకుండా వ్యవహరిస్తూ, తమ స్వప్రయోజనాలు సాధించుకుంటుంటే ఇట్లు జరగక ఏమౌతుంది? అధికారంలోనికి వచ్చినతర్వాత కాంగ్రెస్ ప్రజలమాట మరచిపోయింది. మంత్రులు మొదలైన పెద్దలు—ఎవరో కొద్దిమందితప్ప—పర్యటనకు వెళ్ళినా ప్రభుత్వ భవనాలలో బసచేసి, ప్రభుత్వోద్యోగులతో సంప్రదించి, ప్రభుత్వ హోదాలో ఇతరులతో వ్యవహరించి, ప్రభుత్వ ప్రతినిధిగా, లాంఛనార్థం ఒకటి రెండు బహిరంగ సభలలో ఉపన్యసించటం జరుగుతున్నదేగాని, ఇదివరకటివలె సోదరులవలె, ప్రజలలో కలిసి మెలిసి తిరగటం, వారి కష్టనిష్టూరాలు ఆప్తులవలె తెలుసుకోవటం, తమ ప్రభుత్వాధికారాలను ఉపయోగించి వాటిని చక్కదిద్దటం జరగటంలేదు. ప్రతిమంత్రి, ప్రతిశాసనసభ్యుడు తన వ్యక్తిగత హోదాలో కొన్నిరోజులు పర్యటనచేసి, ప్రజల కష్టనిష్టూరాలు స్వయంగా గమనించాలను నిబంధన ఒకటివుండాలి.

కాంగ్రెస్ వాదులలోను, ప్రభుత్వోద్యోగులలోను వ్యాపించిన అవినీతి, లంచగొండితనము, స్వార్థపరతలను గురించి వేరేముచ్చటింప నక్కరలేదు. కాంగ్రెస్ మహావృక్షానికి ఇది వేరుపురుగని అగ్రనాయకులతోసహా అందరూ గ్రహించారు. దానిని నిరోధించి, కాంగ్రెస్‌ను కాపాడే విధానమాత్రం ఇంతవరకు ఎక్కడా తీవ్రంగా ఆలోచనలోనే లేదు. మే నెలాఖరున డేరాడూన్‌లో సమావేశమైన ఎ. ఐ. సి. సి. సమావేశంలో కాంగ్రెస్ ప్రభుత్వాలు-కాంగ్రెస్ సంస్థ, కాంగ్రెస్

వాదుల అవినీతి మొదలైన విషయాలపై రహస్యంగా చర్చలు జరిగాయి. ప్రభుత్వాన్ని, మంత్రుల వ్యవహారధోరణులను చాలమంది పెద్దలు విమర్శించారట. పండిట్ నెహ్రూ ప్రభృతులు తమ చర్యలను, రాష్ట్ర మంత్రుల చర్యలను సమర్థించుకుంటూ, అక్కడక్కడా లోటుపాట్లు వున్నవిషయం వాస్తవమేనని అంగీకరించారట. గాంధీజీ సూచించిన నిర్మాణాత్మక కార్యక్రమాన్ని కాంగ్రెస్ ప్రభుత్వాలు విస్మరించటం వల్లనే ఇటువంటి తప్పిదాలు జరుగుతున్నవని డా. రాజేంద్రప్రసాద్ అన్నాడట. మొత్తంమీద ఏ తీర్మానము చెయ్యకుండా ఈ సమావేశం ముగిసింది. ఈ రహస్యచర్చలవల్ల దేశానికి మంచిగాని, చెడుగాని జరిగింది ఏమీ లేదు.

ప్రతిరాష్ట్రంలోను గ్రూప్ రాజకీయాలు తీవ్రధోరణి వహిస్తున్నవి. కాంగ్రెస్ పైకి ఒకటిగా కనిపిస్తున్నా వాస్తవానికి అతుకుల బొంతగావున్నది. ఈ గ్రూప్ రాజకీయాలవల్లనే లంచగొండితనము, అవినీతి, స్వార్థపరత, కాంగ్రెస్ ప్రభుత్వాలు-కాంగ్రెస్ సంస్థలమధ్య విద్వేషాలు పెరిగిపోతున్నవి. ప్రతిరాష్ట్రంలోను తీవ్రధోరణిలోనే వున్నా. మద్రాస్, బెంగాల్, మధ్యభారత్‌లలో ఈ గ్రూప్ రాజకీయాలు చాల తీవ్రరూపందాల్చి, కాంగ్రెస్ ప్రతిష్టను నాశనంచేశాయి.

కొందరు మద్రాస్ మంత్రులపై తోటి కాంగ్రెస్‌వాదులు చేసిన ఆరోపణలు—లంచగొండితనము మొదలైనవి-విచారించటానికి కాంగ్రెస్ కార్యదర్శి శంకరరావ్ దేవ్ జూన్ నెలాఖరున మద్రాస్ విచ్చేశాడు. ఈయన ధోరణినిబట్టిచూస్తే ఈయనకు, కాంగ్రెస్ హైకమాండ్‌లోని ముఖ్యవ్యక్తులకు కూడా ఈగ్రూప్ రాజకీయాలతో ముఖ్య సంబంధం వున్నట్లు బోధపడింది. కొందరు మంత్రులపై జరిగిన ఆరోపణలు సత్యమైనట్లే కనబడుతున్నవని చెపుతూకూడా వారిని ప్రత్యేక న్యాయస్థానంలో విచారించవలసిందని ఈయన సిఫార్సు చేయలేదు. కాంగ్రెస్‌లోని కుళ్లును కడిగివేయుటానికి కాంగ్రెస్ హైకమాండ్ జంకుతున్నది.

ఈ ఆరోపణలపై ఇప్పటికి దాదాపు మూడు విచారణలు జరిగాయి. కాని ఫలితం, ప్రజలలో కాంగ్రెస్ హైకమాండ్ పట్ల గౌరవం నశించిపోవటం, ఒక్కటే కనిపించుతున్నది. ఇటువంటి ఆరోపణలు ధృవపడుతున్న కొంతమంది మంత్రులను, పెద్ద ఉద్యోగులను న్యాయస్థానాలలో విచారించి, శిక్షించితేగాని ప్రజానీకానికి కాంగ్రెస్‌పట్ల గౌరవ విశ్వాసాలు ఏర్పడవు.

మధ్యభారత్‌లోను, రాజాస్థాన్‌లోను కాంగ్రెస్ సంఘాలకు మంత్రివర్గాలకు తీవ్రవిభేధాలు ఏర్పడినవి. కాంగ్రెస్ సంఘాలు మంత్రివర్గాలపై అవిశ్వాస తీర్మానాలుచేశాయి. మంత్రుల లంచగొండితనం అనేక పర్యాయాలు బహిరంగంగా చర్చింపబడ్డాయి. ఈ ప్రతిష్టంభనలను ఏవిధంగాను పరిష్కరించటం చేతగాక, సంస్థాన యూనియన్ల మంత్రివర్గాలు ఆయా రాష్ట్ర కాంగ్రెస్‌లకుగాక సంస్థానశాఖకు మాత్రమే బాధ్యతవహిస్తున్నవని, వాటిపై అవిశ్వాస తీర్మానాలుచేసినా అవి అధికారంనుంచి వైదొలగ నక్కరలేదని సర్దార్ పటేల్ వంటి ప్రజాస్వామ్యవాది చెప్పవలసివచ్చింది. దీనివల్ల కాంగ్రెస్ ప్రతిష్ట ఆ ప్రాంతాలలో కూడా నశించిపోయిందేగాని, పరిపాలనగాని, కాంగ్రెస్-మంత్రివర్గ వ్యవహారాలుగాని ఏమాత్రము చక్కబడలేదు.

విభజనవలన, కాందిశీకుల ఆగమనమువలన, కమ్యూనిస్టుల అలజడులవలన అసలే గందరగోళముగానున్న పశ్చిమబెంగాల్‌లో కూడా కాంగ్రెస్ మంత్రివర్గము - రాష్ట్రకాంగ్రెస్ సర్దుకుపోలేక పోయినవి. ఈ గ్రూప్ విద్వేషాలవల్ల బెంగాల్ రాజకీయజీవితం మరీ కుళ్ళిపోయింది. భారత జాతికంతకు ఒకనాడు నాయకత్వంవహించిన బెంగాల్ ఈనాడు అతిజైన్యావస్థలోవున్నది. గ్రూప్ రాజకీయాలను సర్దటానికి చేసిన ప్రయత్నాలన్నీ విఫలమైపోయినవి; దౌర్జన్యచర్యలు విపరీతముగా జరుగుతున్నవి. దేశసరిహద్దులలోవున్న, అతిముఖ్యమైన, అతికీలకమైన ఈరాష్ట్రం అతిబలహీనంగావుండి, కమ్యూనిస్టు స్థావరమైపోతున్నది.

దేశానికి, తమకు ఎంత హానికలుగుతున్నా తమద్వేషాలను మరిచిపోవటానికి కాంగ్రెస్ నాయకులు అంగీకరించటంలేదు. ఇది చక్కబరచటానికి వీలులేని పరిస్థితి అని కాంగ్రెస్ హైకమాండ్‌తోసహా అందరూ గుర్తించారు. ఈ పరిస్థితులను ఒక తెన్నుకు తీసుకురావటానికి భారతప్రభుత్వం చాలరోజులనుంచి ఆలోచిస్తున్నది. కలకత్తాలో జరిగిన ఉపఎన్నికలో కాంగ్రెస్ అభ్యర్థి ఓడిపోవటంతో, ఇక కార్యాచరణకు పూనుకోవలసిన సమయం వచ్చినది. వాస్తవానికి ఈ ఎన్నికలో కాంగ్రెస్ అభ్యర్థి ఓడిపోవటం అంత పట్టించుకోవలసిన విషయంకాదు. శరత్ బోసును ఓడించగల కాంగ్రెస్‌వాది బెంగాల్‌లో లేనే లేడన్నవిషయం ఎరిగినదే. బొంబాయిలో సోషలిస్టునాయకుడు పురుషోత్తందాస్ త్రికందాస్ గెలిచినప్పుడు ఏర్పడని పరిస్థితి, శరత్‌బోస్ ఎన్నికలో ఏమీ ఏర్పడలేదు. కాంగ్రెస్ వాదులు ఓడిపోవటము, కాంగ్రెస్‌నుండి కొందరు రాజీనామా నివ్వటము పరిపాటిఅయిపోయిన సంగతులే. బెంగాల్‌లో ఈ ఎన్నికకుముందే, కాంగ్రెస్ వాదుల అనైక్యత, అసమర్థతలవల్ల ఏర్పడిన అసాధారణ పరిస్థితులవల్లనే ఈ ఎన్నిక ఇంతగా పట్టించుకుని, అదనుగాతీసుకుని, పరిస్థితులను చక్కబరచటానికి భారతప్రభుత్వం పూనుకున్నది. బెంగాల్ రాష్ట్ర కాంగ్రెస్‌కు, శాసనసభలకు త్వరలో ఎన్నికలు జరిపించాలని కాంగ్రెస్ హైకమాండ్ నిర్ణయించింది. ప్రస్తుతపు సంకుచిత ఓటర్లజాబితా ప్రకారమైనా కొత్త ఎన్నికలు జరగటం ముదావహం. దేశంలోను, ప్రజలలోను తమస్థానమేమిటో కాంగ్రెస్ తెలుసుకోగలుగుతుంది. నూతన రాజ్యాంగం తయారై, అమలులోనికి రావటానికి ఎట్లాగూ రెండు సంవత్సరాలు పట్టుతుంది కాబట్టి అన్నిరాష్ట్రాలలోగూడా, ఈసంవత్సరారంభంలోనే ఎన్నికలు జరిపించివుంటే చాలబాగుండేది.

నూతనరాజ్యాంగం అమలులోనికి వచ్చేవరకు తమస్థాయికి భంగం లేదని భావింటంవల్లనే కాంగ్రెస్ ప్రభుత్వాలు తమ ఇష్టంవచ్చినట్లు,

విచ్చలవిడిగా వ్యవహరిస్తున్నాయి. నూతనరాజ్యాంగం అమలులోనికి వచ్చినా, మొదటిపర్యాయమైనా, కాంగ్రెస్ ప్రతిష్టను ఆధారం చేసుకొని, తాము అధికారంలో వుండగలమని వారు ఆశిస్తున్నారు. దేశం స్వతంత్రమవంగానే ఎన్నికలు జరిపివున్నట్లయితే, కొత్తప్రభుత్వాలు ఏర్పడి, తమ బాధ్యతలను గుర్తించుకునేవి. ఇప్పుడైనా ఒక సంవత్సరంలోగా ఎన్నికలు జరిగితీరుతవని ఖచ్చితంగా తెలిస్తే, మన మంత్రులధోరణి చాలవరకు మారుతుంది. నూతనరాజ్యాంగం అమలులోనికిరాకముందు, ఇప్పటి సంకుచిత జాబితాలప్రకారం, ఎన్నికలు జరపటం అంతభావ్యంకాదని కాంగ్రెస్ పెద్దలు భావిస్తున్నారు. అట్లనుకొన్నవారు నూతనరాజ్యాంగం వెంటనే అమలులోనికి వచ్చేటట్లు త్వరత్వరగా ప్యాసుచేయను, ముసాయిదా చర్చలకు సమావేశాలు జరపటమే లేదు. నూతనరాజ్యాంగం ప్యాసైనతర్వాత ఎన్నికలు ఎంతకాలానికి జరుగుతవో తెలియదు. ఫలానా సమయానికి నూతనరాజ్యాంగం అమలులోనికి వస్తుందని, తర్వాత ఫలానా సమయానికి ఎన్నికలు జరిగితీరుతవని ఖచ్చితంగా తెలిస్తే, దేశంలో పరిస్థితి కొంతవరకు చక్కబడుతుంది. ఈ విషయాలు కాంగ్రెస్ అగ్రనాయకులు తేల్చటంలేదు.

మే మూడవవారంలో డేరాడూన్‌లో సమావేశమైన ఎ. ఐ. సి. సి. కామన్వెల్తు సంబంధాన్ని ఆమోదించింది. పటేల్ నెహ్రూలు సూచించినదానికి లాంఛనప్రాయపు ముద్రవేయటంకంటె ఎ. ఐ. సి. సి. ఇంకొకటి ఏమీ చేయలేని రోజులలో, ఇంతకన్న వేరేమీ జరుగుతుందని ఎవ్వరూ ఆశించలేదు.

భారతదేశంలో ప్రజాస్వామ్య పరిపాలనాపద్ధతిని ప్రవేశపెట్టి స్థిరపరచాలని కాంగ్రెస్ ప్రయత్నిస్తున్నది. ఈనాటివరకు కూడా భారతదేశంలో కాంగ్రెస్ ఏకైక జాతీయసంస్థ. అటువంటి కాంగ్రెస్‌లోనే ప్రజాస్వామ్య పద్ధతులు ఎంతవరకు అమలుజరుగుతున్నవన్నది సందేహాస్పదమైన విషయముగా పరిణమించింది. నేడు భారతదేశంలో

ఏకపక్ష ప్రజాస్వామ్యం—ఏకపక్షనియంతృత్వం — అమలులో వున్నది. ఆ ఏకపక్షంకూడా అగ్రనాయకద్వయం నియంతృత్వంలో వుండటం వల్ల, నేడు భారతదేశంలో, రష్యాలోవలె, ప్రజాస్వామ్యం నామ మాత్రంగావుండి, ఏకపక్షనియంతృత్వం అగ్రనాయకద్వయం ద్వారా అమలు జరుగుతున్నది. అయితే, రష్యాలో స్టాలిన్‌వలె మన అగ్రనాయకులు స్థానాన్ని స్థిరపరచుకోలేక, చియాంగ్ కై షేక్ త్రోవననుసరిస్తున్నట్లు కనబడుతున్నారు.

కాంగ్రెస్ భవిష్యత్తు అగ్రనాయకుల భవిష్యత్తుపై ఆధారపడి వున్నదనటం అతిశయోక్తి కాదు. ఈనాడు కాంగ్రెస్ నామమాత్రంగానైనా ఒక్కటిగా కనిపించటానికి అగ్రనాయకులపట్ల భక్తి, గౌరవమే కారణం. ఇది తొలగిననాడు కాంగ్రెస్ ఛిన్నాభిన్నం కాకుండా వుంటుందని చెప్పగల్గటం అతి సాహసమే అవుతుంది.

ఈనాడు కాంగ్రెస్ తనజీవితంలో అతి విషమఘడియలలో వున్నది. ఇది అధిగమించలేనంతటి విషమస్థితి కాదుగాని, కాంగ్రెస్ దానిని అధిగమించగలదా అన్నదే సందేహాస్పదము. ప్రస్తుత ముఠారాజకీయాలు, విద్వేషాలు, అవినీతినుండి తప్పించి, కాంగ్రెస్‌ను రక్షించగల శక్తి ఏదైనావుంటే దానిని ఐంద్రజాలికశక్తి అని మాత్రమే పిలవవలసి వుంటుంది.

# రాజకీయ పక్షాలు

కాంగ్రెస్ భారతదేశానికి అపారమైన సేవచేసింది. శాంతియుత, అహింసాయుత విధానాలద్వారా దేశానికి స్వాతంత్ర్యం సముపార్జించి నందుకు భారతీయులు, తరతరములవారు, కాంగ్రెస్‌ను కృతజ్ఞతతో స్మరించుకుంటారు. కాని కాంగ్రెస్ తన లక్ష్యాన్ని సాధించిన రెండేండ్ల కాలంలోనే, దానివ్యవహారాలు ప్రజలకు విసుగుపుట్టించి, ఇతర పార్టీల అభివృద్ధికి దోహదంచేస్తున్నవి.

దేశస్వాతంత్ర్య సముపార్జనతో పరిపాలనాధికారం కాంగ్రెస్‌కు లభించింది. కేంద్రంలోను, రాష్ట్రాలలోను కాంగ్రెస్ ప్రభుత్వాలు ఏర్పడినవి. కాంగ్రెస్‌కు సాటియైన రాజకీయసంస్థ దేశములో ఇంకొకటి ఏదీలేకపోయింది. దేశవిభజనతో, కాంగ్రెస్‌కు ప్రతికూలపక్షమే ఇంకొకటి లేకపోయి, అన్నిరాష్ట్రాల శాసనసభలలోను ప్రతికూలపక్షము లేక ప్రజాస్వామ్యవిధానం సరిగా పాతుకొనలేదు. తమను విమర్శిస్తున్నా, కాదనగలవారు లేకపోవటంవలన, తమస్థానాలు ఆక్రమించుకోగలిగిన ఇతరులు లేకపోవటంవలన కాంగ్రెస్ ప్రభుత్వాలలో నిర్లక్ష్యము, స్వార్థపరత్వము, కాంగ్రెస్‌వాదులలో విద్వేషాలు పెచ్చుపెరిగాయి. తాముతప్ప దేశానికి గత్యంతరంలేదనే భావముతో కాంగ్రెస్‌వారు వ్యవహరిస్తున్నారు.

దేశంలో ఆదినుంచి కాంగ్రెస్‌కు వ్యతిరేకంగావున్న పార్టీలు కమ్యూనిస్టులు, ముస్లింలీగ్. దేశవిభజనతో ముస్లింలీగ్ మూల పడి పోయింది. కమ్యూనిస్టులు ఎప్పుడూ వినాశాత్మక విమర్శలుచేస్తూ, దేశ క్షేమానికి వ్యతిరేకులని పేరుపొంది, విధ్వంసక చర్యలు ప్రారంభించి, అణచివేయబడి, నామమాత్రంగా పార్టీగా వుంటున్నారు.

దేశంలో అన్ని ప్రాంతాలలోను ఏకపార్టీ ప్రభుత్వాలు ఏర్పడినా ఇతర రాజకీయపక్షాలను వారు అణచివేశారని చెప్పటానికి వీలులేదు. చట్టసమ్మతంగా వ్యవహరించే ఇతరపార్టీలను వారు సామాన్యంగా, ఆటంక పరచటంలేదు. అయితే, ఇతర పార్టీలు వృద్ధిపొంది తమ స్థానాలను ఆక్రమించుకోవలసిందని హృదయపూర్వకంగా వారు ఆశిస్తున్నారని ఎవ్వరూ చెప్పలేరు. ఇతరపార్టీలు ఇప్పుడు కొత్తగా ఏర్పడి, బలపడటానికి కొన్ని దశాబ్దాలైనా పట్టుతుందని వారు భావిస్తున్నారు కాబట్టి వాటిని నిర్లక్ష్యభావంతో చూస్తున్నారని చెప్పవచ్చును. ఇంతకన్న కాంగ్రెస్ ప్రభుత్వాలనుంచి ఆశించదగింది ఏమీ లేదు.

కాంగ్రెస్‌నుంచి గతసంవత్సరం విడిపోయిన సోషలిస్టులు, కాంగ్రెస్ వామపక్షాలుగా ఇదివరకటినుండి వ్యవహరిస్తున్న ఫార్వర్డ్ బ్లాక్ మొదలైన వర్గాలు, కాంగ్రెస్‌నుండి విడిపోయిన తర్వాత శ్రీ శరత్‌చంద్రబోస్ ఏర్పరచిన సోషలిస్టు రిపబ్లికన్ పార్టీ మొదలైనవి ఇప్పుడిప్పుడే పైకివస్తున్న పార్టీలు. వీరు ఇప్పుడిప్పుడు పైకివస్తూ, కాంగ్రెస్‌ను ధిక్కరించగలంత బలం చేకూర్చుకుంటున్నారు. భవిష్యత్తులో కాంగ్రెస్‌తో, చట్టబద్ధంగా ప్రతికూలంగా వ్యవహరించే పార్టీలు ఇవే.

కమ్యూనిస్టు పార్టీ ఈ సంవత్సరం మరికొన్ని వెర్రితలలు వేసింది. హైదరాబాద్ ప్రభుత్వం కూలిపోతుండగా రజాకార్లవద్ద ఆయుధాలు పుష్కలంగా వీరు సంపాదించారు. కమ్యూనిస్టులు చైనాలో జయాలు పొందుతున్నకొద్దీ, పూర్వోత్తర సరిహద్దునుంచి, అస్సాంగుండా వీరికి ఆయుధాలు, ఇతర సహాయము లభించే అవకాశం వృద్ధిఅవుతున్నది. బర్మాలో తిరుగుబాటుచేస్తున్న కమ్యూనిస్టులతో వీరికి ప్రత్యక్ష సంబంధాలు వున్నాయి. ఇన్నిమార్గాలగుండా ఆయుధాలు సేకరించుకుంటూ, హఠాత్తుగా విప్లవం జరపాలని వీరు ప్లానువేసుకున్నారు. మార్చినెలలో బెంగాల్‌లో ప్రారంభించి, క్రమేణా దేశమంతటా సర్వవ్యాప్తమయ్యే

జరిపించి, ప్రజలలో అసంతృప్తి వ్యాపింపజేసి, తరువాత హఠాత్తుగా విప్లవంజరపాలని వీరు ప్రయత్నించారు. వీరిప్లాను ప్రభుత్వానికి ముందు గానే తెలిసింది. దేశమంతటా కమ్యూనిస్టులు అరెస్టు చేయబడినారు. దేశంలో సమ్మెలు జరపటానికి వీలులేకుండా శాసనంచేయాలని ప్రభుత్వం ఆలోచించింది గాని సమ్మెలు జరుగనీయమని కార్మిక నాయకులు హామీ యిచ్చినపిమ్మట ఈప్రయత్నం విరమించింది. హైదరాబాద్, బెంగాల్ లలో కమ్యూనిస్టులు దురంతాలు ప్రారంభించారు. బెంగాల్‌లో కొన్ని ఫ్యాక్టరీలపైన, పోలీసుఠాణాలపైన దాడులు జరపటం, వ్యక్తులను హత్య చేయటం మొదలైన దుర్మార్గాలు విరివిగా జరిపారు. ఇప్పటికికూడా పరిస్థితిఅదుపులోకి వచ్చిందని, కమ్యూనిస్టు దురంతాలు పూర్తిఅయా యని చెప్పటానికి వీలులేకుండా వున్నది. మొత్తంమీద కమ్యూనిస్టుపార్టీ ఈ దేశంలో తనకు స్థానంలేకుండా చేసుకుంటున్నది.

సోషలిస్టుపార్టీ ఈ సంవత్సరం చెప్పుకోతగ్గంతగా వృద్ధి చెంద లేదు. హింద్ మజ్‌దూర్ సభ అను కొత్తకార్మిక సంస్థను స్థాపించటమే వీరుచేసిన ముఖ్యమైనపని. సోషలిస్టుపార్టీ సమావేశం మార్చినెలలో పాట్నాలో జరిగింది. కమ్యూనిస్టుల విధానాలను ఖండిస్తూ, చట్టబద్ధ, శాంతియుత ప్రతికూలపార్టీగా వ్యవహరిస్తూ, ప్రజానీకానికి సేవచేయు టమే తమలక్ష్యమని వీరు పునరుద్ఘాటించారు. సోషలిస్టుపార్టీ అభ్యర్థులు ఒకటిరెండు ఉపఎన్నికలలో కాంగ్రెస్ వాదులను ఓడించగలిగారు.

సోషలిస్టుపార్టీ ప్రచారము, సంఘటన, పార్టీ యంత్రము ఏమా త్రము వృద్ధిపొందటం లేదు. సోషలిస్టులు తమ అభివృద్ధికి తమ స్వశక్తి పైనగాక కాంగ్రెస్‌పార్టీ తప్పులపైననే ఎక్కువగా ఆధారపడివున్న ట్లున్నది. సోషలిస్టు నాయకులందరు యువకులు, ఉత్సాహవంతులు; కార్యదీక్షతో పనిచేయగలవారు; తమపార్టీని స్థాపించవలెనను పట్టు దలతో కాంగ్రెస్‌నుండి బయటికి వచ్చినవారు. వీరు ఒక సంవత్సర కాలంలో సాధించినది ఎట్టివారికైనా అసంతృప్తి కలిగించకమానదు

సోషలిస్టుపార్టీ ఈ పద్ధతులపై వృద్ధిపొందుతూంటే ఒకటిరెండు దశాబ్దముల వరకు అది ఒకజాతీయపార్టీ స్థాయికి రాలేదు.

వామపక్షాలలో ఈసంవత్సరం తీవ్రంగా కృషిచేస్తున్నది శ్రీ శరత్ బోస్ ఒక్కడే. వృద్ధాప్యము, జాడ్యము ఎంత ఆటంకముగా వున్నా, ఆయన అతిఉత్సాహముతో కృషిచేస్తూ, వామపక్షాల ఏకీకరణకు ప్రయత్నం చేస్తున్నాడు. కలకత్తా ఎన్నికవంటిది ఆయనకు అంత ముఖ్యమైన విజయమని చెప్పలేము; కలకత్తాలో ఆయన ఓడిపోతాడని ఎవ్వరూ భావించలేదు. తాను స్థాపించిన సోషలిస్టు రిపబ్లికన్ పార్టీని బలపరచటము, ఫార్వర్డ్‌బ్లాక్, సోషలిస్టుపార్టీ, మహారాష్ట్రలో మోరే ప్రభృతుల ఆధ్వర్యాన నడుస్తున్న కిసాన్, ప్రజాపార్టీ మొదలైన వామపక్షాల నన్నిటిని సమీకరించి, ఐక్యపరచి, సంఘటితపరచటము తన ముఖ్యకార్యక్రమంగా ఆయన కృషిచేస్తున్నాడు. దేశంలోని వామపక్ష నాయకులు చాలమందితో ఈయన సంప్రదింపులు జరిపాడు. బొంబాయి, కలకత్తా మొదలైన పట్టణాలలో ఈభావాలు ప్రజామోదం పొందుతున్నాయి.

దేశంలో ప్రస్తుత పరిస్థితులనుబట్టిచూస్తే, చట్టబద్ధంగా పనిచేసే బలవత్తరమైన ప్రతికూలపార్టీ ఒకటి ఎంతైనా అవసరం అని బోధపడుతున్నది. ఈపార్టీ వెంటనే కాంగ్రెస్ పార్టీస్థానాన్ని ఆక్రమించకపోయినా, అందుకు తగిన, సన్నద్ధమైవున్న పార్టీ ఒకటి వుందనే భయము కాంగ్రెస్‌వాదుల ప్రవర్తనలో, వ్యవహార ధోరణిలో చక్కని మార్పును తెచ్చి తీరుతుంది. అప్పుడు కాంగ్రెస్ దేశాభ్యుదయకర విధానాలను అనుసరించి తీరవలసివస్తుంది; లేకుంటే రెండవపార్టీ ఆ స్థానాన్ని ఆక్రమిస్తుంది. ఇది రెండువిధాలా దేశానికి మంచిచేస్తుంది. దేశంలో ఏకపక్ష నియంతృత్వంపోయి, ప్రజాస్వామ్య విధానానికి, పార్లమెంటరీ పద్ధతికి, ప్రజా పరిపాలనకు చక్కని పునాది పడుతుంది.

ఒక్క సోషలిస్టులు తప్ప తక్కిన వామపక్షాలన్నీ వామపక్ష ఏకీకరణకు అంగీకరించాయి. సోషలిస్టు నాయకుడు శ్రీ జైప్రకాశ్ నారాయణ ప్రస్తుతం కలకత్తాలోవుండి శ్రీ బోస్‌తో సంప్రదింపులు జరుపుతున్నాడు. ఇతర వామపక్షాలన్నీ సోషలిస్టు పార్టీలోనే కలిసిపోవచ్చునుకదా అని సోషలిస్టులు అంటున్నట్లు తెలుస్తున్నది. ఈసమస్యపైన ఈ సంప్రదింపులు భగ్నం కావచ్చును. కనీసం, బెంగాల్ ఎన్నికలకు సంబంధించినంత వరకైనా వామపక్షాలన్నీ ఏకోన్ముఖంగా కృషి చేసేటట్లు చేయటానికి ప్రయత్నాలు జరుగుతున్నవి. ఇందుకు సోషలిస్టులు బహుశః అంగీకరించవచ్చును. బెంగాల్ ఎన్నికలలో వామపక్షాలు అన్నీ విడివిడిగా, పోటీచేస్తే, అన్నీ ఓడిపోయి, కాంగ్రెస్ గెలవటమే తథ్యం. ఈవిషయం ఆ నాయకులకందరికి తెలుసును. వామపక్షాలన్నీ సంయుక్తంగా ప్రయత్నిస్తే, కాంగ్రెస్ ఒకవేళ గెలవగల్గినా చాల తీవ్రమైనపోటీ జరిగినతర్వాతనే, అత్యల్పమెజారిటీతోనే గెలుపొందగలదు. ముందు బెంగాల్ ఎన్నికలలో వామపక్షాలన్నీకలిసి, సంయుక్తంగా కృషిచేస్తే దానిఫలితము, ఆ అనుభవము పురస్కరించుకుని, వీలువెంట దేశానికంతకు ఆ ఏకీకరణ వ్యాపింపజేయవచ్చును. ఇటువంటి అనుభవమును పురస్కరించుకుని జరిగిన ఏకీకరణ అన్నిపక్షాలకు సంతృప్తికరముగాను, శాశ్వతముగాను వుండి, దేశానికి వాస్తవమైన సేవచేయగలదు.

ముస్లింలీగ్ రాజకీయాలనుంచి పైదొలగినది. ముస్లింలీగర్లు చాలమంది కాంగ్రెస్‌లోను, సోషలిస్టుపార్టీలోను జేరినారు. పేరుకు ముస్లింలీగ్ మాత్రం ఇంకా బ్రతికేవున్నది. హిందూమహాసభ రాజకీయాలలో ప్రవేశించటంతో, ముస్లింలీగ్ కూడా తిరిగి రాజకీయాలలో ప్రవేశించాలని దాని అధ్యక్షుడు మహమ్మద్ ఇస్మాయిల్ భావిస్తున్నట్లు తెలుస్తున్నది. ముస్లింలీగ్ యికముందు ఒకవేళ రాజకీయపార్టీగా అవతరించినా, దాని పలుకుబడి చాల తక్కువగావుండి, దాని కోరికలు అధికసంఖ్యా

కులకు చిరాకుపుట్టించి, భారత ముస్లింలకు అపకారాన్ని మాత్రమే చేయగలదు. సంయుక్త నియోజకవర్గాల ప్రకారం ఎన్నికలు జరగబోయేటప్పుడు ముస్లింలీగ్ ఏ శాసనసభలలోను ప్రాతినిధ్యం సంపాదించలేదు. కాబట్టి లీగ్ ఒక వేళ రాజకీయాలలో ప్రవేశించినా అది నామమాత్రంగానే వుండిపోతుంది.

అకాలీ సిక్కులు ఈ సంవత్సరం భారతప్రభుత్వంతో బలాబలాలు చూచుకున్నారు. సిక్కులకు ప్రత్యేక సిక్కుస్థాన్ కావాలనీ రాజ్యాంగచట్టంలో ప్రత్యేకహక్కులు, స్థానాలు హామీయివ్వాలని కోరుతూ మాస్టర్ తారాసింగ్ అలజడి ప్రారంభించాడు. పరిస్థితి విషమించకముందే అతనిని, అతని అనుచరులను ప్రభుత్వం అరెస్టుచేసింది. ఇప్పుడు పరిస్థితి చక్కబడింది కాబట్టి ప్రభుత్వం ఆయనను విడుదల చేయవలసివుంది.

హిందూమహాసభ తిరిగి రాజకీయాలలో ప్రవేశిస్తున్నది. ఇందువల్ల భారతరాజకీయరంగంలో ఎట్టిమార్పురాదు. హిందూమహాసభ ఎప్పుడూ ఒక నామమాత్రమైన పార్టీయే. ఇప్పుడు అంతకన్న అధమముగ వుండిపోతుంది. హిందూమహాసభ వామరాజకీయ పక్షముగా ఎన్నటికీ తయారు కాలేదు. దాని ప్లానులుమాత్రం పైకి బ్రహ్మాండంగా కనిపించినా ఆ వ్యవహారమంతా నేతిబీరకాయవలె వుంటుంది.

ఆర్. ఏస్. ఎస్. పై నిషేధాన్ని ప్రభుత్వం ఈమధ్య తొలగించింది. ఈసంఘం రాజకీయాలలో జోక్యం కల్గించుకోదనీ, వైజ్ఞానికాభ్యుదయకర సంస్థగా మాత్రమే పనిచేస్తుందని, దీనిపద్ధతులు, నిబంధనావళి ప్రభుత్వమోదానికి దాఖలు చేస్తానని సర్ సంఘ చాలక్ వాగ్దానం చేసిన పిమ్మట ఆయనను విడుదలచేశారు. సత్యాగ్రహంచేసి, జైళ్ళకు వెళ్ళిన సంఘసభ్యులందఱిని కూడ విడుదలచేశారు. క్రమశిక్షణాయుతులై, సుశిక్షితులైన ఈ సంఘసభ్యులు, రాజకీయాలలో ప్రవేశిస్తే, ఒక విశిష్ట స్థానాన్ని పొందగలరు. కమ్యూనిస్టుల దౌర్జన్యాలనుండి దేశాన్ని కాపాడటానికి తమకు అవకాశం ఇవ్వవలసిందని వీరు ప్రభుత్వాన్ని

కోరివున్నారు. ఇటువంటి అవకాశం వీరికిస్తే, ఆ కమ్యూనిస్టుల స్థానాన్నే ఆక్రమించి కాంగ్రెస్‌కు ముప్పుతెస్తారేమోనని ప్రభుత్వం భయపడుతున్నట్లున్నది. ఈసంఘం ఏవిధంగా పరిణామం పొందుతుందో జాగ్రత్తగా వేచిచూడాలి.

ఈసంవత్సరం దేశంలో ఎక్కడజూచినా కాంగ్రెసేతర రాజకీయ పక్షాల సభ్యులకు సామాన్య పౌరహక్కులు కూడా నిరోధింపబడుతున్నవను ఫిర్యాదు వినబడుతున్నది. ఇతర రాజకీయపార్టీల సమావేశాలను నిషేధించటము. ముఖ్యసభ్యులను అరెస్టుచేయుటము, పోలీసు జులుం మొదలగు భీభత్సకాండ, ముఖ్యంగా కమ్యూనిస్టులపై విరివిగా జరుగుతున్నది. దేశంలో ఇతర రాజకీయ పార్టీలు వృద్ధిపొందటానికి, దేశంలో ప్రజాస్వామిక విధానం స్థాపించటానికి ఇది పెద్ద ఆటంకముగావున్నది. ఈ విషయములో కాంగ్రెస్ ప్రభుత్వాలు చాల నిరంకుశంగాను, బ్రిటిష్ ప్రభుత్వాన్ని మెరుగనిపించేవిగాని వ్యవహరిస్తున్నవనికూడా చాలమంది భావిస్తున్నారు. కాంగ్రెస్ ప్రభుత్వాలు వాస్తవానికి, ఇంత విమర్శకు తగవు. దేశంలో కొన్ని రాజకీయపార్టీలు—ముఖ్యంగా కమ్యూనిస్టులు - దౌర్జన్యవిధానంద్వారా, హత్యలద్వారా, సమ్మెలద్వారా, ప్రభుత్వాన్ని కూలద్రోయాలని ప్రయత్నిస్తున్నారు. గ్రామగ్రామాలలో వ్యాపించి, వారు దుష్ప్రచారము, దౌర్జన్యము వ్యాపింపచేస్తున్నారు. వారిని అరికట్టి, దేశస్వాతంత్ర్యాన్ని, స్వేచ్ఛను కాపాడటం ప్రభుత్వకర్తవ్యం. ఒకవేళ వాస్తవంగా కమ్యూనిస్టులే అధికారంలోకివస్తే పౌరహక్కులు అనేవి పేరుకుకూడా లేకుండ పోతవన్నది తెలిసినవిషయమే; అట్టివారే ఇప్పుడు పౌరహక్కులకు భంగం కలుగుతున్నదని వాపోతున్నారు. దేశస్వాతంత్ర్యానికి, శాంతికి భంగం కలిగించేటటువంటి పౌరహక్కులు వుండటం ప్రమాదం కాదా?

ఇతర రాజకీయపక్షాలపట్ల ప్రభుత్వం ఏమీ వక్రవిధానం అవలంభించటంలేదు. అక్కడక్కడ, అప్పుడప్పుడు, ఆవిధానాన్ని ఉద్యోగులు

అర్థంచేసుకుని, అమలుజరపటంలో కొంచెంత తప్పులు జరుగుతూ, ప్రభుత్వానికి అప్రతిష్ట తెస్తున్నాయి. దురదృష్టవశాత్తు, మన పోలీస్ శాఖ రెండుమూడు శతాబ్దాలు వెనకబడివున్నది. దాని వ్యవహారధోరణి మారనంతవరకు ప్రభుత్వం విమర్శకు పాలౌతూనే వుంటుంది. అక్కడక్కడా ప్రభుత్వంకూడా తప్పువిధానాలను అనుసరించటంలేదని చెప్పటానికి వీలులేదు. ఢిల్లీలో రామమనోహర లోహియా అరెస్టువంటి అనవసర నిర్బంధాలు జరుగుతూనేవున్నవి. కాకులగుంపునుంచి కోయిలను వేరుపరచటం కష్టం కావచ్చుగాని అసాధ్యంకాదు. దేశానికి ముప్పుతెస్తున్న పౌరులహక్కులను నిరోధించవచ్చునుగాని దేశ శ్రేయోభిలాషుల హక్కులకు భంగం కల్గించటం ఎందుకు? చట్టబద్ధంగా నడిచే పార్టీలకు, మీటింగులు జరపటానికి, ప్రచారంచేసుకోటానికి తప్పకుండా అవకాశంవుండాలి. కాంగ్రెస్ నాయకులు, ఇతరపార్టీల నాయకులు ఈవిషయమై ఒక రాజీసంప్రదింపులుజరిపి, సంతృప్తికర విధానాన్ని ఏర్పరచుకుని, దేశ రాజకీయజీవితానికి ఏ అటంకము, ముప్పు, నిరోధము రాకుండా వుండేటట్లు వ్యవహరించవలసి వున్నది. దౌర్జన్యపద్ధతులను అన్ని రాజకీయ పార్టీలు పూర్తిగా నిషేధించాలి. ఏయేసమయాలలో పౌరహక్కులను నిరోధం కలిగించవచ్చునో అన్నిపార్టీలు ముందుగా నిర్ణయించుకోవాలి; ఆనిర్ణయాలు, కాంగ్రెస్‌తోసహా అన్నిపార్టీలకు వర్తించాలి. దౌర్జన్యవాదులను నాశనంచేయటానికి అన్నిపార్టీలు ఐక్యంగా కృషిచేయాలి. ప్రభుత్వవిధానాన్ని పోలీసు శాఖ సరిగా, సమంజసంగా, దౌర్జన్యరహితంగా అమలు జరిపేటట్లు ఏర్పాట్లు చేయాలి. అప్పుడు దేశంలో రాజకీయ వాతావరణం ప్రశాంతమై, ప్రజాస్వామ్యానికి తావులభిస్తుంది.

# పర్యావలోకనం

భారతదేశం స్వతంత్రమైన తర్వాత గ్రిగున రెండేండ్లు గడచిపోయినవి.

స్వతంత్ర భారత ప్రభుత్వం ఈ రెండేడ్లలోను దేశాభ్యుదయానికి ఓపినంతకృషి చేస్తూనేవున్నది. దురదృష్టవశాత్తు భారత ప్రభుత్వకృషి మనం ఆశించినంత ఫలప్రదం కావటంలేదు. సామాన్య మానవుని జీవితం ఆనాటికానాడు దుర్భరమైపోతున్నది. భారత ప్రభుత్వం అనేక క్లిష్టసమస్యలకు వారసై వచ్చినది. దానికితోడు ఎప్పటికప్పుడు అతి క్లిష్టసమస్యలు ఉత్పన్నమవుతూ ప్రభుత్వ నిర్మాణాత్మక కార్యక్రమం కాలనిర్ణయం లేకుండా వాయిదా పడిపోవలసివస్తున్నది. భారతదేశాభ్యున్నతి, ప్రజాజీవనస్థాయి అభివృద్ధి ఎప్పటివలెనే పగటికలలుగా మాత్రమే మిగిలిపోతున్నాయి. ఆ విషయం ఆలోచించటానికికూడా ప్రభుత్వానికి తీరిక లభించటంలేదు.

రాజకీయంగాను, ఆర్థికంగాను ఈసంవత్సరారంభంలో కన్న అంతంలోనే దేశం విషమపరిస్థితులలో వున్నది. కాశ్మీర్ విషయం ఇంకా ఏమీ నిశ్చయం కాలేదు సరికదా అక్కడ మనకు ప్రతికూల సంఘటనలు జరుగుతున్నవి. ఈమధ్య జరిగిన సంప్రదింపులలో అంగీకరించిన యుద్ధవిరమణగీత ప్రకారం కాశ్మీర్‌లో అతికీలకమైన ఉత్తర ప్రాంతమంతా పాకిస్థాన్‌కు చెందిపోయింది. రష్యా, ఆఫ్ఘనిస్థాన్, చైనాలకు సరిహద్దులోనున్న గిల్గిట్, బాల్టిస్థాన్‌లు పాకిస్థాన్‌కూ, టిబెట్ సరిహద్దునవున్న లడఖ్ లోయ భారతదేశానికి అప్పజెప్పారు. ప్రపంచంలోకెల్లా గిల్గిట్ ప్రాంతం అతికీలకప్రాంతం. భారత ప్రభుత్వం కొంచెం ముందుగా మేల్కొని, జాగ్రత్తగా వుండినట్లయితే ఈ ప్రాంతం పాకిస్థాన్ చేతిలోకి పోయివుండేదికాదు. ఐక్యరాజ్యసమితివల్ల మనకు న్యాయం, లాభం చేకూరుతుందని ఆశఏమీ కలగటంలేదు. ఐక్యరాజ్య

సమితి ఆధ్వర్యాన ప్లెబిసైట్ జరిగే సంగతి అనుమానస్పదంగానే వున్నది. ఒకవేళ ప్లెబిసైట్ జరిగినా, దానిఫలితం ఎట్లావున్నా ఇప్పుడు పాకిస్థాన్ ఆక్రమణలోవున్న ప్రాంతం మనకు దక్కుతుందని అనుకోవటం పొరపాటే.

భారత భూభాగంలో విదేశస్థులకువున్న స్థావరాలు తిరిగి భారత ప్రభుత్వాధికారంలోనికి వచ్చేసమస్యకూడ అంత తేలికగా పరిష్కార మయ్యేటట్లులేదు. వీటిలోకూడ ఫ్రెంచివలసల భవిష్యత్తు నిర్ణయమైనంత తేలికగా పోర్చుగీసు వలసల విషయం తేలేటట్లులేదు. చంద్రనాగూర్ భారతదేశంతో జేరిపోయింది. ఇతర ఫ్రెంచివలసలలో త్వరలోనే ప్లెబిసైట్ జరుగుతుంది; అవి ఎటునిర్ణయిస్తవో ఇప్పుడు చెప్పగల్గటం సాహసమే.

దేశంలో కమ్యూనిస్టు అలజడి ఒక పీడగావున్నది. బెంగాల్, హైదరాబాద్, ఆంధ్ర ప్రాంతాలలో ప్రజాజీవితానికి వీరు కంటకంగా వున్నారు. వీరిని అణచివేసే ఉద్దేశ్యంతో పోలీసులుజరపే దుశ్చర్యలు ప్రజలకు మరింత బాధాకరంగావున్నవి. మొత్తంమీద, కమ్యూనిస్టు అలజడివల్ల దేశవాతావరణం ప్రమాదపూరితమైపోయినది. కమ్యూనిస్టులను అణచటానికి పౌరహక్కులపై విధించిన నిర్బంధాలు ఇతర పార్టీలకు అసంతృప్తిని కలిగిస్తూ, ప్రభుత్వంపట్ల ద్వేష, క్రోధాలను పుట్టిస్తున్నాయి.

కాంగ్రెస్ వాదుల నైతిక పతనము కాంగ్రెస్ విచ్ఛిత్తికి దారి తీస్తున్నది. కాంగ్రెస్‌ను బలహీనంచేసి, దాని ప్రతిష్టను, పలుకుబడిని నాశనంచేసి, దాని స్థానాన్ని ఆక్రమించుకొనవలెనని అనేక రాజకీయ పక్షాలు కృషిచేస్తున్నవి. ఇవన్నీ కలిసి, సంయుక్తంగా కృషిచేసే అవకాశంకూడా వున్నది. ఇది జరిగితే దేశంలో అశాంతి, అలజడి, ప్రచారము వృద్ధిఅయి, వైషమ్యాలు పెరిగి పౌరజీవితం మరింత కష్టమౌతుంది. అటు కమ్యూనిస్టుల దౌర్జన్యంవల్ల, ఇటు కాంగ్రెస్‌వాదుల అవినీతివల్ల, ఇటు ఇతర పార్టీల పటాటోపాలవల్ల దేశంలో ఒక విపత్కర పరిస్థితి ఏర్పడింది.

ఆర్థికరంగంలో కూడ దేశం ఇంకెటి విపత్కర పరిస్థితులలోనే వున్నది. ఆహారసమస్య అతివిషమమై, దేశ ఆర్థిక సౌష్టవాన్ని నాశనం చేసేటట్లున్నది. ఆహార రంగంలో 'యుద్ధం' ప్రకటింపబడినా, ఫలితాలు ఇంతత్వరలో కనపడేటట్లు లేదు; కేంద్రప్రభుత్వ ఆజ్ఞలను, విధానాలను రాష్ట్రాలు ఉత్సాహంతో, పట్టుదలతో ఆచరణలో పెట్టడంలేదు. రేషనింగ్ మొత్తం సరిపోవక ప్రజారోగ్యం చెడిపోవటమూ, బ్లాక్ మార్కెట్ వ్యాపించటము జరుగుతున్నది. ఆహారసమస్యవల్ల అనేక యితర సమస్యలు ఉత్పన్నమై, దేశ అర్థికాభ్యున్నతికి అడ్డుపడుతూ, పరిస్థితిని మరింత విషమింపజేస్తున్నాయి.

ఇన్ఫ్లేషన్ నిరోధానికి ప్రభుత్వం జరిపిన చర్యలు చెప్పుకో తగ్గంతగా ఫలప్రదంకాలేదు. ఇన్ఫ్లేషన్ నిరోధానికి ప్రభుత్వం అవలంబించిన విధానం అసమగ్రము, అసంపూర్ణముగావుండి, ఇన్ఫ్లేషన్, ధరలు పెరగటానికి తావిస్తున్నది. దేశంలో వస్తువుల ధరలు పెరుగుతున్నాయి. రైల్వే, పోస్టల్ మొదలైన శాఖల కార్మికులు ఎప్పటికప్పుడు, జీతాలవిషయమై, సమ్మెలు జరుపుతామని బెదిరిస్తున్నారు. దేశంలో చలామణీలో వున్నసొమ్ము తగ్గలేదు సరికదా పెరుగుతున్నది. దిగుమతుల విధానం తిరిగి సవరణచేసి, దిగుమతులు తగ్గించటంవల్ల మార్కెట్లో వస్తువులు కనపడక, ధరలు పెరగడానికి అవకాశం ఏర్పడింది.

దేశంలో పారిశ్రామికవస్తువుల ఉత్పత్తి, నూతన పరిశ్రమల స్థాపన చాల మందగొండిగావుంది. పారిశ్రామికాభ్యున్నతికి భారత పారిశ్రామిక వేత్తలు ఏమాత్రము ఉపకరించటంలేదు; విదేశస్థుల పెట్టుబడిని ఆహ్వానించినాముగాని తగినంత, ప్రోత్సాహకరమైన ఫలితం కనపడటంలేదు. పెట్టుబడిదారులతో ప్రభుత్వం నిక్కచ్చిగా వ్యవహరించలేకపోతున్నది. స్వతంత్రభారత ప్రజా ప్రభుత్వం కేవలం సోషలిస్టు ప్రభుత్వంవలె ప్రారంభించి, క్రమేణా పెట్టుబడిదారీ వర్గానికి లోబడిపోతూ, ఎందునాకాకుండా, ఉభయులకు అసంతృప్తి కలిగిస్తున్నది. పారిశ్రామిక వేత్తల కోర్కెలను పూర్తిగా అంగీకరించి, వారిని

అనునయించటానికి ప్రభుత్వం ఒప్పుకోవటంలేదు; [illegible]లో పనిఏమిటని, వారిని నిర్లక్ష్యంచేసి, తానైపూనుకుని సత్వరార్థికాభివృద్ధికి కృషి చేయటంలేదు. ఈ అనిశ్చితవిధానమే ప్రమాదానికి దారితీస్తున్నది.

భాషారాష్ట్రాల సమస్య దేశంలో క్రొత్తవిద్వేషాలు, [illegible] భేదాలు కలిగించి, కాంగ్రెస్ విచ్ఛిత్తికి, దేశంలో అలజడికి కారణమైంది. ముఖ్యంగా దక్షిణదేశంలో కాంగ్రెస్ అగ్రనాయకులు ఈ సమస్యవల్ల తమ పలుకుబడిని నాశనంచేసుకుంటున్నారు. పాకిస్థాన్‌తో వ్యవహారాలు ఎప్పుడూ మనకు నష్టదాయకంగానే వుంటున్నవి. ప్రతి చిన్నవిషయంలోను పాకిస్థాన్ తన పంతమే నెగ్గించుకుంటున్నది. భారత ప్రభుత్వం పాకిస్థాన్‌తో కఠినంగా వ్యవహరించలేక ప్రజలలో అసంతృప్తికి పాలౌతున్నది.

స్వతంత్ర భారతదేశంలో, మొదటి సంవత్సరం జరిగినంతటి నిర్మాణాత్మక కృషికూడా ఈ సంవత్సరం జరగలేదు. నిర్మాణాత్మక కార్యలను గురించి, విద్య, ఆరోగ్యము, మొదలైన సామాజిక సేవాకార్యలను గురించి ఈ సంవత్సరం ఎవ్వరూ శ్రద్ధగా పట్టించుకోలేదు. రాజకీయంగాను, ఆర్థికంగాను ప్రజలు అసంతృప్తులుగా వుండి, దేశం అట్టడికి నట్టుడిపోతున్నది. దేశంలో ప్రతివిషయము అనిశ్చితంగాను, అయోమయంగాను, అనర్థకంగాను, ప్రమాదసూచకంగాను వున్నది. మన దేశము, మనప్రజలు, మనప్రభుత్వము ఇప్పుడొక గొప్ప విపత్కర పరిస్థితి నెదుర్కొంటున్నారు; భారతదేశం ఇప్పుడు ఒక రగులుకుంటున్న అగ్నిపర్వతంవలె వున్నది. ఇది క్రమేణా అణగిపోతుందో, రగులుకుని గప్పుమంటుందో ఎవరు చెప్పగలరు? దేశమంతా వెంటనే మేల్కొని, జాగ్రత్తగా వ్యవహరించుకుంటే ఇప్పటి పరిస్థితి చక్కబడి, దేశం అభ్యుదయపంథాలో నడవగల అవకాశం పూర్తిగా జారిపోలేదు. నవభారత చరిత్రలో, ప్రారంభదశలోనే ప్రాప్తించిన ఈ విపత్తు ఏవిధంగా పరిణమిస్తుందో జోస్యం చెప్పబూనటం అనవసరం.